# అపరాధ పరిశోధన

రు. 4 | డిసెంబర్ '79

సప్లిమెంట్



అపరాధ పరిశోధన అనుబంధం — 72

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## మృత్యువార్ల గూఢచారి

రచన: సికిందర్

## శనివారం రాత్రి అతిథి

రచన: వి. ఎస్. చెన్నూరి

## హత్యచేయని హంతకుడు

రచన: వసుంధర

## మొండి శవం?

రచన: వాణిశ్రీ

## అడుగు ముందుకు వేస్తే చస్తావ్!

పన్నెండవ భాగము—రచన: వసుంధర

**అపరాధ పరిశోధన సప్లిమెంట్ — 72**
డిసెంబరు, 1979
వెల: రు. 4-00
ఏడాది చందా 49 రూపాయలు
జీవిత చందా 325 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
**శ్యామదామోదర్ రెడ్డి**

సంపాదక వర్గం:
**టెంపోరావ్**
**శ్యాంబాబు**
**రమణశ్రీ**
**ఏ. వీ. మోహన్రావ్**
**సుజనశ్రీ**
**వసుంధర**
**విద్వాన్ షీలాదేవి**

కార్యాలయం:
**అపరాధ పరిశోధన కార్యాలయం**
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
**క్రాంతి ప్రెస్,**
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# మూడార్ల గూఢచారి

**'సికిందర్'**

ట్విన్ సిటీస్ డిటెక్టివ్ ఏజెన్సీ పార్ట్‌నర్స్ లాల్ అండ్ జాన్‌లు ఆఫీసు మూసి బయలుదేరడానికి సిద్ధమవుతుండగా, ఒక అపరంజిబొమ్మ లోనికి అడుగు పెట్టింది.

జాన్ కళ్ళు ఆమెపైన పడ్డాయి—

ఆమె వయసు సుమారు ఇరవై. మామూలు ఎత్తు, భుజాలవరకు కత్తిరించుకున్న జుత్తు, కత్తి అంచుల్లాటి పెదవులకి రక్తం పులిమినట్లున్న లిప్‌స్టిక్. చామనఛాయ వర్ణంలో ఆమె ధగ ధగ మెరిసిపోతూ, గ్రహాంతరాల నుంచి దిగుమతి అయినట్టు కన్పిస్తోంది.

లాల్ ఆమెను చూసి "ఎక్స్‌క్యూజ్ మీ.... ఆఫీసు టైం అయిదున్నర వరకే. రేపుదయం పదికి కలవండి...." అన్నాడు.

ఆమె ముందుకు వచ్చి "మిస్టర్ లాల్, అర్జెంట్ విషయం! మీరు విని తీరాలి!" అంది.

లాల్ అడ్డంగా తలూపాడు. "నో. మేం పంక్చువా

లిటీ కచ్చితంగా పాటిస్తాం. ఇది పోలీస్ స్టేషన్ కాదు—అవి రాత్రింపవళ్ళు తెరిచి వుంటాయి."

"మీ ఏజెన్సీ గురించి నేను విన్నదంతా హంబక్ అని ఇప్పుడు తెలుస్తోంది!" కసిరిందామె, "ఎటువంటి పరిస్థితిలోనైనా యెవర్నైనా రక్షిస్తారని విని.... ఇక్కడికొచ్చి—మిస్టర్ లాల్! ఈ నిస్సహాయ స్థితిలో నేనేం చెయ్యాలి?"

"మా దగ్గరికే రావాలని యెందుకనుకున్నారు? పోలీసుల దగ్గరికెందుకెళ్ళకూడదు?"

"ఎందుకంటే వాళ్ళకు నా గురించి తెలియకూడదు కాబట్టి!"

"అంటే?"

"నేను అదృశ్యం కావాలనుకుంటున్నాను!...." అందామె.

డిటెక్టివ్ లు గతుక్కుమన్నారు.

"ఎక్కడికి?" అడిగాడు లాల్.

"అది చెప్పకూడదు."

"మరిక్కడి కెందుకొచ్చారు?"

"మరో విషయం చెప్పటానికి—మీ సహాయం కోరడానికి."

"ఏమిటది?"

"మిస్టర్ లాల్, నేను అదృశ్యంకాదలిచాను. మీరు నాతో సహకరించాలి. నే నెక్కడికి అదృశ్యమవుతానన్నది మీ కనవసరం. నే నెక్కడ వున్నా, అపాయంలో యిరుక్కునే సూచనలు కనిపిస్తే మీకు ఫోన్ చేస్తాను. మీరు తక్షణం వచ్చి నన్ను ఆదుకోవాలి,

# 5.

అంతే. అందుకు మీకు కోరిన ఫీజు ఇవ్వగలను."

"మీరు ఎలాంటి అపాయంలో ఇరుక్కుంటారు?"

"చెప్పలేను. దొంగతనంలో ఇరుక్కోవచ్చు. హత్యలో యిరుక్కోవచ్చు.... వాళ్లు చాలా ప్రమాదకరమైనవాళ్లు. నన్ను గాలించేందుకు నామీద యేదేనా నేరం బనాయించి పోలీసు సహాయం కోరతారు— నేను వాళ్ళకు చిక్కకూడదు. ఈ విషయంలో మీ సహాయం కావాలి. సమయం వచ్చినప్పుడు మీకు కబురు చేస్తాను— మీరు నన్ను అపాయం నుంచి తప్పించడానికి ఏ పనైనా చేసి తీరాలి!"

"అంటే, చట్టవిరుద్ధమైన పనులు కూడానా?" అడిగాడు లాల్.

"చట్టవిరుద్ధమైన పనులు...." ఆమె కాస్సేపాలోచించి చటుక్కున అంది, "మీరు చట్టవిరుద్ధమైన పన్లు చెయ్యరని నాకు తెలుసు. ఇక దాని గురించి మాట్లాడి టైం వేస్టుచెయ్యడమెందుకు?"

"మంచిది. మీ రదృశ్యమవడానికి కారణమేమిటి? వాళ్ళంటే యెవరు....? వాళ్ళేం చెయ్యాలనుకుంటున్నారు....?"

"ప్లీజ్ మిస్టర్ లాల్. నన్నేమీ అడక్కండి. నేనెందుకు అదృశ్యమవాలనుకుంటున్నానో చెప్పను గానీ, నేనే నేరమూ చెయ్యలేదని చెప్పగలను. వాళ్ళు నాకు ప్రమాదకరమైనవాళ్ళు. వాళ్ళకి నేను దూరంగా వెళ్ళి వుండాలి, అంతే."

"ఎన్నాళ్ళు?"

"చెప్పలేను—కొన్నాళ్ళు."

# 6

"ఎప్పుడు వెళ్తున్నారు?"

"ఇప్పుడే."

"మంచిది. మీరు మాయమై యెక్కడున్నారో ఆపదలో యిరుక్కున్నప్పుడు ఫోన్ చేసి తప్ప చెప్పరన్న మాట?"

"అంతే."

"ఫోన్ చేసింది మీరేనని యెలా నమ్మాలి? మీ పేరేమిటి?"

"నా పేరుకూడా చెప్పను. నేనొక కోడ్ చెప్తాను- అప్పుడు నేనేనని నమ్ముతారు."

"చెప్పండి."

"మూడార్ల గూఢచారి" అందామె.

జాన్ అన్నాడు, "అది రా. వి. శాస్త్రి చెప్పే పొట్టి పిట్టల కథకుడు కదూ?"

"అవును."

లాల్ కాస్సేపాలోచించాడు.

"ఓ.కే, మిస్! మీ రపాయంలో యిరుక్కున్నట్లు తెలుసుకునే లోపున యిరుక్కుంటే మా బాధ్యత ఎటు వంటిది?"

"నా ఉద్దేశ్యంలో అపాయమంటే హత్య కాబడేంత పెద్దది కాదు. నా ప్రాణాలకు ప్రమాదంలేదు. కానీ, హింసింపబడవచ్చు, బంధింపబడవచ్చు. ఏదేనా నేరం మోపబడి జైల్లో కెళ్ళవచ్చు. ఇలాటి ఆపదల్ని నేను ముందు పసిగట్టి మీ రక్షణ కోరకపోతే, నాకు జరిగే నష్టానికి మీరు బాధ్యులు కారు."

"వెరీగుడ్. మరి ఫీజు సంగతి?"

"ఇప్పుడు వందరూపాయి లిస్తాను—అప్పుడు నా విష

యంలో మీకు శ్రద్ధ వుంటుంది. తర్వాత పరిస్థితినిబట్టి నా హృదయపూర్వకంగా చేత నైనంతవరకు యిచ్చు కుంటాను."

ఆమె బ్యాగు తెరిచి ఒక వందరూపాయిల కాయితం తీసి లాల్ కి అందించింది. ఆమె వెనుక టేబిల్ దగ్గర కూర్చున్న జాన్ కళ్ళు బ్యాగ్ లో పడి ప్రాపి రాగి నట్లయింది.

"అంతే, మిస్టర్ లాల్! మీరు చేయవలసిందల్లా నా నుంచి ఫోన్ వచ్చినప్పుడు నన్ను ఆదుకోడమే— సెలవు!"

ఆమె అదృశ్య మయ్యాక జాన్ ని చూసి అన్నాడు లాల్:

"వెల్, యేమిటి ఆమె అయిడియా జాన్?"

"ఈ మూడార్ల గూఢచారిణి ఏదో గూడుపుఠాణీ నడుపుతోంది!" అన్నాడు జాన్.

"నిజంగా? ఏమిటది?"

"ఆమె బ్యాగులో నోట్లకట్టలున్నాయి."

లాల్ కళ్ళు విశాలమయ్యాయి. "ఎన్ని?"

"చాలా వున్నాయి—వేలమీద వుండవచ్చు."

"ఎక్కడివి?"

"ఎక్కడో తస్కరించి వుంటుంది. లేదా—బ్రదర్! ఇదేదో లవ్ ఎఫైర్ కాదు కదా? పెళ్ళికి పెద్దలు ఒప్పు కోకపోతే ప్రియుడితో ఎక్కడికేనా ప్రోగ్రాం వేసు కుందేమో!"

"మరి మన సహాయం ఎందుకు?"

"ఆలోచించు! పారిపోయిన ప్రేమపక్షులు పెద్దల

చేతికి చిక్కితే వాళ్ళ గతేమిటి? ఆమె చెంపా, అతని వీపూ వాయించేస్తారు!"

"మరి మధ్యలో మనం వెళితే...."

"మనల్ని కూడా వాయించవచ్చు! ఆలోచించు!"

"ఆల్ రైట్" అన్నాడు లాల్ ఎర్రబడ్డ ముఖంతో. "అదే గనుక నిజమైతే ఈ వ్యవహారాన్ని జాగ్రత్తగా హాండిల్ చేసి, బ్యాండు మేళాలు ప్రోగ్రాం మార్చి వెయ్యాలి. ప్రేమికులంటే నాకు గౌరవం కదూ, జాన్?"

"అవును బాస్."

"అయితే వెంటనే రంగంలో దిగుదాం! కమాన్, మూడర్ల గూఢచారి—కాదు—గూఢచారిణి వెళ్ళి రెండు నిమిషాలవుతోంది. నువ్వామెని షాడో చెయ్యగలవా?"

"ఆమె యింకా యీ బిల్డింగ్ ప్రాంతాలే వుంటుంది. చెయ్యగలను."

"కమాన్, గెట్ ది హెల్ అవుటాఫ్ హియర్. క్విక్!" అన్నాడు లాల్.

## 2

మర్నాడుదయం 10-30కి జాన్ కనిపించాడు.

"ఎక్కడున్నావు యింతవరకూ....?" అడిగాడు లాల్.

"హోటల్ కంపాలా" జాన్ అన్నాడు సిగరెట్ వెలిగించి. అతని కళ్ళు ఎర్రగా వున్నాయి. ముఖం నీరసంగా వుంది.

"రాత్రంతా ఏం చేశావు?"

"ఆమెను బాడీగార్డు కనిపెట్టుకుని వున్నాను. లాల్! ఆమె నిజంగా గూఢచారిణి. ఆమెను స్పెషల్

బ్రాంచ్‌కి రికమెండ్ చేస్తే కళ్ళు మూసుకుని తీసుకుంటాను.”

“ఎలాగా?”

“అవును. ఆమె ఫోంలో చెయ్యలేక ప్రాణం విసిగింది. ఇక్కడనుంచి వెళ్ళి ఆమె బస్‌స్టాపులో డబుల్ డెక్కర్ ఎక్కింది. నేను ఆటోలో వెంబడించాను. ఆమె సెక్రటేరియేట్ దగ్గర దిగి అటూ ఇటూ చూడసాగింది. నేను కంటబడకుండా జాగ్రత్తపడ్డాను. తననెవరూ వెంటాడ్డం లేదని తెలుసుకుని ఆమె మరో బస్సు ఎక్కింది. బస్సు లిబర్టీ వేపు వెళ్ళింది.

“మళ్ళీ ఆమె అక్కడ దిగింది. థియేటర్ దగ్గర జనంలో కలిసిపోయింది. కాస్సేపటికి టికెట్ తీసుకుని లోని కెళ్ళడం గమనించాను. నేను కూడా బాల్కనీ టికెట్ తీసుకొని లోని కెళ్ళాను. కాని ఆమె అక్కడ లేదు! వెంటనే బయటికొచ్చి వాకబు చేశాను. ఆమె కిందికి వచ్చి గబగబా బయటి కెళ్ళి ఆటో ఎక్కి వెళ్ళిపోయిందట. అసలామె బాల్కనీలో కెళ్ళనే లేదు—టాయ్‌లెట్‌లో కెళ్ళి బయటికొచ్చింది.

“బయట ఆటోవాళ్ళని విచారిస్తే ఆమె ఆబిడ్స్ వెళ్ళడానికి అడిగినట్లు తెలుసుకున్నాను. వెంటనే నేనూ ఆటోలో బయలుదేరాను. గన్ ఫౌండ్రీ దగ్గర ఆమెని పట్టుకొన్నాను. ఆబిడ్స్ చేరుకున్నాక ఆమె దిగి, ఒక డిపార్టుమెంటల్ స్టోర్స్‌లో కెళ్ళింది. నేనూ వెళ్ళాను. అప్పటికి ఆమె నన్ను పసిగట్టిందేమోనని అనుమానం కలిగింది. ఆమె చాలా వస్తువులు షాపింగ్ చేస్తోంది. అలా కాదని క్షణాలమీద రెడ్డి హాస్టల్ రోడ్డులో నా ఫ్రెండ్

నస్రీన్ యింటికెళ్లి బురఖా, హీల్ చెప్పులు తొడుక్కుని వచ్చాను—"

"నస్రీన్ బురఖా వేసుకోదని చెప్పావు కదా?"

"ఒకప్పుడు వేసుకునేది. ఇప్పుడు తీసి మూలకి విసిరేసింది."

"ఆల్ రైట్, చెప్పు."

జాన్ అన్నాడు:—

"బురఖా వేసుకుని మన క్లయింట్ వున్న స్టోర్స్‌కి వచ్చాను. అప్పటికామె ఒక సూట్‌కేసు, టవల్, ఇతర టాయిలెట్ వస్తువులు మొదలైనవి ఖరీదు చేసింది. నేను ప్రక్కనే నిలబడి నెయిల్ పాలిష్ సెలెక్ట్ చేస్తున్నాను. సేల్స్‌మాన్ కళ్ళు నా చేతులమీద పడ్డాయి—నా వేషం పసిగట్టాడేమోనని భయపడి ప్రక్కకు తీసికెళ్లి, పది రూపాయలతో నోరు మూయించాను ఆమె షాపింగ్ పూర్తయ్యాక బిల్లు చెల్లించడానికి బ్యాగు తెరిచింది. నేను వెనకనే, దగ్గరగా నిలబడి వున్నాను. అప్పుడు—అప్పుడు—ఆమె వొంటి నుండి చక్కటి సువాసన వచ్చింది! కానీ, లాల్ ...." ఆగిపోయాడు. జాన్.

"ఏమిటి?"

"ఆమె భుజాలమీదుగా జాగ్రత్తగా వంగి—ఆమె బ్యాగులో నోట్ల కట్టల క్రింద రివాల్వర్ చూశాను" అన్నాడు జాన్.

"వాట్!"

"అవును. ఆమె బ్యాగ్‌లో రివాల్వర్ చూశాను. సింగిల్ యాక్షన్ రివాల్వర్. మొన్న ఫోరెన్సిక్ లాబ్‌లో అలాంటి రివాల్వర్ చూశాను కాబట్టి, అది ఏ మోడల్‌దో గుర్తుపట్టగలాను."

"ఆ తర్వాత?"

"ఆమె సూట్ కేసుతో బయటికెళ్లింది. అప్పటికి చీకటి పడింది. నేనుకూడ బయటికెళ్ళాను. ఆమె టైం చూసుకొని గాభరాగా జి.పి.ఓ. కేసి నడిచింది. అప్పుడు సమయం ఎనిమిది కావస్తోంది. అక్కడ ఆమె బస్ షెల్టర్ దగ్గర నిలబడి అటూ యిటూ చూడసాగింది. నేను ప్రక్కనే వున్నాను.

"సరిగ్గా అయిదు నిమిషాలు గడిచాక ఒక పొట్టిగా, లావుగా వున్న వ్యక్తి అక్కడి కొచ్చాడు. వయసు 40 వుంటుంది—బట్టతల. అతని వేషం చూస్తే విలాసంగా బ్రతుకుతున్నాడనిపించింది. అతనక్కడ నిలబడి ఆమెని గమనించకుండా సిగార్ లైటర్ తీసి మూడుసార్లు వెల్గించి ఆర్పేశాడు. ఆమె అది చూసి వేగంగా కదిలి వెళ్లింది. నేను కదిలే అవకాశం లేకపోయింది. వాళ్లిద్దరూ దూరంగా, ఏకాంతంగా నిలబడి వున్నారు. సభ్యత దృష్ట్యా నేను దగ్గరికెళ్ళలేకపోయాను. కానీ ఆమె నోటి నుండి 'మూడార్లు గూష్టనార్' అన్న మాటలు మాత్రం వినగలాను."

లాల్ తలాడించాడు. "ఆ తర్వాత?"

"అప్పుడు వాళ్లిద్దరు చాలా తక్కువ మాట్లాడు కున్నారు. అతను కోపంతో యేదో అన్నాడు. ఆమె బ్యాగును తడుముతూ చూపించింది. అతను అడ్డంగా తలూపి తొందర లేదన్నట్లు సైగ చేసాడు. అప్పుడామె కళ్లల్లో—లాల్—కన్నీళ్ళు మెరిశాయి. అతను సిగరెట్ వెల్గించి ఏదో చెప్పి వెళ్లి పోయాడు.

"నేనెవర్ని వెంటాడాలో తెలియని స్థితిలో పడ్డాను. అయితే ఆ మనిషి కంటే ఆమే ముఖ్యమనిపించింది,

కాబట్టి అతని కారు నెంబర్ వ్రాసుకుని వదిలేశాను" జేబులోంచి ఒక చీటీ తీసి యిచ్చాడు జాన్.

"ఇక అక్కడ్నుంచి ఆమెను వెంటాడాను. ఆమె మళ్ళీ ముప్పతిప్పలు పెడుతూ చివరికి తన నెవరూ కనిపెట్టడంలేదని నిర్ధారణ చేసుకొని హోటల్ కంపాలాలో కెళ్ళింది. అక్కడ రూం బుక్ చేసుకుంది—అయిదవ అంతస్తులో వన్—త్రీ—ఫోర్. నేను బురఖా తీసేసి రాత్రంతా పడిగాపులు కాశాను. ఆమె యిప్పటివరకు గది కదల్లేదు. ఫోన్ కాల్స్ వచ్చాయేమో చెప్పలేను. దట్సాల్."

అంతా విని అన్నాడు లాల్: "ఆమె సూట్ కేసు, టాయిలెట్ వస్తువులు మొదలైనవి యిక్కడ ఖరీదు చేసింది కాబట్టి, పరాయి ప్రాంతంనుండి అత్యవసరంగా వచ్చేసి వుండాలి."

"ఎలా చెప్పగలవు?"

"నువ్వు చెప్పింది వింటే అలాగే అనిపిస్తోంది. ఇది ప్రేమ వ్యవహారం కాదు—బ్లాక్ మెయిల్. ఆమె బ్లాక్ మెయిల్ లో యిరుక్కుంది. నువ్వు చూసిన ఆ పొట్టిమనిషి బ్లాక్ మెయిలర్. అతని మెసేజ్ అందుకొని ఆమె డబ్బుతో వెంటనే బయలుదేరి వచ్చేసింది. ఆమెది యీ వూరే అయితే టాయిలెట్ వస్తువులు కొని, హోటల్లో బస చేసే అవసరం లేదు."

"కానీ—ఈ సిటీ ఆమెకు కొట్టిన పిండే అన్నట్టు యెక్కడెక్కడో నన్ను తిప్పింది—పరాయి వూరిదెలా అవుతుంది?"

"బహుశా, యిక్కడికి తరచు వస్తుండవచ్చు. ఆమె వేషభాషలు చూశావా? ఆమెని చూస్తే యిక్కడే చదువు

పూర్తిచేసినట్టనిపిస్తోంది."

"కానీ—రివాల్వర్—అదెందుకు?"

"ఆత్మరక్షణకు."

"వెల్, ఆమె దగ్గర అంత డబ్బు, రివాల్వర్ వున్నాయి కాబట్టి ఆమె ధనవంతుల అమ్మాయే కావాలి. లాల్! ఆమె ఎలాటి బ్లాక్ మెయిల్ లో ఇరుక్కుందో వూహించ గలవా?"

"అవతలి పార్టీని మాస్తే, దర్జాగా బ్రతుకుతూ కారు మెయిన్ టెయిన్ చేస్తున్నాడు. అతను మామూలు బ్లాక్ మెయిలర్ కాదు. పెద్ద కేసులు చేపట్టే కాస్ట్లీ మనిషి—అతనెవరో తెలుసుకోవచ్చాం."

లాల్ ఫోన్ ఎత్తి, ఒక నెంబర్ డయల్ చేసి, కాస్సేపటి తర్వాత, "హల్లో కృష్ణన్!" అన్నాడు. ఆ తర్వాత పలకరింపులు ముగిశాక అన్నాడు, "మీరొక పని చెయ్యాలి. ఒక కారు రిజిస్ట్రేషన్ నెంబర్ చెక్ చేయాలి. యజమాని యవరో, అడ్రసు యేమిటో కూడా తెలుసు కోవాలి. థాంక్యూ. నెంబర్ ఎడిసి 1979—ఫియెట్, గ్రీన్ కలర్. ఓ.కే....యెందుకా? తర్వాత చెప్తాను."

ఫోన్ పెట్టేసి జాన్ తో అన్నాడు లాల్, "మూడార్ల గూఢచారి బ్లాక్ మెయిలర్ కి డబ్బు ఇంకా యెందుకు చెల్లించలేదు?"

"అదే ఆలోచిస్తున్నాను" అన్నాడు జాన్, "వాళ్ళ ఫార్మాలిటీస్ యేమిటో అర్థంకావడంలేదు. ఈ 'మూడార్ల గూఢచారి' కోడ్ బ్లాక్ మెయిలర్ ఆమెకు ఇచ్చివుంటాడు. అతను మూడుసార్లు సిగార్ లైటర్ వెల్గించడం, ఆమె ఆ కోడ్ చెప్పడం, ఒకర్నొకరు గుర్తించుకోడానికే నని అర్థమవుతోంది. అయితే, లాల్—ఆమె మనల్ని

కలుసుకొన్నట్లు బ్లాక్ మెయిలర్‌కి తెలిస్తే ఏమవుతుంది?"

"తెలుసుకోలేడు. ఒకవేళ తెలుసుకుంటే, డబ్బు కలెక్టు చేసుకునే సమయానికి యెవరో అమ్మాయి చేత పలికించి, మనల్ని ఎక్కడికో పంపేస్తాడు. ఇక మన బెడద వుండదు కాబట్టి, తన క్లయింట్ దగ్గరికెళ్ళి, డబ్బు తీసుకొని విలాసంగా డ్రైవ్ చేసుకుంటూ వెళ్ళిపోతాడు."

"ఆమె డబ్బు చెల్లించడానికి సిద్ధపడినప్పుడు ఎలాంటి అపాయాన్ని ఆశిస్తోంది?"

"అపాయం బ్లాక్ మెయిలర్ వల్ల కాకపోవచ్చు—"

"మరి?"

ఫోన్ మోగింది.

ఇద్దరూ తటపటాయించారు.

"కృష్ణన్ అనుకుంటాను" అన్నాడు లాల్ రిసీవర్ అందుకుంటూ "యస్? లాల్ హియర్."

అవతలినుంచి ఆకర్షణీయమైన, మృదువైన స్త్రీ కంఠం పలికింది. "సూడార్ల గూఢచారి."

లాల్ ముందుకు తూలాడు. "యస్?"

"మిస్టర్ లాల్! మీరు త్వరగా రావాలి! హోటల్ కంపాలా—రూం నెంబర్ నూటాముప్పైనాలుగు. వెంటనే బయలుదేరి వస్తే సంతోషిస్తాను. లేదా—వాళ్ళు—నన్ను—" ఆగిపోయిందామె.

"ఎవరు వాళ్ళు? ఏం చేస్తున్నారు?"

"నామీద దొంగతనం మోపుతున్నారు! డబ్బుకోసం బలవంత పెడుతున్నారు....! మీరు వెంటనే రండి....!"

"ఆగండి. మిమ్మల్ని వాళ్ళు ఫోన్ యెలా చేయనిచ్చారు?"

"ఎవరొచ్చినా వాళ్ళను ఆపలేరట — పోలీసులు కూడా!"

"ఆల్ రైట్, మేం వెంటనే వస్తున్నాం. మీరక్కడే వుండండి. వాళ్ళని వెళ్ళనివ్వకండి. వాళ్ళు మిమ్మల్ని హింసిస్తున్నారా?"

"లేదు—దుర్భాషలాడుతున్నారు!"

"మేము వచ్చేవరకు నోరు మూసుకుని వుండకపోతే, తగిన శాస్తి జరుగుతుందని చెప్పండి."

"అలాగే లాల్."

లాల్ రిసీవర్ పెట్టేసి, గబగబ జాన్‌కు వివరించి బయటికి దారితీశాడు.

# 3

హోటల్ కంపాలాలో పాలపుంత రూపవతి పేరుతో గది తీసుకున్న "మూడార్ల గూఢచారి' డిటెక్టివ్‌లను చూసి, "మిస్టర్ లాల్! థాంక్ గాడ్, మీరొచ్చేశారు! లేకపోతే వాళ్ళు నన్ను—" అనర్చింది, సోఫాలో కూర్చున్న యిద్దరు స్త్రీ పురుషుల్ని చూపిస్తూ.

లాల్ ఆమె భుజం తట్టాడు, "టేకిట్ ఈజీ....నో ఎక్సైట్‌మెంట్. వెల్, మీ రిద్దరెవరు?"

ఆ ఇద్దర్లో స్త్రీకి యాభై యేళ్ళుంటాయి, పురుషుడికి పాతికేళ్ళుంటాయి.

"నా పేరు కళ్యాణి, దాని పిన్నిని" అందామె, "వీడు నా కొడుకు, నవీన్."

"పిన్నీ! మర్యాదగా మాట్లాడు....!" అరిచింది రూప.

"మిస్ రూప, అలా ఉద్రేకపడకండి" అన్నాడు లాల్, "మిసెస్ కళ్యాణి, యేమిటి పేచీ? మీరు రూప

మీద దొంగతనం మోపుతున్నట్లు విన్నాను. నిజమేనా?...."

"అవును. అది మా డబ్బు తీసుకుని పారిపోయి వచ్చింది."

"ఎక్కడినుంచి?"

"వరంగల్ నుంచి."

"కాదు! అన్నీ అబద్ధాలు చెప్తోంది! ఆ డబ్బు ఆమెది కాదు!" అరిచింది రూప.

"మిసెస్ కళ్యాణి, ఆ డబ్బు మీదని రుజువుందా?"

"డబ్బుకి రుజువా? ఎలా వుంటుంది? ప్రతి నోటుమీద పేరు వుంటుందా?"

"పేరు వ్రాసుకున్నంత మాత్రాన డబ్బు మీ స్వంతం కాదు—అది చేతులు మారుతుంది. నేనడిగింది దాని వునికి గురించి. ఆ డబ్బు మీ కెక్కడిది? యెక్కడ పెట్టారు? యెంత మొత్తం? మొదలైనవి చెప్పండి."

నవీన్ అన్నాడు: "ఆ డబ్బు మా సేఫ్‌లోంచి పోయింది. అయిదువేల రూపాయలు. మొన్న ఉదయం నేనొక డ్రాఫ్ట్ మార్చి తెచ్చాను. నిన్న ఉదయం పాతిక వేల బ్యాంక్ హుండీ విడిపించవలసి వచ్చి చూస్తే సేఫ్‌లో డబ్బు మాయమైంది."

"సేఫ్‌లో ఎంత మొత్తం వుంది?"

"ఏడువేల చిల్లర."

"ఏ డినామినేషన్‌లో?"

"అన్నీ పదులే."

"పాతికవేల బ్యాంక్ హుండీకి మిగతా డబ్బెక్కడ వుంది?"

"బ్యాంక్ యెకౌంట్‌లో సుమారు 18 వేలు ఉంది."

"మీరు డ్రాఫ్ట్ యెకౌంట్‌లో క్రెడిట్ చెయ్యకుండా డబ్బు యెందుకు మార్చుకున్నారు? మీరు చేసే బిజినెస్ యేమిటి?"

"ఫర్నిచర్. పదిరోజుల క్రితం ఒక పార్టీనుంచి అయిదు వేలు చేబదులు తెచ్చాను. అది తిరిగి యివ్వడానికి డ్రాఫ్ట్ మార్చి డబ్బు తెచ్చాను. కానీ అతను రాలేదు...."

"చేబదులు దేనికి తీసుకున్నారు?"

"బిజినెస్‌లో అనేక అవసరా లుంటాయి."

"మీ బ్యాంక్‌లో 18 వేల రొక్కం ఎప్పటినుంచి వుంది?"

నవీన్ ముఖం ఎర్రబడింది.

"ఏమిటిది?" తల్లి నడిగాడు, "ఎవరి ప్రశ్నలకు ఎవరు జవాబు చెప్పాలి? అది మన డబ్బుతో పారిపోయి వచ్చింది, పైగా వీళ్ళెవరో మనల్ని ప్రశ్నిస్తున్నారు! యేమిటిది?"

కళ్యాణి అంది, "లాల్ గారూ, ఈ ప్రశ్నలతో ప్రయోజనం యేమిటి? ఆమె డబ్బుతో పారిపోయి వచ్చినట్లు రుజువు వుంది. ఆ డబ్బు మాకు తిరిగి యివ్వాలి. లేదా మేం పోలీసుల దగ్గరి కెళ్తాం—దాని ప్రతిష్ఠకు దెబ్బ!"

లాల్ నవ్వాడు.

"రుజువుల దాకా పోయేముందు నాకు కొన్ని వివరాలు కావాలి. మీ బిజినెస్‌లో పార్ట్‌నర్స్ ఎవరు?"

# 18

"ఎవరూ లేరు. ఓజినెస్ నాది. లావాదేవీలన్నీ నవీన్ చూస్తాడు."

"అంటే, లావాదేవీల గురించి మీకేమీ తెలియదా?"

"ఎందుకు తెలియదు? తెలుసుకొంటూంటాను."

"సేఫ్‌లో డబ్బు ఏడువేలలో సరిగ్గా అయిగువేలే పోయింది కదూ?"

"అవును. లాల్ గారూ, మీరిన్ని ప్రశ్నలడుగుతోంటే కొన్ని అనుమానాలొస్తున్నాయి."

లాల్ నవ్వాడు. "ఏమిటవి?"

ఆమె నిట్టూర్చింది, "ఆ డబ్బు రూప తీయలేదని పిస్తోంది."

"ఏమిటీ?" అర్చాడు నవీన్, "నీకు పిచ్చి పట్టింది! ఆమెగాక యింకెవరు తీస్తారు? నీ దగ్గరవున్న సేఫ్ తాళాలు ఆమె దగ్గరికెలా వెళ్ళాయి?"

"నువ్వు నోర్ముయ్యి! రూప గురించి పిచ్చిగా మాట్లాడా వంటే చెంపలు పగలగొడ్తాను!"

"కళ్యాణిగారూ, మీకు రూపమీద అనుమానం ఎలా వచ్చింది?" అడిగాడు లాల్.

కళ్యాణి అంది:

"మొన్న సాయంత్రం రూప మా యింటికొచ్చింది. దాని అన్నయ్య వినోద్ స్కూటర్ ఆక్సిడెంట్‌లో బాగా దెబ్బలు తగిలి నర్సింగ్ హోంలో చేరాడు. రెండు రోజులుగా శోష లేదు. రూప యింటికి వచ్చి మౌనంగా, ఒంటరిగా కూర్చుంది.

"నవీన్ కూడా యింట్లోనే వున్నాడు. ఆమె వచ్చిన

కాన్సెపటి తర్వాత నేను స్నానానికెళ్ళి వచ్చాను. అప్పుడు రూప వెళ్ళిపోయింది.

"కానీ—మర్నాడుదయం 10 గంటలకు గాభరాగా వచ్చింది. చాలా భయపడినట్లు కన్పించింది. ఏమిటని అడిగాను. మొదట ఆమె అన్నయ్యకు సీరియస్ అయిందను కొన్నాను. కానీ—ఆమె నా చేతిలో తాళంచెవుల గుత్తి పెట్టి అవి తమ యింట్లో కెలా వచ్చాయో అర్థంగావడం లేదని చెప్పింది."

"ఆ తర్వాత?"

"నాకూ యేమీ అర్థం కాలేదు. మా సేఫ్ తాళాలు ఆమె యింట్లోకెలా వెళ్ళాయి? ఆ సంగతి దేవు డెరుగు! కానీ, నవీన్ కేదో అనుమానం వచ్చి సేఫ్ తెరిచి చూశాడు—అందులో అయిదు వేలు పోయాయి!"

"ఆ తర్వాత?"

"వెంటనే ఆ పని రూప చేసిందని నా కనుమానం వచ్చింది. నిన్న సాయంత్రం నేను స్నానాని కెళ్ళినప్పుడు చీర కుచ్చిళ్లలో పెట్టుకునే తాళంచెవులగుత్తి పడగ్గదిలో తలగడ క్రింద పెట్టాను. ఆ తర్వాత దాని విషయమే మర్చిపోయాను—ఉదయం రూప వచ్చేవరకూ. నిన్న సాయంత్రం ఆమె దాన్ని తీసుకొని, డబ్బుకోసం ప్రయత్నించిందనుకుంటాను. కానీ, నవీన్ యింట్లోనే వుండటం వల్ల వీలుగాక ఆ సాయంత్రం వెళ్ళిపోయి, రాత్రి యెప్పుడో వచ్చి సేఫ్ తెరిచిందనుకున్నాను. నవీన్ కూడా ఇలాగే అన్నాడు."

"చాలా బాగా వూహించారు. అప్పుడేం చేశారు?...."

"డబ్బు పోయిందని తెలిశాక వెంటనే రూప యింటి

కెళ్ళాం. అక్కడా ఆమె లేదు. నర్సింగ్ హోం కెళ్ళాం. అక్కడా లేదు. పావుగంట క్రితం వచ్చి వెళ్ళిందని చెప్పారు.

"ఆమె యెక్కడికి కెళ్ళిందో, ఆ డబ్బుతో యేం చేస్తుందో ఆ రోజంతా మా కర్థంగాలేదు!"

"మరి యిక్కడ వున్నట్టు యెలా తెలిసింది?"

"ఈ ఉదయం నవీన్ చెప్పాడు—రూప హైద్రాబాదులో ఫలానా హోటల్ లో వున్నట్లు కబురు వచ్చిందని."

"ఎవరు చేశారు?"

"అతని స్నేహితుడెవరో ఆమెని యీ హోటల్ లో చూశాడట. ఆమె యిక్కడి కెందుకొచ్చిందో అర్థంగాక, యెందుకైనా మంచిదని నవీన్ కు ఫోన్ చేశాడట. మేం వెంటనే బయలుదేరి వచ్చేశాం!"

"అవును. అదృష్టవంతులం!"

"అయితే యిప్పుడు మీ అభిప్రాయమేమిటి? ఆ డబ్బు రూప దొంగిలించిందంటారా?"

"లేదు, లేదు. అలా అనిపించడంలేదు. నా కిప్పుడంతా తెలిసిపోతోంది. ఇదంతా నవీన్, రూపమీదకు కల్పించినటర్థమవుతోంది! ఇంటి పరువు తీసే ఇలాంటి వెధవకి నేను జన్మనిస్తాననుకోలేదు!"

"ఏమన్నావ్?" నవీన్ తల్లిమీదకు ఎగిరాడు.

జాన్ వెనక్కి లాగాడు, "ప్లీజ్ సిడవున్."

"వెల్, మాడమ్. మీ కుమారుడిపైన నే నెలాంటి ఆరోపణ చెయ్యను. మీరు కూడ అప్పుడే యెలాంటి నిర్ణయానికి రాకండి. ముందు నిజా నిజాలు తెలుసుకోండి. ఆ బదులు యిచ్చిన మనిషి పెట్టిన గడువు యెంతవరకో,

యెంత మొత్తం యిచ్చాడో తెలుసుకోండి. ఇక, రూప డబ్బు తీసివుంటే, తిరిగి వచ్చి తాళం చెవులు మీ కందించే అనవసరపు ఆర్భాటంతో తనకు తాను కమిట్ అవాలనుకోదు. కాబట్టి—ఈ విషయం కూడ ఆలోచించండి."

"మంచిది, లాల్."

"అంటే— నే నబద్ధం చెప్తున్నానా!" అరిచాడు నవీన్. "అయితే ఆమె యిక్కడి కెందుకొచ్చినట్టు? అక్కడామె అన్నయ్య తెలివితప్పి పడివుంటే ఇక్కడేం చేస్తున్నట్టు? చెప్పండి!"

"మీకు నేనేమీ చెప్ప నవసరంలేదు. రూప కూడ చెప్పనవసరంలేదు. మీరు డబ్బు పోయిందని గొడవ చేస్తున్నారు. దమ్ముంటే పోలీసుల దగ్గరి కెళ్ళండి" అన్నాడు లాల్.

"ఆల్ రైట్, ఆమెను కూడ తీసి కెళ్తాను."

"అది పద్ధతి కాదు. ముందు మీరు వెళ్ళి రిపోర్టు ఇవ్వాలి."

"నో, నో. ఆమె కూడా నాతో రావాలి."

"ఆమె మీతో రాదు."

"రాకపోతే లాక్కెళతాను!"

"ఆమె ఒంటిమీద చేతులేస్తే మెడ విరగ్గొడతాను!" కఠినంగా అన్నాడు లాల్.

నవీన్ చులకనగా చూశాడు.

"మీరు చాలా సున్నితంగా వున్నారు, ఆ పని చేయలేరు!"

"మరి నేనెలా వున్నాను?" అన్నాడు జాన్, చేతులు జాపి, ముందుకు వచ్చి. "ఒక్కసారి బ్రూస్‌లీని వూహిం

చండి! ఆ తర్వాత దేవుడ్ని తలచుకోండి! క్షేమంగా వుండాలనుకుంటే వెంటనే యిక్కడ్నుంచి వెళ్ళిపోండి! గెట్ అవుట్! లేదా బయటకు గిరవాటేస్తాను!"

కళ్యాణి లేచి నవీన్ చెయ్యిపట్టి బయటికి లాక్కెళ్ళింది. అతన్ని కారిడార్‌లో తోసి, వెనక్కి తిరిగి రూపతో అంది, "రూపా, నీ మనసును అనవసరంగా బాధ పెట్టాను. నువ్వేమీ అనుకోవు కదూ?"

# 4

లాల్ సిగరెట్ వెలిగించి రూప కళ్ళలోకి సూటిగా చూశాడు. ఆమె కళ్ళు దించుకుని నేలచూపులు చూడసాగింది.

"వెల్, మిస్ రూప. ఇప్పుడు చెప్పండి. మూడార్ల గూఢచారి ఏమిటి? ఆ బ్యాగులో డబ్బు యేమిటి? రివాల్వర్ ఏమిటి—"

"ఓహ్ లాల్! మీకు తెలుసా?" అర్చిందామె.

లాల్ నవ్వాడు, "తెలుసు."

"మీరు ఘటికులు! అసాధ్యులు!"

"తిడుతున్నారా?"

"లేదు! ఈ గండం నుంచి నన్ను రక్షించారు. లేకపోతే వాడు నన్ను పోలీసులకి....ఓహ్! యూ ఆర్ మార్వలెస్ లాల్! మీరు లేకపోతే మా ప్రతిష్ట బజారు పాలయ్యేది!"

"మీ ప్రతిష్ట....బహువచనమా?"

"అవును."

"దేనికి?"

"ఇది మా కుటుంబానికి సంబంధించిన వ్యవహారం కాబట్టి!"

లాల్, జాన్ని ఓరగా చూసి రూప నడిగాడు:

"మీ కుటుంబ సభ్యులెవరు?"

"నేను—నా అన్నయ్య."

"తలిదండ్రులు?"

"లేరు."

"ఇందాక వచ్చిన పిన్ని....?"

"మా బాబాయి భార్య."

"మీకు బిజినెస్ వుందా?"

"వుంది—ఆటో మొబైల్—అన్నయ్య చూస్తాడు."

"మంచిది. ఇక ప్రశాంతంగా కూర్చొని, వివరంగా జరిగిందేమిటో చెప్పండి."

ఆమె గడియారం చూసుకుంది.

"ఓహ్, ఇంకా ముప్పావు గంటే వుంది!"

"దేనికి?"

"బ్లాక్ మెయిలర్ రావడానికి."

"ఓహో....పరవాలేదు. గబగబ చెప్పండి."

రూప అంది. "లాల్! ఈ రెండురోజులుగా నా మనసు మనసులో లేదు! అన్నయ్య స్కూటర్ ఆక్సిడెంట్లో బాగా గాయపడ్డాడు. రెండు రోజుల నుంచి స్పృహ లేదు! నా కెంత భయంగా వుందో మీ కెలా చెప్పను! అటు నా అన్నయ్య ప్రాణభయం—ఇటు మా కుటుంబ ప్రతిష్ట గురించి భయం—నా పరిస్థితి యెలా వర్ణించను!

"మొన్న సాయంత్రం పిన్ని యింటికి వెళ్ళివచ్చినమాట నిజమే. కానీ—ఆ తాళంచెవుల గురించి నాకేమీ తెలియదు! ఆ రాత్రి చాలా సేపటివరకు అన్నయ్య దగ్గరే వుండి యింటికెళ్ళి నిద్రపోయాను.

"ఉదయం తొమ్మిదిగంటలకు లేచి స్నానం చేసి నర్సింగ్ హోం కెళ్ళడానికి సిద్ధమయ్యాను. ఇంతలో డ్రాయింగ్ రూంలో ఆ తాళాలగుత్తి చూసి తికమక పడ్డాను. అది పిన్నిదని గుర్తించి అక్కడికెలా వచ్చిందో నని ఆలోచించాను. ఒకవేళ పొరపాటున నేనే తెచ్చా నేమోనని భయపడ్డాను. వెంటనే దాన్ని తీసికెళ్ళి పిన్ని కిచ్చి, అది మా యింట్లోకెలా వచ్చిందో అర్థంగావడం లేదన్నాను. ఆమె దాన్ని తీసుకుని మౌనంగా ఆలోచి స్తూండిపోయింది.

"నే నక్కడి నుంచి బయలుదేరి నర్సింగ్ హోం కొచ్చాను. అక్కడ అన్నయ్య పరిస్థితి అలాగే వుంది. నేను బెడ్ ప్రక్కన స్టూలుమీద కూర్చొని తలగడ సరి చేస్తుండగా, దాని క్రింద నా చేతివేళ్ళకి ఏదో తగిలింది. చెయ్యి క్రిందికి పోనిచ్చి దాన్ని బయిటికి తీశాను. అది కాయితం. మడత పెట్టి వుంది. అందులో విషయం చదివాక నా గుండె—నా గుండె—"

"అందులో ఏముంది? అదిప్పుడు మీ దగ్గరే వుందా?" అడిగాడు లాల్.

ఆమె తేలికపడింది. "లేదు. చదివి వెంటనే చింపే శాను. కానీ అందులో విషయం జ్ఞాపకముంది."

"ఏమిటది?"

"ఫోటోలు క్షేమంగా వుండాలంటే, ఎనిమిదవ తారీఖున రాత్రి ఎనిమిది గంటలకు జి.పి.ఓ. బస్ షెల్టర్ దగ్గర డబ్బుతో రావాలి. మధ్యవర్తిని పంపే పత్రంలో యీ కోడ్ గురించి చెప్పాలి. నేను మూడుసార్లు సిగార్ లైటర్ వెల్గించి ఆర్పేస్తాను—అతను నా దగ్గర కొచ్చి 'మూడార్ల గూఢచారి' అని చెప్పాలి."

"క్రింద సంతకంగానీ, పేరుగానీ వుందా?"

"లేదు."

"వెల్, మీ రప్పుడేం చేశారు?"

"అన్నయ్య బ్లాక్ మెయిల్ లో యిరుక్కున్నాడని గ్రహించాను. ఆ కాయితంలో ఫోటోల విషయం వ్రాసి వుంది. అన్నయ్య అలాటి పనులు చేస్తాడని నేను కలలో కూడా అనుకోలేదు. బ్లాక్ మెయిలర్ అక్కడికొచ్చి ఆ కాయితం పెట్టివెళ్ళాడని గ్రహించాను. ఏం చెయ్యాలో నాకు పాలుపోలేదు. కానీ—మిస్టర్ లాల్—తలగడ క్రింద యేదో యెత్తుగా కన్పిస్తోంటే చూశాను. అవి—అవి—నోట్లకట్టలు!"

"ఎన్ని?"

"అయిదు—పది రూపాయల కట్టలు—అయిదువేల రూపాయలు."

"చాలా వింతగా వుంది."

"అవి అక్కడికెలా వచ్చాయో నా కంతుబట్టలేదు. నేను ఆలోచించదలచలేదు. ఎనిమిదవ తారీఖు అదే రోజు. ఆ డబ్బు బ్లాక్ మెయిలర్ కివ్వకపోతే ఏమవుతుందో మీకు తెలుసు. అన్నయ్య స్పృహలో లేడు. ఈ ఉపద్రవాన్ని నేను తప్పించకపోతే మేము.... మేము.... బ్లాక్ మెయిలర్ మమ్మల్ని నాశనం చేస్తాడు! వెంటనే యిక్కడికొచ్చేశాను, అంతే."

"ఇక్కడికొచ్చి ఏం చేశారు?"

"ఇక్కడికొచ్చాక నే నెంత పొరపాటు చేశానో తెలుసుకున్నాను! ఉదయం మా యింట్లో పిన్ని తాళాలు దొరికాయి. వాటిని ఆమెకు యిచ్చాను. అవి మా ఇంట్లో యెందుకున్నాయో యిక్కడి కొచ్చాక బోధపడింది...."

నేను తెచ్చిన డబ్బు ఆమె సేఫ్‌లోంచి యెవరో తీసి, అన్నయ్య తలగడ క్రింద పెట్టి, సేఫ్ తాళాలు మా యింట్లో పారేశారు!

"ఇక వూహించండి! పిన్ని సేఫ్‌లో డబ్బు పోయిందని తెలుసుకొని దొంగతనం నా పైన మోపుతుంది!

"కానీ— నే నా డబ్బుతో ఆమె దగ్గరికి తిరిగి వెళ్ళాలనిపించలేదు. ఇక్కడ బ్లాక్ మెయిలర్ కివ్వాలి. అన్నయ్యను కాపాడాలి. నే నా డబ్బు దొంగిలించలేదు. అయినా పిన్ని సులభంగా నన్ను దొంగని చేస్తుంది. అందుకే భయపడి మీ దగ్గరికి కొచ్చాను. పిన్ని నన్ను గాలించి పట్టుకుని పోలీసుల కప్పగించవచ్చని భయపడ్డాను. అందుకే మీ సహాయం కోరాను. డబ్బు బ్లాక్ మెయిలర్ కి ఇచ్చేవరకు నే నెలాంటి గొడవలోనూ ఇరుక్కోకపోతే, ఆ తర్వాత ఏమైనా ఫరవాలేదనుకున్నాను. అంతే, లాల్, అంతే."

లాల్ నిట్టూర్చి అన్నాడు: "మీ అన్నయ్య శ్రేయోభిలాషి యెవరో ఆ డబ్బు అక్కడ పెట్టాడనుకున్నా, తాళంచెవులు మీ ఇంట్లో యెందుకు పారేస్తాడు?"

"అదే అర్థం గావడం లేదు. ఆ పని నవీన్ చెయ్యలేదా?"

"నవీన్ డబ్బు తీశాడని అనుకుంటే మిగతా రెండు పన్లు యే ఉద్దేశ్యంతో చేశాడో అంతు పట్టడంలేదు."

"నాకూ అంతుపట్టడంలేదు."

"వెల్, బ్లాక్ మెయిలర్ ఏమన్నాడు?"

"నిన్న కలుసుకున్నాను. ఆ డబ్బు చాలదన్నాడు."

"అంటే—"

"అవును, లాల్. ఉత్తరంలో అతను ఎంత మొత్తం

కావాలో సూచించలేదు. ఆ అవసరం లేదన్నాడు. ఈ వ్యవహారం కొత్తకాదు గనుక యెప్పటిలాగే పదివేలు కావాలన్నాడు."

"వాట్! అతను మీ అన్నయ్యను యెప్పటినుండి పీడిస్తున్నాడు?"

"ఏమో! నా తల బ్రద్దలవుతోంది. అన్నయ్య యిలా చేస్తున్నాడని నా కెన్నడూ తెలియదు!"

"మీ అన్నయ్య తరచు యిక్కడికి కొస్తుంటాడా?"

"అవును. నే నిక్కడ చదువుకు నేటప్పుడు నా దగ్గరే వచ్చి వుండేవాడు. ఈ సంవత్సరం నా చదువు ముగిసి వెళ్ళిపోయాక హోటల్ లో దిగుతున్నాడు."

"ఓ. కే. మీ రిప్పు డేం చేయాలనుకుంటున్నారు?

"నా కేమీ తోచడం లేదు. అతను ఒంటిగంటకు యిక్కడికొస్తా నన్నాడు. ఆ సమయానికి డబ్బు సిద్ధం చెయ్యాలన్నాడు."

"పదివేలా?"

"అవును."

"చేశారా?"

"లేదు—నా దగ్గర అయిదు వేలే ఉన్నాయి."

"అయితే యెలా?"

"అతన్ని ఒప్పిస్తాను. ప్రాధేయపడతాను—ఈ సారి కింతటితో సరిపెట్టుకోమని. అతను చాలా మెత్తటి హృదయంగలవాడిలా కనిపించాడు. నా మాట తప్పక వింటాడు."

"కానీ మీ రా పని చెయ్యకూడదు."

"ఎందుకు?"

"బ్లాక్ మెయిలర్ తో యెప్పుడూ రాజీ పడవద్దు. మీ

రొక్కసారి లొంగితే జీవితాంతం అతనికి బానిసగానే వుండిపోతారు. మీ దగ్గర యిక యేమీ మిగలేదనుకునేంత వరకూ పీల్చి పిప్పి చేస్తాడు. ఆ తర్వాత మీరు బ్రతికినా చచ్చినవారితో సమానం. కాబట్టి అలాటి పరిస్థితి రాకుండా వుండాలంటే తెగించి బ్లాక్ మెయిలర్ని ఎదుర్కోవాలి!

"బ్లాక్ మెలర్ మీ అన్నయ్యను చాలా కాలం నుండి పీడిస్తున్నాడు. ప్రతి ఇన్స్టాల్ మెంట్ కి పదివేల చొప్పున లాగుతున్నాడు. ఇంతవరకు యెంత లాగాడో, ఇకముందు యింకెంత లాగుతాడో ఆలోచించండి. మీ పరువు ప్రతిష్టల సంగతి యెలా వున్నా ఆర్థికంగా చితికి పోతారు. వీధిపాలవుతారు. ఆ స్వంతా పాడుచేశాడని అన్నయ్య విమర్శలకి గురవుతాడు, మీ పెళ్ళి జరగడం దుర్లభం అవుతుంది."

"అయితే నే నిప్పుడేం చెయ్యాలి?"

"ఆ డబ్బుతో తిరిగి ఇంటికెళ్లిపొండి. ఏమీ తెలియనట్లు ప్రవర్తించండి. ఈ బ్లాక్ మెయిల్ గురించి మీకు తెలిసినట్లు మీ అన్నయ్యకు తెలిస్తే బావుండదు. మీ ముందు తలెత్తుకోలేడు. గిల్టు కాంప్లెక్స్తో యే అఘాయిత్యమైనా చేసుకోవచ్చు. కాబట్టి ఏమీ తెలియనట్లు ప్రవర్తించండి."

"మరి ఆ డబ్బు?"

"ఎక్కడ వుంది."

"ఆ బెడ్ క్రింద."

లాల్, జాన్కు సైగ చేశాడు. జాన్ వెళ్ళి పరుపు క్రిందనుంచి అయిదు నోట్లకట్టలు, ఒక రివాల్వర్ తీశాడు.

రివాల్వర్ సిలెండర్ తెరిచి అందులో ఆరు గుళ్ళున్నా యని చెప్పాడు.

"ఆల్ రైట్, ఈ డబ్బు తీసికెళ్లి బ్యాంక్‌లో డ్రాఫ్ట్ తీయండి—మీ అన్నయ్య పేరుతో. ఆ తర్వాత వరంగల్ వెళ్లిపొండి. డ్రాఫ్ట్ మీ దగ్గరే వుంచుకోండి. ఒక మాట: ఈ రివాల్వర్ మీరే ఉద్దేశ్యంతో తెచ్చారు?"

"భయంకొద్దీ—ఆత్మరక్షణకు."

లాల్ నవ్వాడు. "వెల్, దాన్ని తీసికెళ్ళి యధా స్థానంలో పెట్టేయండి. మరో పది నిమిషాల్లో బ్లాక్ మెయిలర్ వస్తాడు. అతనితో నేను మాట్లాడుతాను. మీరు వెళ్ళి బాత్‌రూంలో వుండండి. చప్పుడు చెయ్య కూడదు. జాన్ ఇప్పుడే బయటికెళ్ళి కార్లో అతనికోసం ఎదురుచూస్తుంటాడు. బ్లాక్ మెయిలర్ నాతో మాట్లాడి వెళ్ళిపోయాక జాన్ వెంబడించి అతని చర్యలు కని పెడతాడు.

"నౌ, మూవ్ ఫాస్టు జాన్."

# 5

సరిగ్గా ఒంటిగంటకు కాలింగ్ బెల్ మ్రోగింది.

లాల్ సోఫాలో సిగరెట్ కాలుస్తూ ఆలోచిస్తు న్నాడు. కాలింగ్ బెల్‌ను పట్టించుకోలేదు. మరోసారి మ్రోగింది. లేచి నిలబడ్డాడు. మూడవసారి మ్రోగినప్పుడు వెళ్ళి తలుపు తీశాడు.

అవతల పొట్టిగా, లావుగా వున్న మనిషి లాల్‌ని చూసి, "ఎక్స్‌క్యూజ్ మీ.... నేను పొరబడ్డాను...." అన్నాడు.

లాల్ చిన్నగా నవ్వాడు, "లేదు. మీ రనుకున్న చోటుకే వచ్చారు."

అతను ముఖం చిట్లించాడు, "అయితే మీరు...."

"మూడార్ల గూఢచారి."

అతను ఉలిక్కి-పడ్డాడు, "కానీ—నిన్న—ఆమె—"

"ఆమె వెళ్ళిపోయింది. నేను వచ్చాను. డీల్ సెటిల్ చేసుకోవడానికి ఎవరైతేనేం?"

"ఓ.హో, ఎస్, అవును."

"లోనికి రండి."

అతను లోనికి వచ్చి గదిలో వేగంగా కదులుతూ బెడ్ క్రింద, టేబిల్ క్రింద, ఫోటోల వెనుక వెతకడం ప్రారంభించాడు.

"నో మైక్రోఫోన్స్" అన్నాడు లాల్.

అతను నవ్వాడు. "ముందు జాగ్రత్తకోసం...."

"మీ పేరు?"

"కామరాంజ్. ఒకసారి బాత్ రూంలో చూడవచ్చాండీ?"

"దేనికండీ?"

"ఏమీ లేదు—నా బిజినెస్ అలాంటిది. సాధ్యమైనంత వరకూ యెక్కడా టిప్స్ వదలకుండా జాగ్రత్త తీసుకుంటాను. ఒకవేళ బాత్ రూంలో ఎవరైనా టేప్ రికార్డర్‌తో...."

"మీకా సందేహం అక్కరలేదు. నిశ్చింతగా వుండండి."

"అనుమానం తీర్చుకోనిదే నిశ్చింతగా వుండలేను" బాత్ రూం వేపు కదిలాడతను.

"మిస్టర్ కామరాజ్!" లాల్ అన్నాడు తీవ్రంగా. "మీరొక్కసారి ఆ తలుపు తెరవండి—తర్వాత ఎక్కడ వుంటారో మీరే తెలుసుకుంటారు."

"ఎక్కడ వుంటారు?"

"పోలీస్ స్టేషన్లో."

"వాట్! ఎందుకు?"

"ఆడవాళ్ళు స్నానం చేస్తున్నప్పుడు మగవాళ్ళు చూడకూడదని చెప్పాలా!"

"అయితే లోపల స్నానం చేస్తున్నారెం? ఎవరు?"

"నా భార్య."

ఉన్నట్టుండి బాత్రూంలో షవర్ నుండి నీళ్ళు పడుతున్న శబ్దం వినిపించసాగింది.

"అయితే నిన్న కలుసుకుంది మీ భార్యా?"

"కాదు."

"మరి?"

"నా భార్య చెల్లెలు."

"మీ భార్య లోపల స్నానం చేస్తోందా?"

"నిస్సందేహంగా."

"ఎలా నమ్మాలి?"

"పోలీస్ స్టేషన్ కెళ్ళకూడదనుకొంటే నమ్మి తీరాలి!"

"మీరు చాలా తెలివిగలవారిలా వున్నారు, మీ పేరేమిటి?"

"లాల్."

"లాల్! కాంతిలాల్ ఖన్నా కాదుకదా?"

"ఎందుకవ్వాలి? అతనెవరో నాకు తెలియదు."

"ఆగండి. ఎందుకు తెలియదు? నాకు తెలుసు! మీ రెవరో నాకు తెలుసు—డిటెక్టివ్ లాల్! మిమ్మల్నిప్పుడు గుర్తించాను! మీ ఫోటో యెక్కడ చూశానో....ఓ. కే!

డియర్ డిటెక్టివ్ లాల్, మీరీ బిజినెస్‌లో ఎలా అడుగు పెట్టారు?"

లాల్ అడుగు ముందుకేసి చూపించాడు: "ఇలా...."

కామరాజ్ ముఖం ఎర్రబడింది.

"మీ పార్టనర్—జాన్—ఎక్కడ?"

"ఇక్కడ లేడు."

"లోపల స్నానం చేస్తోంది మీ పార్టనరా? లేక మీ భార్యా? ఎలా నమ్మాలి?"

"నమ్మాలా?"

"అవును."

"సీమా డార్లింగ్!" లాల్ కేకేశాడు.

"ఏమిటండీ?" బాత్‌రూంనుండి సమాధానం.

"ఇప్పుడు నమ్మారా? లేక జాన్ గొంతు మార్చి అరిచాడనుకొంటున్నారా?"

కామరాజ్ అన్నాడు, "ఆల్‌రైట్, మిస్టర్ లాల్, మీకు పెళ్ళి కాలేదు. లోపల స్నానం చేస్తోంది మీ భార్యకాదూ, నిన్న నన్ను కలుసుకొంది ఆమె చెల్లెలూ కాదు. మీ క్లయింట్. ఇప్పుడామె బాత్‌రూంలో వుంది...."

"నా క్లయింట్ నిన్న కలుసుకుందా? దేనికి?"

కామరాజ్ నవ్వాడు. "మీకేమీ తెలియనట్టు నటించకండి! అయినా చెప్తాను వినండి: నేనొక పార్టీనుండి కొంత లోన్ అడిగాను—నెల రోజుల్లో తీర్చే ఒప్పందం మీద. ఓపెన్ క్రెడిట్. గ్యారంటీ, సెక్యూరిటీల వంటివి అవసరంలేదు. అతను ఒప్పుకొని డబ్బుతో తన మనిషిని పంపుతానన్నాడు. ఆమె నిన్న కలుసుకుంది. అయితే

కోరిన మొత్తం తీసుకురాలేదు. నేను తిరస్కరించాను. ఆమె ట్రంకాల్ చేసి అతనితో మాట్లాడతానని చెప్పింది. నేనీ రోజు కలుసుకోంటానని చెప్పాను. బహుశా ఆమె ట్రంకాల్ చేసి వుంటుంది. కానీ, అతనికి నా మీద అనుమానం వచ్చి మిమ్మల్ని నియమించాడు. అంతేనా?"

"అంతే."

"మంచిది. అతని షరతు ఏమిటి?"

"అయిదు వేలకి మించి ఇవ్వనన్నాడు. ఇష్టం లేకపోతే గంగలో దూకమన్నాడు."

"అంతేనా?"

"అంతే!"

"సరే, యెంతో రహస్యంగా వుంచమన్న ఈ వ్యవహారంలో మిమ్మల్ని ప్రవేశపెట్టి అగ్రిమెంట్ నియమాల్ని ఉల్లంఘించాడు. విశ్వాసఘాతం తలపెట్టాడు. పోనివ్వండి-విశ్వాసం మాట ఎలా వున్నా ఈ బిజినెస్‌లో పెట్టుబడి పెట్టకపోతే నష్టం అతనిదే! ఐ పిటీ హిమ్."

"మీరు చేసే బిజినెస్ ఏమిటి కామరాజ్?"

"మీకు తెలుసు. తెలుసుకోకుండా జోక్యం చేసుకోరు."

"ఆల్‌రైట్, యిప్పుడు నా క్లయింట్‌తో యేం చెప్పాలి?"

"నా సానుభూతి తెలియజెయ్యండి."

అతను ఛటుక్కున వెనక్కి తిరిగి బయట కెళ్ళిపోయాడు.

లాల్ సిగరెట్ తాగుతూ ఆలోచిస్తూండిపోయాడు.

# 6

"ఓహ్, లాల్!...." బాత్ రూం నుంచీ అరిచింది రూప.

లాల్ వెనక్కి తిరిగి చూశాడు. "ఏమిటి రూపా?"

"నా టవల్....టవల్ అందుకోండి!"

"దేనికి?"

"నేను తడిసిపోయాను!"

"స్నానం చేశారా?"

"అవును. అతను బాత్ రూంలో చూడ్డానికి ప్రయత్నిస్తోంటే బొమ్మలా ఎలా నిలబడను? తెగించి తలుపు తెరిచి మీ రబ్దం చెప్పారని గొడవ చేస్తే...."

"మీరు షవర్ త్రిప్పి నీళ్ళ శబ్దం చేశారుకదా?"

"అవును. కానీ నా బట్టలు తడిసిపోతాయి. ఉన్న దొక్కటే జత! బట్టలు తీసి షవర్ క్రింద నిలబడక తప్ప లేదు! త్వరగా నా టవల్ అందుకోండి—టేబిల్ మీద సూట్ కేసులో...."

"ఆల్ రైట్" లాల్ టవల్ తీసి, కొద్దిగా తెరుచు కొన్న బాత్ రూం తలుపులోంచి ఆమె చేతికందించాడు.

"థాంక్స్ లాల్!"

"త్వరగా రండి!"

అయిదు నిమిషాల్లో ఆమె గాభరాగా వచ్చి, "ఇప్పు డతను యేం చేస్తాడు?" అనడిగింది.

"తన క్లయింట్ డబుల్ క్రాస్ చేశాడు కాబట్టి, ప్రతీకారం తీర్చుకోంటాడు" అన్నాడు లాల్.

"అంటే?"

"అంటే—ఆ ఫోటోల్ని మీ అన్నయ్య ప్రతిష్టను

నాశనంచేసే చోటుకి పంపుతాడు."

"ఎక్కడికి!"

"మీ అన్నయ్య ప్రతిష్టను నాశనంచేసే చోటుకి. అంటే మీకు—లేదా బంధువులకు, లేదా మీ అన్నయ్య స్నేహితులకు, లేదా—"

"నిన్న నేనతన్ని కలుసుకున్నాను. నన్ను గుర్తించ లేదంటారా?"

"గుర్తించి వుంటే అతని ప్రవర్తన మరో విధంగా వుండేది. నిన్న మిమ్మల్ని చూసినప్పుడు యెలాంటి ఉలికి పాటు గానీ, తత్తరపాటు గానీ అతనిలో గమనిం చారా?"

"లేదు."

"గుడ్. అయితే మిమ్మల్ని గుర్తించలేదు."

ఫోన్ వేపు నడిచాడు లాల్. ఒక నెంబర్ డయిల్ చేసి, కృష్ణన్‌తో మాట్లాడి పెట్టేశాడు. కృష్ణన్ కారు రిజిస్ట్రేషన్ వివరాలు, యజమాని పేరు, అడ్రసు, ఫోన్ నెంబర్ వగైరా తెలియజేశాడు. లాల్ వ్రాసు కొన్నాడు.

"అతని పేరేమిటి లాల్?" అడిగింది రూప.

"కామరాజ్."

"ఎక్కడ వుంటాడు?"

"దిలీప్ నగర్‌లో."

"అయితే మీ రిప్పుడేం చేస్తారు?"

"జాన్ అతన్ని షాడో చేస్తున్నాడు. అతని చర్యల్ని గమనిస్తాడు. పరిస్థితినిబట్టి అవసరమైన నిర్ణయాలు తీసు కొంటాడు. బ్లాక్ మెయిలర్ ఆ ఫోటోలు బహిర్గతం చేసే ప్రయత్నంలో వుండవచ్చు. అది జరక్కుండా జాన్

చూస్తాడు — బ్లాక్ మెయిలర్ని ట్రిక్ చేసి వాటిని స్వాధీనం చేసుకొంటాడు."

"నిజంగానా? మరి నెగెటివ్స్?"

"ఒక సమయంలో ఒక ఆలోచన. ముందు ఫోటోల వల్ల రాబోయే ప్రమాదాన్ని తప్పించాలి. తర్వాత నెగటివ్స్ గురించి ఆలోచించాలి. సమయంలేదు. మీరిప్పుడు బ్యాంక్ కెళ్ళండి. దూరం కాకుండా దగ్గర్లో వున్న యే బ్యాంక్కైనా వెళ్ళి మీ అన్నయ్య పేర్న అకౌంట్ పేయీ డ్రాఫ్ట్ తీసుకోండి. ఆ డబ్బు మీరు దొంగిలించారని యెవరూ ఋజువు చెయ్యలేరు. ఆ హామీ నేనిస్తాను. అయితే దానికి రక్షణ కావాలి. మీరు డ్రాఫ్ట్ తీసుకొని వెంటనే ట్రైను వుంటే ట్రైనుకి, లేదా బస్సుకి వరంగల్ వెళ్ళిపోండి.

"అక్కడ మీ అన్నయ్య పరిస్థితి యెలా వుందో తెలియదు. అతనికి మీ కంటే ఆప్తులు లేరు. ఒకవేళ ఈ పాటికి తెలివిలోకి వచ్చివుంటే యెదురుగా మీరు లేనందుకు చాలా అప్ సెట్ అవుతాడు. చాలా బాధపడతాడు. మీరు త్వరగా వెళ్ళండి!....ఇక్కడంతా నేను సవ్యంగా జరిగేట్లు చూస్తాను."

ఆమె కళ్ళలో నీళ్ళు పెల్లుబికి వచ్చాయి.

"ఓహ్, లాల్!"

హఠాత్తుగా ఆమె లాల్ గుండెలమీద వాలి రోదించసాగింది.

## 7

లాల్ ఆఫీసుకెళ్ళేసరికి జాన్ వున్నాడు.

రేగిపోయిన జుత్తు, చెమటపట్టిన ముఖం, దుమ్ముపట్టిన బట్టల్లో అతన్ని చూసి గాభరాగా అతని దగ్గరికెళ్ళాడు.

"ఏం జరిగింది?"

"కొంప మునిగింది!" అన్నాడు జాన్ అలసటగా.

"ఏం జరిగింది?"

"వూహించనిది జరిగింది! మరి కాస్తలో నేను హాస్పిటల్‌లో వుండేవాడిని!"

"ఏమిటి? యేమిటా అవతారం? యేం జరిగింది?"

జాన్ అన్నాడు. "నువ్వన్నట్టు అతన్ని షాడో చేశాను. అతను హోటల్ నుండి కోపంగా, ఉద్రేకంగా బయటకొచ్చి కారెక్కాడు. కారు స్టార్టు చేసి ట్రాఫిక్‌ను లెక్క చెయ్యకుండా డ్రైవ్ చేశాడు. అతన్ని ఫాలో కావడం కష్టమయింది. అయినా తప్పి పోనివ్వలేదు. తన నెవరైనా వెంబడిస్తున్నా పట్టించుకొనే స్థితిలో లేడతను. చాలా అప్‌సెట్ అయ్యాడు. బహుశ నువ్వు మంచి మందే తినిపించావనుకుంటాను—"

"చిందులు తొక్కే మందు."

"ఆల్ రైట్. అతను దిలీప్ నగర్‌లో ఒక యిల్లు చేరుకొన్నాడు. అది అతని స్వంత యిల్లు—చక్కగా కట్టుకున్నాడు. కారు యింట్లో ఆపి లోనికెళ్ళాడు. అప్పుడతను యేం చేస్తాడో నాకు తెలుసు—రూప అన్నయ్య వినోద్ ఫోటోలతో బయటికొస్తాడు. బహుశ వాటిని యెక్కడికేనా పోస్టు చేయవచ్చు. కానీ అలా జరగలేదు."

"మరి యేం జరిగింది?"

"నేను కారును వీధి మలుపులో ఆపి నడుచుకుంటూ వెళ్ళి అతనింటి ముందాగాను. ఇల్లు మారంగా, విసిరేసినట్లు ఒంటరి ప్రదేశంలో వుంది. ఇంటిముందొక టెలిగ్రాఫ్ స్థంభం వుంది. నే నా స్థంభం దగ్గర నిలబడి సిగ

గేట్ వెల్గించి, అటూ ఇటూ చూడసాగాను—ఏదైనా ఆటో కోసం ఎదురుచూస్తున్నట్టు.

"ఇంతలో అతను యింట్లోంచి బయటికొచ్చాడు. నిదానంగా నా దగ్గరికొచ్చి, సూటిగా చూశాడు. తలెగరేసి, చిరునవ్వు విసిరి, 'మిస్టర్ జాన్?' అన్నాడు. నా గుండె లదిరాయి. అవునని తలూపాను. 'ఇక్కడికెందుకొచ్చారు?' అన్నాడు మళ్ళీ. ఈ కాలనీలో ఒకరింటికి వెళ్ళవస్తున్నానని చెప్పాను. అతను నవ్వాడు. 'లేదు మిస్టర్! మిమ్మల్ని దారిపొడుగునా చూశాను. నన్ను వెంటాడుతూ వచ్చారు!' "

"నువ్వేమన్నావు?"

"మీరు పొరబడ్డారన్నాను. అతను వుగ్రుడయ్యాడు. 'మీ పార్ట్‌నర్ నన్ను ట్రాప్ చెయ్యాలనుకొన్నాడు. మీరు వెంబడించి వచ్చారు!' అనరిచాడు. నా పార్ట్‌నర్ గురించి నాకేమీ తెలియదన్నాను. అతను కోపం పట్టలేక నా కాలరు పట్టి పైకి లేపి క్రిందికి దించాడు. తక్షణం అక్కడనుంచి చెక్కేయకపోతే ఫలితం చూస్తానని బెదిరించాడు. నేను లక్ష్యపెట్టలేదు. ఫలితంగా అతను పిడికిలి బిగించి నా దవడ క్రింద కొట్టాడు."

"ఎక్కడ?"

"ఇక్కడ. ఇంకా నొప్పిగా వుంది. ఆ తర్వాత నా మెడపట్టి దూరంగా నెట్టేశాడు. నేను బోర్లా పడ్డాను. లేచి వెనక్కి చూడకుండా వెళ్ళిపోతే ఇంకే కాస్త పరువు మిగిలివున్నా దక్కుతుందని చెప్పాడు. నేను లేచివచ్చేశాను."

చెప్పడం ముగించాడు జాన్.

లాల్ ముఖం ఉద్రేకంతో ఎర్రబడింది.

"వ్యవహారం చెడగొట్టేశావు, జాన్! ఇప్పుడేం జరుగుతుందో వూహించు! ఆ ఫోటోల్ని అతను పోస్టు చేస్తాడు! ఈపాటికి చేసే వుంటాడు. రేపటికల్లా అవి చేరవలసిన చోట్లకి చేరుకుంటాయి! గాడ్! నేనేం మనుకొన్నాను? కేవలం నీమీద ఆధారపడి రూపకు మాటిచ్చాను! ఇప్పుడు ఇప్పుడు—అంతా తలక్రిందలైంది!

"కమాన్! ఆ యింటి పరిసరాలు వర్ణించు! చుట్టు ప్రక్కల ఇళ్ళు యెంతదూరంలో వున్నాయి? దగ్గర్లో చెట్లేవేనా వున్నాయా?"

"ఎందుకు?"

"నా కింకా ఆశగా వుంది. కామరాజ్ ఆ పని ఇంకా చెయ్యలేదని నమ్ముతున్నాను. అతని అడ్రసు మనకు తెలిసిపోయింది గనుక యిక జాగ్రత్తపడతాడు. తొందరపడి ఆ ఫోటోలతో బయటికి రాడు. తన యింటిమీద నిఘా లేదని నిశ్చయించుకున్నాకే వస్తాడు. మనం త్వరగా వెళ్ళాలి. తనమీద నిఘా లేదని ఇంకా స్పష్టంగా అతను తెలుసుకోవచ్చు. ఆ లోపు మనం చేరుకుని కంటపడని చోట కాచుకోవాలి."

"ఆ తర్వాత?"

"అక్కడికి కెళ్ళాక ఆలోచిద్దాం పద!"

పావుగంటలో, సరిగ్గా 2-50కి దిలీప్ నగర్ చేరుకున్నారు డిటెక్టివ్‌లు.

కారును కామరాజ్ యింటికి రెండు వీధులవతల వదిలేసి, కాలినడకన అతనింటి ఎదురుగుండా గాక మరో వీధి ద్వారా వచ్చి నిలబడ్డారు.

ఇల్లు పూర్తిగా ఒంటరి ప్రదేశంలో వుంది. చుట్టు ప్రక్కల యిళ్ళు కనీసం రెండు, మూడు ఫర్లాంగుల

దూరంలో వున్నాయి. ఇంటి పరిసరాల్లో గోతులు, పెద్ద పెద్ద రాళ్లు, పిచ్చిమొక్కలు చాలా వున్నాయి.

సరిగ్గా యింటి కెదురుగా, 500 అడుగుల దూరంలో ఒక రావిచెట్టు వుంది. ఆ చెట్టెక్కితే యెవరికీ కనబడరు. బైనాక్యులర్స్‌లో చూస్తే ఇంటిలోపలి భాగం స్పష్టంగా కన్పిస్తుంది.

ఇద్దరూ చెట్టెక్కి కూర్చున్నారు. లాల్ చేతిలో బైనాక్యులర్స్ వుంది. దాన్ని కళ్లకి పెట్టుకుని ఇంటికేసి ఫోకస్ చేశాడు.

ఆ తర్వాత అన్నాడు:

"అతను యింట్లోనే వున్నాడు. కారు లోపల వుంది...."

"ఇంటి తలుపుకు తాళం వుండేమో చూడు!" అన్నాడు జాన్.

"లేదు. తలుపు ఓరగా వేసివుంది."

"కిటికీల్లోంచి అతనెక్కడేనా కనిపిస్తున్నాడా?"

"కిటికీలు తెరిచి వున్నాయి. కానీ, లోపల చీకటిగా వుంది."

"గేటు."

"మూసివుంది" లాల్ రేంజి అడ్జెస్టు చేస్తూ అన్నాడు: "కానీ గడియ పెట్టలేదు."

"ఓ. కే. అయితే అతను ఇంట్లోనే వుంటాడు."

"ఎలా నమ్మాలి? నడిచి వెళ్ళాడేమో!"

"ఈ కాలనీ క్రొత్తగా ఏర్పడుతోంది. నడిచివెళ్ళి పోస్టు చెయ్యడానికిక్కడ లెటర్ బాక్స్ లేదు."

"సిగరెట్ ప్లీజ్!"

జాన్ సిగరెట్ తీసి, లాల్ పెదిమల మధ్య పెట్టి అంటించాడు.

"ఓ. కే. అతనికి ఫోటోలు బహిర్గతం చేసే వుద్దేశ్యం వుందో లేదో మనకు తెలియదు. అవునా?"

"ఎందుకు లేదు?"

"అతను క్లయింట్ కు మరో ఛాన్స్ ఇవ్వొచ్చు. అంటే, యిప్పుడతను మూప అన్నయ్యకు ఫోన్ చెయ్యాలి."

"కానీ, అక్కడ మూప అన్నయ్య"

"అదే ఆలోచిస్తున్నాను. వినోద్ యే స్థితిలో వున్నాడో కామరాజ్ కు తెలుసు. ఈ పరిస్థితిలో ఫోన్ చేస్తాడా?"

"అసలీ పరిస్థితిలో అతను బ్లాక్ మెయిల్ ఉత్తరం పంపడమే పెద్ద ఫార్సు!"

"ఫార్సు!....అంటే?"

జాన్ అన్నాడు, "కామరాజ్ స్వయంగా వరంగల్ వెళ్ళి ఆ ఉత్తరం పెట్టివచ్చాడు. వినోద్ ఆ స్థితిలో వుంటే యెందుకు పెట్టాడు? దాన్ని యెవరేనా చూస్తే వ్యవహారం బట్టబయలు కాదా? బ్లాక్ మెయిలర్స్ అంత బహిరంగంగా ప్రతిఫలం కోరరు. ఆ బిజినెస్ పరస్పర విశ్వాసంమీద ఆధారపడి వుంటుంది."

లాల్ కళ్ళు మెరిశాయి.

"పార్ట్ నర్, యూ ఆర్ కరెక్ట్! ఆలోచిస్తే రూప చాలా అబద్ధాలు చెప్పినట్లు తెలుస్తోంది. సేఫ్ లోని డబ్బూ, బ్లాక్ మెయిలర్ ఉత్తరం ఆమె అన్నయ్య తలగడ క్రింద వుండటం, సేఫ్ తాళాలు ఆమె ఇంట్లో దొరకటం ....అన్నీ ఆమె కల్పించి చెప్పింది!

"కామరాజ్ స్వయంగా అక్కడికి వెళ్ళలేదు. ఆ ఉత్తరం పోస్టులో పంపించాడు. అది రూప చేతిలో పడింది. ఆమె విషయం తెలుసుకొని భయపడింది. వినోద్ స్పృహలో లేడు. కామరాజ్ ఇచ్చిన సమయం ఎక్కువ లేదు. ఈలోపు వినోద్ తెలివిలోకి రావడం అనూహ్యం. అందుకని ఆమె స్వయంగా యీ డబ్బు చెల్లించాలనుకొంది.

"బ్యాంక్‌లో డబ్బు వుండవచ్చు. కానీ, తను తీయలేదు. చెక్కుమీద వినోద్ సంతకం కావాలి. ఇంకెవరైనా అప్పు అడిగితే కారణాలడుగుతారు. చెప్పడం ఆమె కిష్టంలేదు. ఎంత మొత్తం చెల్లించాలో కూడ ఆమెకు తెలియదు. కాబట్టి ఆ సాయంత్రం ఆమె పిన్ని ఇంటికెళ్ళి సేఫ్‌లో దొరికినంతవరకు డబ్బు తెచ్చుకుని—ఆ తర్వాత ఈ కథ అల్లింది."

జాన్ తలూపాడు. "అయితే వినోద్ ఆక్సిడెంట్ గురించి కామరాజ్‌కు తెలియదు. అతను తప్పకుండా ఫోన్ చేస్తాడు. రెస్పాన్స్ ఎవరిస్తారు?"

"ఎవరో యిస్తారు. అక్కడి విషయం చెప్తారు. కాబట్టి కామరాజ్, వినోద్ తెలుసుకొనే వరకు ఆగుతాడు."

సమయం దాదాపు గంట గడిచింది. మధ్య మధ్య లాల్ బైనాక్యులర్స్‌లో చూస్తూనే వున్నాడు.

ఇంట్లో యెలాంటి కదలిక లేదు. సుమారు అయిదు నిమిషాలు గడిచాక, లాల్ మళ్ళీ చూసి, ఉలిక్కిపడ్డాడు.

"లోపలి కెవరో వెళ్తున్నారు!"

"ఎవరు?"

"ఎవరో అమ్మాయి."

జాన్ ఛటుక్కున కొమ్మల్లోంచి చూశాడు. "ఎవ రామె?"

"వేషం చూస్తే పనిపిల్లలా వుంది...." అన్నాడు లాల్.

పనిపిల్ల ఆకారం గేటు తెరుచుకొని లోనికెళ్ళింది. వరండా చేరుకుని, ఓరగా వేసివున్న తలుపు తోసుకొని లోనికి ప్రవేశించి—రెండు నిమిషాలు గడిచాక వేగంగా పరిగత్తి రాసాగింది....

"వాట్ హేపెండ్?"

లాల్ ఛటుక్కున బైనాక్యులర్స్‌లో చూశాడు.

"అరె, నోరు తెరిచి అరుస్తోంది! ఆమె ముఖంలో భయం వుంది!"

"కమాన్, వెళ్దాం!"

ఇద్దరూ చెట్టుదిగి ఇంటికేసి పరిగెత్తారు. ఇల్లు చేరుకొనేటప్పటికి పనిపిల్ల రోడ్డుమీద వందగజాలదూరంలో వుంది.

"నువ్వెళ్ళి ఆమెని పట్టుకో!" అన్నాడు లాల్.

జాన్ రోడ్డుమీద పరిగెత్తాడు.

లాల్ గేట్లోంచి ఇంట్లోకి పరిగెత్తాడు. వరండా చేరుకొని బార్లా తెరిచివున్న తలుపుల్లోంచి లోనికెళ్ళి అటూ ఇటూ చూశాడు.

ఎవరూ లేరు.

గబగబ నడిచి ప్రక్కగదిలో కెళ్ళాడు. అది బెడ్ రూం. బెడ్‌రూంలో యొక్కడివస్తువు లక్కడి తీర్చిదిద్దినట్లు అమర్చి వున్నాయి. కాని, బెడ్ క్రింద విశాలంగా

రక్తం మడుగుకట్టి వుంది. దుప్పటి రక్తంలో తడిసి వుంది. బెడ్ మీద వెల్లకిలా శవం వుంది.

లాల్ దగ్గరికెళ్లి చూశాడు. కామరాజ్ బెడ్ మీద అడ్డంగా, వెల్లకిలా పడివున్నాడు. అతని కళ్ళు కప్పుకేసి వున్నాయి. కాళ్ళు క్రింద వ్రేలాడుతున్నాయి.

అతని నుదుటిలో యేర్పడ్డ రంధ్రంనుంచి రక్తం ప్రవహించి, తలచుట్టూ మడుగుకట్టి, నెమ్మదిగా నేలమీద ధారగా పడుతోంది.

శవం కుడిచేతి ప్రక్కన రివాల్వర్ వుంది.

వెనుక అడుగుల చప్పుడు విన్పించడంతో వెనక్కి తిరిగిచూశాడు లాల్.

జాన్ పనిపిల్లతో లోనికి వచ్చి, ఒక్క అడుగు వెనక్కి వేసి నోరు తెరిచాడు.

"మర్డర్" అన్నాడు లాల్.

జాగ్రత్తగా శవంమీదకు వంగి, చెయ్యి అందుకొని నాడీ చూశాడు. కొట్టుకోవడంలేదు. శరీరంలో కొద్దిగా వెచ్చదనం వుంది.

"ఆ రివాల్వర్ రూపు దగ్గర చూశాను" అన్నాడు జాన్.

లాల్ తలూపి పనిపిల్లను చూశాడు. ఆమెకు పది హేనేళ్ళుంటాయి. భయంతో ఆమె ముఖంలో నెత్తురు అదృశ్యమై తెల్లకాయితంలా వుంది.

"ఆమెను బయటికి తీసికెళ్ళు. కృష్ణన్‌కు ఫోన్ చేయ్!" అన్నాడు లాల్.

పావుగంటలో పోలీస్ స్క్వాడ్ చేరుకుంది. క్రైమ్ ఇన్‌స్పెక్టర్ కృష్ణన్ శవాన్ని చూసి తన స్టాఫ్‌కి చకచక

ఆజ్ఞలు జారీ చేశాడు. ఆ తర్వాత డిటెక్టివ్‌లతో కేసు గురించి చర్చించాడు. లాల్ కేసు వివరించి, హతుని ఇంట్లో బ్లాక్ మెయిల్ ఫోటోల కోసం గాలించమని చెప్పాడు.

కృష్ణన్ తన రొటీన్ వర్క్‌లో వెళ్ళిపోయాక, లాల్ కాస్సేపు సిగరెట్ తాగుతూ ఆలోచించి జాన్‌తో అన్నాడు:

"వెల్, మనం వెంటనే వరంగల్ వెళ్ళాలి."

"ఎందుకు?" జాన్ అడిగాడు.

"డోంట్ బీ సిల్లీ! హత్య యెవరు చేశారో మనకు తెలుసు."

# 8

వరంగల్ అర్ధరాత్రి అనూహ్యంగా వూడిపడ్డ డిటెక్టివ్‌లని చూసి నిశ్చేష్టురాలైంది రూప.

"ఓహ్, లాల్! ఏమిటిది? యెందుకొచ్చారు?"

ఆమె అరుపు విని లాల్ సూటిగా చూశాడు. ఎర్రబడ్డ ముఖంతో, రెప్ప వేయకుండా చూస్తూ, గజగజ వణుకుతోందామె.

"చెప్పండి! ఏం జరిగింది?"

లాల్ తల తిప్పి బెడ్ మీద చూశాడు. వినోద్ స్పృహ లేకుండా పడి వున్నాడు. వొళ్ళంతా కట్లు వున్నాయి.

లాల్ రూప చెయ్యి పట్టుకొని, "ఇంతవరకూ స్పృహ రాలేదా?" అనడిగాడు.

ఆమె అడ్డంగా తలూపింది.

"మీరిక్కడి కెప్పుడొచ్చారు?"

"సాయంత్రం ఆరుగంటలకు."

"మీ సూట్ కేసు, బ్యాగు, ఎక్కడ వున్నాయి?"

"ఇంట్లో."

"పదండి, చూద్దాం."

"దేనికి? అసలేమిటిది....? మీ రెండు కిలా వచ్చారు?...."

"ఆ విషయాలన్నీ యిక్కడ మాట్లాడ్డం మంచిది కాదు. ఇంటికి పదండి."

లాల్ ఆమె చెయ్యి పట్టుకొని గబగబ నడిచాడు. జాన్ వెంబడించాడు. ముగ్గురూ నర్సింగ్ హోం బయట కారెక్కారు.

దారిపొడుపునా ఆమెని మాట్లాడనివ్వలేదు—యెంత వారించినా వినకుండా ఆమె హిస్టరికల్ గా అరవసాగింది. అతి ప్రయాసమీద ఆమెచేత ఇంటికి దారి తెలుసుకుని చేరుకున్నారు.

ఇంట్లో ఆమె సూట్ కేసు, బ్యాగు, హాల్లో సోఫా మీద పడివున్నాయి.

లాల్, రూపను మరో సోఫామీద కూర్చోబెట్టి, "మీరలా అప్ సెట్ అవనవసరంలేదు. మీ రిక్కడికి ప్రశాంతంగా మీపని పూర్తిచేసుకుని చేరుకొన్నారుకదూ? వెల్, వెల్, మీ రింకా నటించకండి. ఇప్పుడు చెప్పండి! మీ రివాల్వర్ ఎక్కడ వుంది?"

"నా రివాల్వరా? నాకు రివాల్వర్ ఎక్కడిది?"

"ప్లీజ్ రూపా, సమాధానం సరిగా చెప్పండి. మీరు హైద్రాబాదుకి మీ అన్నయ్య రివాల్వర్ తెచ్చారు. అవునా?"

"అవును."

"ఇప్పుడది ఎక్కడ వుంది?"

"సూట్ కేసులో."

"జాన్, సూట్ కేసు తెరువ్!"

జాన్ సూట్ కేసు తెరిచాడు. అందులో టాయిలెట్ వస్తువులు, టవల్, వగైరాలు వున్నాయి. రివాల్వర్ లేదు.

"ఇందులో రివాల్వర్ లేదు" అన్నాడు జాన్.

రూప ఉలిక్కిపడింది.

"బ్యాగులో చూడు!" అన్నాడు లాల్.

జాన్ బ్యాగు తెరిచి చూశాడు. అందులోంచి ఒక డ్రాఫ్టు తీసి, "రివాల్వర్ యిందులో కూడా లేదు" అన్నాడు.

"ఓహ్. ఏమిటిది! నేను బ్యాంక్ కు వెళ్ళే ముందు బ్యాగులోంచి రివాల్వర్ తీసి సూట్ కేసులో పెట్టాను. బ్యాంక్ నుంచి తిరిగివచ్చి రూం ఖాళీచేసి వచ్చేశాను. నా గదిలో కెవరు వెళ్ళారు?" అంది రూప.

"బ్యాంక్ కి మీరెప్పుడెళ్ళారు?"

"మీరు వెళ్ళిన వెంటనే—ఒకటిన్నరకు."

"ఎప్పుడు తిరిగి వచ్చారు?"

"మూడు గంటలకు."

"బ్యాంక్ లో ఎంతసేపు వున్నారు?"

"సుమారు ముప్పావు గంట — చాలా రష్‌గా వుంది."

"అంటే మీరు 1-30 నుండి 3-00 గం॥ వరకు బయట వున్నారన్నమాట. గది యెప్పుడు ఖాళీ చేశారు?"

"3-15 కి."

"ఆ తర్వాత?"

"బస్ డిపో కెళ్లాను. వెంటనే బస్సు దొరికింది. బయలుదేరి వచ్చేశాను."

"బ్యాంక్ కి వెళ్ళేముందు మీరు కామరాజ్ దగ్గర కెళ్ళలేదా?"

"ఏమిటీ?"

"కామరాజ్ దగ్గరికి."

"కామరాజ్! అతని దగ్గరి కెందుకు?"

"వ్యవహారం సెటిల్ చేసుకోవడానికి."

"వ్యవహారమా? ఏమిటి మీ రనేది? నేనేం చేశానని అనుకుంటున్నారు?"

"సరిగ్గా మీ రేం చేశారో నేనిలా అనుకుంటున్నాను" అన్నాడు లాల్. "కామరాజు ఆ ఫోటోల్ని బహిర్గతం చేస్తాడని నేను చెప్పినప్పుడు మీరు భయపడ్డారు. మా శక్తి సామర్థ్యాల్ని అనుమానించారు. మా పైన విశ్వాసం నశించి యీ వ్యవహారాన్ని మాపై ఆధారపడకుండా స్వయంగా పరిష్కరించా లనుకున్నారు. అందువల్ల, హోటల్ లో మీ దగ్గరనుండి నేను వెళ్ళిపోయాక మీరు కామరాజ్ కు ఫోన్ చేశారు. అంతకు ముందు అతని పేరు వుండే ప్రాంతం నన్నడిగారు. వాటి సహాయంతో టెలిఫోన్ డైరెక్టరీలో అతని నెంబర్ గాలించారు.

"జాన్ అతన్ని షాడో చేస్తున్నాడని మీకు తెలుసు. కామరాజ్ అప్పుడు యింటికే వెళ్తున్నాడని వూహించారు. కాబట్టి అతనికి ఫోన్ చేసి మీరు వెంటనే అతనింటికి వస్తున్నట్లు, ఆ ఫోటోల విషయంలో ఒక నిశ్చయానికి వచ్చి డబ్బు చెల్లించాలనుకున్నట్లు, కాబట్టి తొందరపడి బహిర్గతం చేయకూడదని వేడుకున్నారు.

"అంతేకాదు, మీరక్కడికి వెళ్ళాలనుకుంటే, మీ కడ్డుగావున్న జాన్‌ని తొలగించడానికి అతని గురించి కామరాజ్‌కు చెప్పారు. కామరాజ్ మీ మాటలు విని బయటికొచ్చి, జాన్‌ని గాయపర్చాడు. మీరు ఫోన్ చేసేవరకు అతనికి తనమీద నిఘా వుందని తెలీదు.

"జాన్ తిరిగి వచ్చేశాడు. అప్పుడు మీరు వెంటనే కామరాజ్ ఇంటికి వెళ్ళారు.... బ్యాగులో డబ్బుతో, దాని క్రింద రివాల్వర్‌తో.

"ఎలాగైనా కామరాజ్‌ని అయిదు వేలు తీసుకోమని బ్రతిమలాడారు. మిగతా డబ్బు వీలైనంత త్వరలో యేర్పాటు చేస్తానన్నారు. అతను వొప్పుకోలేదు. పూర్తి డబ్బు తక్షణం కావాలి—లేదా ఫోటోల్ని గాలికి వదులుతానని చెప్పాడు.

"పైగా మీ రతన్ని కలుసుకున్నట్లు అన్నయ్యకు చెప్తాడని భయపడ్డారు. ఆ తర్వాత పరిణామాల్ని వూహించుకొని డీలా పడిపోయారు. ఈ పరిస్థితిని శాశ్వతంగా తప్పించకపోతే మీ అన్నా చెల్లెళ్ళ మధ్య పెద్ద అగాధం ఏర్పడుతుంది. కాబట్టి వెంటనే బ్యాగులోంచి రివాల్వర్ తీసి అతన్ని షూట్ చేశారు."

రూప కెవ్వున అర్చింది.

"ముందు మీ రతన్ని చంపాలనుకుని వెళ్ళలేదు. కానీ అక్కడికి వెళ్ళాక అలాంటి పరిస్థితి కల్పించుకున్నారు. అతన్ని షూట్ చేసి కంగారు పడ్డారు. ఆ కంగారులో మీరేం చేశారో మీకే తెలియదు—రివాల్వర్ శవందగ్గర వదిలేశారు. అది సింగిల్ యాక్షన్ రివాల్వర్. ఎక్కువ

శబ్దం చెయ్యదు. ఆ యిల్లు యేకాంతంగా వుంది కాబట్టి దాని శబ్దం యెవరికీ విన్పించదు. మీరు క్షేమంగా బయట పడి పారిపోయారు. అప్పుడు బ్యాంక్ కు వెళ్లి డ్రాఫ్ట్ తీసుకుని, గది ఖాళీ చేసి బస్సెక్కారు."

రూప కొయ్యబొమ్మలా వుండిపోయింది.

లాల్ మళ్ళీ అన్నాడు, "ఆ రివాల్వర్ మీద మీ వేలి ముద్రలుంటాయి. మీరు యెవరో తరుముకొస్తున్నట్లు హత్య చేసి పారిపోయి రాకుండా,—నిదానించి, సమయ స్ఫూర్తిగా ప్రవర్తిస్తే, ఆ రివాల్వర్ తో బాటు మీ అన్నయ్య ఫోటోలుకూడా తెచ్చుకునేవారు."

"నాన్సెన్స్! పిచ్చిగా మాట్లాడుతున్నారు! ఆ హత్య నేను చేసివుంటే రివాల్వర్ అక్కడ వదిలేదాన్ని కాదు! దాన్ని యెవరో దొంగిలించారు" అర్చింది రూప.

# 9

మర్నాడు ఉదయం 10 గంటలకు ఇన్ స్పెక్టర్ కృష్ణన్ ఏజెన్సీ ఆఫీసులో కలుసుకున్నాడు.

"పోస్టుమార్టమ్ రిపోర్టు ప్రకారం హత్య నిన్న మధ్యాహ్నం 1-00—2-00 మధ్య జరిగింది. హత్యా స్థలంలో దొరికిన రివాల్వర్ తో హత్య జరిగింది. ఆ రివాల్వర్ సిలెండర్ లో ఒక బుల్లెట్ తక్కువ వుంది. శవం తలలో లభించిన బుల్లెట్ ఆ రివాల్వర్ నుండి వెలువడినదే.

ప్రతి రివాల్వర్, పిస్టల్, లేదా రైఫిల్ బ్యారెల్ లోపలి ఉపరితలం బుల్లెట్ వెలువడుతున్నప్పుడు దాని పైన కొన్ని ప్రత్యేకమైన గుర్తుల్ని యేర్పరచే విధంగా చెక్కి వుంటుంది. ఈ గుర్తు లేర్పరచే ఆకృతులు మనిషి వేలిముద్రలలాగే ఒకదానితో ఒకటి కలవవు.

కాబట్టి బుల్లెట్ పేల్చబడ్డప్పుడు దానిమీద ఏర్పడ్డ గుర్తుల్ని, అదే ఆయుధంలో వేరొక బుల్లెట్స్ పేల్చి వాటి మీద యేర్పడ్డ గుర్తుల్నీ, మైక్రోస్కోపులో పరీక్షించి అవి రెండూ ఒకే ఆయుధం నుండి వెలువడ్డాయా, లేదా అన్నది నిర్ణయిస్తారు. కాబట్టి, ఈ కేసులో శవం తలలో లభించిన బుల్లెట్, హత్యా స్థలంలో దొరికిన రివాల్వర్ నుండి వెలువడింది....ఇది బాలస్టిక్స్ రిపోర్టు.

"ఇక మీరు చెప్పినట్లు బ్లాక్ మెయిల్ ఫోటోలకోసం గాలించాం. ఇంట్లో ఎక్కడా సేఫ్ లాంటిది లేదు. ఎక్కడా రహస్యస్థలం లేదు. అవకాశం వుందనుకొన్న ప్రతి చోటా ఫోటోల ఉనికి కోసం గాలించాం. ఫలితం లేదు. శవం జేబులో ఒక తాళం చెవులగుత్తి దొరికింది. అందులో ఏడు తాళాలున్నాయి. కారు ఇగ్నిషన్, డిక్కీ, ఇంటి గేటు, తలుపు మొదలైనవాటికి చెందినవి.

"ఆ తర్వాత బాత్ రూంలో వొక టార్చిలైటు దొరికింది. అదక్కడెందుకుందో తెలియదు. అది వున్న స్థలాన్ని మార్క్ చేసి, ఫోటోలు తీశాం. దానిమీద వేలిముద్రలు లేవు.

"హత్య చేసిన మనిషి ముందు భాగం గుండా వచ్చి, పెరటి తలుపుగుండా వెళ్ళి వుండాలి—వెనుక తలుపు తెరిచివుంది. అవతల యెలాంటి అడుగుజాడలు లభించ లేదు...."

జాన్ అన్నాడు. "బాత్ రూం గురించి చెప్పండి. దాని స్థితి యెలా వుంది?"

"నేల పొడిగా వుంది. టబ్ ఖాళీగా వుంది. అయితే వాష్ బేసిన్ లో టాప్ నీళ్ళు సన్నగా పడుతున్నాయి."

"బేసిన్‌లో రక్తపు మరకలు...."

"లేవు."

"బాత్‌రూంలో యేదైనా టవల్ కన్పించిందా?"

"కన్పించింది. దాన్ని పరీక్షించాం. రక్తం మరకలు లేవు. తడి చేతులు తుడుచుకొన్నట్లు కూడ లేదు."

"బాత్‌రూంను వర్ణించండి!"

"బాత్‌రూం 8 అడుగుల పొడవు, 12 అడుగుల వెడల్పు వుంది. దక్షిణం వేపు సీలింగుకి ఒక అడుగు క్రింద రెండు అద్దాల వెంటిలేటర్స్ వున్నాయి. బేతింగ్ టబ్, షవర్‌లు ఒకదానికొకటి అభిముఖంగా, ఉత్తర-దక్షిణ దిశల్లో వున్నాయి. తూర్పువేపున వాష్ బేసిన్, పడమర వేపున గోడకి అద్దం వున్నాయి. షవర్ పక్కన స్టాండ్ వుంది, సీలింగ్ మధ్య ఎలక్ట్రిక్ దీపం వ్రేలాడుతోంది...."

"ఎన్ని సబ్బులున్నాయి?"

"ఒక్కటి. అది పొడిగా వుంది. ఒక షాంపూ బాటిల్ కూడా వుంది."

"గోడకున్న అద్దం ఎలా వుంది? ముందు స్టాండు వుందా? ఏ సైజు?"

"అరడగు సైజులో చతురస్రాకారంగా వుంది. స్టాండు లేదు."

"గోడకు సమాంతరంగా బిగించి వుందా?"

"లేదు. క్రిందిభాగం గోడ నానుకొని వుంది. పైభాగం ముందుకు వంగి వుంది."

"అంటే కొంత కోణంలో బిగించి వుందన్నమాట. ఎంత కోణంలో?"

"సుమారు 45 డిగ్రీలు."

"అద్దాని కెదురుగా వాష్ బేసిన్ వుంది కదూ?"

"వుంది."

"దాని పైన ఏముంది?"

"ఏమీ లేదు."

"బాగా ఆలోచించండి. వాష్ బేసిన్ పైన గోడమీద ఏమీ లేదా? చిన్న స్టాండు గానీ, యేదైనా గుర్తు గానీ...."

"మీరు మనో నేత్రంతో చూస్తున్నారా?అక్కడేమీ లేదు."

"మీరు ప్రత్యక్షంగా చూడనిది నేను మనో నేత్రంతో చూస్తున్నాను. ఇన్ స్పెక్టర్, వాష్ బేసిన్ పైన యేదో వుండాలి. బాగా గుర్తు చేసుకోండి!"

"ఏదో అంటే యేమిటి? బల్లి వుండాలా? లేక బొద్దింక...."

జాన్ నవ్వాడు. "ఆల్ రైట్, అక్కడేముందో గుర్తు లేదు. లేదా గమనించలేదు. గమనించి వుంటే బల్లియా, బొద్దింకా అని సందిగ్ధంలో పడరు. వాష్ బేసిన్ పైన ఏదో వుంది. బల్లి బొద్దింకల్లాటి పురుగులు కావు. చలించే వస్తువు అంతకన్నా కాదు. స్థిరంగా వున్న వస్తువు, లేదా గుర్తు."

"మీ ఉద్దేశ్యంలో రక్తం మరకా?"

"కాదు. గోడమీద అద్దానికీ నేలమీద టార్చికీ సంబంధాన్ని తేల్చి చెప్పే గుర్తు."

"ఆ రెంటికీ సంబంధం యేమిటి?"

"అవి ఫోటోలున్న రహస్య స్థలానికి మార్గం చూపే పరికరాలు."

"ఎలా?"

"కానీప్పు మీరే కామరాజ్ అనుకోండి. మీరు బ్లాక్ మెయిలర్. మీ దగ్గర కొందరికి సంబంధించిన వ్యక్తిగత రహస్యాలున్నాయి. వాటిని ఒకచోట భద్రంగా దాచారు. ఆ చోటు ఎవరూ కనుక్కోలేరు. అక్కడ దాచిన రహస్యాలతో యేదేనా అవసరం వస్తే, లేదా— క్రొత్త రహస్యాల్ని ప్రవేశపెట్టదలిస్తే, మీరు టార్చిలైట్‌తో బాత్‌రూం కెళ్తారు. తలుపు మూసి చీకటి చేస్తారు. టార్చి వెలిగించి వాష్‌బేసిన్ దగ్గరి కెళ్తారు. అక్కడ నిలబడి దానిపైన గోడమీద వున్న గుర్తు దగ్గర టార్చి వుంచుతారు. ఆ గుర్తు ఎదురు గోడమీదవున్న అద్దం కేంద్రబింబానికి సూటిగా వుంటుంది. అక్కడ టార్చి వుంచితే వెలుతురు అద్దంమీద పడుతుంది. అప్పుడు దానిపైన పడ్డ వెలుతురు పరావర్తనం చెంది నేలమీద ఒక నియమిత స్థలంలో పడుతుంది. అదే రహస్యస్థలం."

కృష్ణన్ నవ్వాడు. "మ్యాజిక్ షోలా వుంది! అంత హంగామా యెందుకు? ఆ స్థలానికి యేదేనా బండ గుర్తు పెట్టుకోవచ్చుగా?"

"పెట్టుకోవచ్చు. కానీ కూడదు. కామరాజ్ ప్రతి చిన్న జాగ్రత్తనూ సూక్ష్మదృష్టితో ఆలోచిస్తాడు. అలాటి ఏర్పాటు చేస్తే ఆ స్థలం ఎవరూ కనుక్కోలేరని అతని ధీమా."

"అవును. బాత్‌రూంలో టార్చి వుందని చెప్పకపోతే మీరు కూడా కనుక్కునేవారు కాదు, అవునా?"

జాన్ తలూపాడు.

"వెరీ వెల్! ఇప్పుడు మీ మాటల్ని యే ఆధారంతో నమ్మమంటారు?"

"నేను నమ్మమనటంలేదు. మీరు స్వయంగా అక్కడికి వెళ్ళి నేను చెప్పిన ప్రయోగం చెయ్యండి. నేలమీద మీరు టార్చ్‌ని మార్క్ చేసిన స్థలానికి సమీపంలోనే రహస్య స్థలం వుంటుంది. హత్య చేసిన మనిషి ఆ స్థలంలో తన రహస్యాలు తీసుకొని, టార్చి వదలి వెళ్ళి పోయాడు."

"వెళ్ళి పోయాడు....? అంటే, హత్య చేసింది పురుషుడా? ఎవరు?"

జాన్ తలూపాడు.

"నవీన్!"

"అసంభవం!"

"అవును. విషయాన్ని ఒకే కోణంనుంచి ఆలోచిస్తూ కచ్చితమైన నిర్ణయానికి వచ్చామనుకొన్న తర్వాత ఇలాటి చేదు వాస్తవాన్ని ఉన్నపళంగా మింగేయడం కష్టమే మరి! మొదటినుంచీ యీ కేసుని రూప నాధారం చేసుకొని ఆలోచించాం. ఇప్పుడామె స్థానంలో నవీన్‌ను వూహించండి: ఎన్నో చిక్కు సమస్యలు పోతాయి."

"సరే, నవీన్ ఆధారంగా మీ కథనం యేమిటో వివరించండి?"

జాన్ ప్రారంభించాడు:

"నా కథనంలో రూప స్థానంలో నవీన్ వుంటాడు. నవీన్ అంటే నవీన్ ఒక్కడే. బ్లాక్ మెయిల్‌లో ఇరుక్కుంది అతనే, హత్య చేసింది అతనే.

"అతని రహస్యాలు ఫోటోల రూపంలో కామరాజ్ దగ్గర వున్నాయి. అతను తడవకి పదివేల చొప్పున నవీన్ దగ్గరనుంచి లాగుతున్నాడు. అలా ఎంత లాగాడో మనకు తెలియదు. అయితే యిలాగే కొనసాగితే, కొంతకాలానికి

వ్యాపారంలో విపరీతంగా ఆర్థిక లోటు యేర్పడి తన తల్లికి తెలిసిపోతుందని భయపడ్డాడు. అందుకే కామరాజ్ నుంచి శాశ్వతంగా ముక్తి పొందాలనుకొని ఈ హత్య చెయ్యడానికి నిశ్చయించుకొన్నాడు.

"ఆ అవకాశం వినోద్ ఆక్సిడెంట్ ద్వారా లభించింది. వినోద్ ఆక్సిడెంట్ జరక్కముందు నవీన్‌కు కామరాజ్ నుండి ఆ ఉత్తరం వచ్చివుండాలి. ఆ ఉత్తరంలో కామరాజ్ డబ్బు యెలా చెల్లించాలో సూచనలిచ్చాడు. కానీ యెంత మొత్తం చెల్లించాలో చెప్పలేదు. ఇది చాలా కాలంగా సాగుతున్న వ్యవహారం కాబట్టి ఆ అవసరం లేదని అతని ఉద్దేశ్యం—యెంత చెల్లించాలో నవీన్‌కు తెలుసు. అయితే ఆ మొత్తం చెల్లించకుండా, డబుల్ క్రాస్ చేసి, ఆ తర్వాత కామరాజ్‌ని హత్య చేసి మరో వ్యక్తిని యిరికించాలనుకొన్నాడు.

"వినోద్‌కు ఆక్సిడెంట్ జరిగి స్పృహ కోల్పోయాడు. ఈ పని వినోద్‌ను ఆసరాగా చేసుకొని చేస్తే బావుంటుందని నవీన్ అనుకొన్నాడు. అంటే యీ బ్లాక్ మెయిల్ గేమ్‌ను వినోద్ మీదకు మళ్ళించాలి. కామరాజ్ వద్దకు వినోద్ మధ్యవర్తిగా డబ్బుతో మాపసు పంపాలి. ఆ డబ్బు యెప్పటిలా పదివేలు కాకూడదు—తక్కువ మొత్తంలో కామరాజ్ ఘర్షణకు దిగేలా చెయ్యాలి.

"బ్యాంకునుండి నవీన్ ఆ డబ్బు బుద్ధిపూర్వకంగా ఈ హత్యలో ఉపయోగించడానికే తెచ్చాడు. తల్లిని మభ్యపెట్టి, దాన్ని సేఫ్‌లో వుంచి, అదే రాత్రి రహస్యంగా తీసి, మర్నాడుదయం నర్సింగ్ హోం కెళ్ళాడు.

"అక్కడ యెవరి కంటబడకుండా స్పృహ తప్పివున్న

వినోద్ తలగడక్రింద ఆ డబ్బు పెట్టి, దానితోబాటు బ్లాక్ మెయిల్ ఉత్తరం కూడా పెట్టాడు. ఆ తర్వాత అక్కడ తన మనిషిని నిఘా వుంచి వెళ్ళిపోయాడు.

"అక్కడనుంచి రూప యింటికెళ్ళి, సేఫ్ తాళాలు ఆమె దృష్టి నాకర్షించే చోటపడేసి, తిరిగి ఇంటికెళ్ళి, బెదిరించిన వ్యక్తికి డబ్బు అవసరం ఇప్పట్లో లేదని తల్లికి చెప్పాడు.

"సేఫ్‌లో దొంగతనం యెప్పటికైనా బయటపడక తప్పదు. అప్పుడు రూపను దొంగను చేస్తే, ఈ హత్య విషయంలో యెవరైనా ఒకటికి నాలుగు జోడించి పదహారు వూహించుకొంటారు. రూప సులువుగా హంతకురాలవుతుంది.

"అయితే రూప ఆ ఉదయం నిద్ర లేచి, యింట్లో ఆ తాళాలు చూసి, గాభరా పడి పిన్ని దగ్గరికి వచ్చి వాటిని యిచ్చేసి వెళ్ళిపోయింది. ఆమె తిన్నగా వినోద్ దగ్గరకెళ్ళుందని నవీన్‌కు తెలుసు. వెంటనే రంగంలో దిగితే బాగుంటుందనుకొన్నాడు. కాబట్టి సేఫ్ తెరిచి డబ్బు పోయిందన్నాడు.

"రూప నర్సింగ్ హోంలో ఆ ఉత్తరం చూసి అది తన అన్నయ్యకే ఉద్దేశించిందని అభిప్రాయపడింది. ఆ ఉత్తరంతోబాటు డబ్బు చూశాక ఆమె కామన్ సెన్స్ కోల్పోయింది. ఆ డబ్బు అక్కడెవరు పెట్టారన్న ఆలోచన ఆమెకసలు రాలేదు. ఆ రోజుతో గడువు తీరిపోతుంది. ఆ ఉత్తరంలో విషయం చదివి, దాన్ని చింపి పారేసి బయటపడింది. నిజానికి ఆమె అన్న వినోద్ ఏ బ్లాక్ మెయిలింగ్‌లో ఇరుక్కోలేదు.

"ఆమెను అనుక్షణమూ కనిపెడుతున్న నవీన్ మనిషి ఆమెను ఫాలో చేస్తూ హైద్రాబాద్ చేరుకొన్నాడు.

"రూప హైదరాబాద్ చేరుకున్నాక తానెంత అవివేకంగా ప్రవర్తించిందో తెలుసుకొని, ఆమె పిన్ని నుండి ప్రమాదాన్ని ఆశించి, మా రక్షణ కోరి అజ్ఞాతవాసంలోకెళ్ళింది. ఆమెను ఫాలో చేస్తున్న మనిషి ఆమె ఆచూకీ నవీన్‌కు తెలియజేశాడు. వెంటనే నవీన్ తల్లితో బయలుదేరివచ్చి ఆమెను దొంగగా నిరూపించడానికి ప్రయత్నించాడు. కానీ వ్యవహారం తనమీదకే తిరగబెట్టేసరికి జారుకున్నాడు.

"దానివల్ల అతనికొచ్చే నష్టమేమీ లేదు. ఆ పరిస్థితిలో కామరాజ్‌ని అంతం చేస్తే రూప హంతకురాలు కావడమే గాక, దొంగకూడా అవుతుంది. డబ్బు విషయంలో ఘర్షణపడి ఆమె హత్య చేసిందని ఎవరైనా భావిస్తారు. ఈ ఆలోచనతో అతను రూప కదలికల్ని జాగ్రత్తగా గమనిస్తూ, ఆమె బ్యాంక్ కెళ్ళాక ఆమె గదిలో ప్రవేశించి రివాల్వర్ తీసుకొని, కామరాజ్‌కు ఫోన్ చేసి నా విషయం చెప్పి, నన్ను తరిమేసి అతనింటి కెళ్ళాడు. అక్కడతనితో కాస్సేపు మాట్లాడి షూట్ చేశాడు.

"రివాల్వర్ మీద రూప వేలిముద్ర లుంటాయి. అవి చెడిపోకుండా గ్లోవ్స్ ఉపయోగించాడు. హత్య చేశాక రివాల్వర్ అక్కడ పడేసి, పెరటిదారి గుండా పారిపోయి తల్లిదగ్గరి కెళ్ళాడు. ఆ తర్వాత వరంగల్ చేరుకొన్నాడు."

కృష్ణన్ తలూపాడు, "మరి ఫోటోలు?"

జాన్ నవ్వాడు. "ఫోటోలు ఖచ్చితంగా నేను చెప్పిన స్థలంలోనే వుంటాయి. అక్కడ దొరికిన టార్చిమీద వేలి ముద్రలు లేవు కాబట్టి నవీన్ ఆ ఫోటోల్ని కాజేశాడు—ఫోటో లెక్కడ వున్నాయో తెలుసుకోకుండా హత్య చెయ్యడు."

కృష్ణన్ ముఖం ఎర్రబడింది.

లాల్ అన్నాడు: "బ్లాక్ మెయిల్ లో ఇరుక్కుంది నవీన్ అని ఆధార మేమిటి?"

"ఇప్పుడు మనం కామరాజ్ యింట్లో రహస్య స్థలం సోదా చెయ్యాలి. అక్కడ దొరికే ఆధారాల్నిబట్టి కేసు తేలిపోతుంది—లెటజ్ గో!...." లేచి నిలబడ్డాడు జాన్.

# 10

లాల్ బాత్ రూం తలుపు తెరిచి నేలమీదచూశాడు. తెల్లటి రాతిపలకలు మిలమిల మెరుస్తున్నాయి. తలుపు పూర్తిగా తెరిచి లోని కడుగు పెట్టాడు. జాన్, కృష్ణన్ లు అతన్ని వెంబడించారు.

లాల్ వాష్ బేసిన్ దగ్గరికెళ్ళి చూశాడు. దానికి మూడడుగులపైన గుండ్రటి ఆకారంలో, ఎర్రటిరంగులో, చిన్న గుర్తు వుంది.

జాన్ దాన్ని చూసి ఛటుక్కున కృష్ణన్ వేపు తిరిగాడు.

"ఇన్ స్పెక్టర్, టార్చి వెలిగించు నేను చెప్పిన ప్రయోగం చెయ్యండి. లాల్, నువ్వు తలు పేసి రా!"

లాల్ తలుపు మూశాక గది చీకటి అయింది. కృష్ణన్

టార్చి వెల్గించి, గోడమీద గుర్తు గాలించి, దానికి ఆనించి ఎదురు గోడమీద అద్దంపైన ఫోకస్ చేశాడు.

కాంతి పరావర్తనం చెంది నేలమీద ఒక రాతిపలక నాక్రమించుకొంది.

జాన్ గబగబ అక్కడకెళ్ళి, కూర్చొని పరీక్షించాడు. ఆ రాతి పలకచుట్టూ ప్లాస్టరింగ్ చేసిలేదు. దానిచుట్టూ సన్నటి సందు వదలివుంది. ఆ రాతిపలక ప్రక్కనే టార్చి లభించిన స్థలం మార్క్ చేసి వుంది.

"ఓ. కే. యిక తలుపు తెరువు ...!" జాన్ అన్నాడు.

లాల్ తలుపు తెరిచాక జాన్ జేబులోంచి చిన్న కత్తి తీసి, దాన్ని రాతిపలక సందులో యిరికించి, క్రిందికి వంచాడు. వెంటనే రాతిపలక పైకి లేచింది. దాన్ని అమాంతం తీసి ప్రక్కన పెట్టి "యురేకా!" అని అరిచాడు.

లాల్, కృష్ణన్‌లు అక్కడ చేరి ఆశ్చర్యంగా చూశారు.

రాతిపలక తొలిగాక దాని క్రింద అరంగుళం మందం ప్లాస్టిక్ షీటు బిగించి వుంది.

"ఈ స్థలం వాటర్‌ప్రూఫ్ చేయబడింది" అన్నాడు జాన్.

షీటు తొలిగించాక దాని క్రింద చిన్న స్టీలు పాత్ర కన్పించింది. దాని మూత తెరిచి లోపలినుంచి కొన్ని కవర్లు తీశాడు.

ఒక్కొక్క కవరు తెరుస్తూ; అందులోని నెగిటివ్‌లు,

ఫోటోలు, బయటికి తీస్తుంటే—కృష్ణన్, లాల్ లు కళ్ళప్పగించి చూడసాగారు. అన్నీ అశ్లీలమైన ఫోటోలు....!

నాలుగుకవర్లు తెరిచాక అయిదవ కవరులో నెగటివ్స్ మాత్రమే కన్పించాయి. అలాగే మరికొన్ని కవర్లలో కూడా నెగటివ్ లే వున్నాయి. మొత్తం 13 కవర్లలో ఏడింటిలో నెగటివ్ లున్నాయి. మిగతా ఆరింటిలో నెగటివ్ లతో బాటు వాటి ఫోటోలు కూడా వున్నాయి.

ఏడు కవర్లలో విడిగావున్న నెగటివ్ లలో ఆరింటిని, ఆరు ఫోటోలలోవున్న నెగటివ్ లకి పోలికలున్నాయి. మిగతా ఒక నెగటివ్ సెట్ కి దాని ఫోటోలు లేవు.

"ఈ నెగటివ్ లు వీటి డూప్లికేట్ కాపీలు" అన్నాడు జాన్. "ఈ ఆరు కవర్లలోని ఫోటోలలో నవీన్ గానీ, వినోద్ గానీ లేరు. విడిగావున్న ఈ నెగటివ్ సెట్ కి మిగతా వాటికిలాగే ఫోటోలతో కూడిన నెగటివ్స్ లేవు."

"ఏమయ్యాయి?"

"మాయమయ్యాయి."

"ఆ నెగటివ్స్ లోవున్న దెవరు?"

"ఇద్దరు స్త్రీ పురుషులు-వివిధ భంగిమల్లో వున్నారు. మనక్కావల్సింది పురుషుడు కాబట్టి యితను నవీన్ అనుకుంటాను."

"నెగటివ్ లో స్పష్టంగా గుర్తించలేం, కాపీలు తీయాలి" అన్నాడు లాల్.

"మరి ఈ నెగటివ్స్ ని కూడా ఎందుకు తీసుకెళ్ళ లేదు?" అడిగాడు కృష్ణన్.

"ఈ నెగటివ్స్ గురించి అతనికి తెలియదు" అన్నాడు జాన్. "కామరాజ్ టెక్నికల్ నాలెడ్జివున్న బ్లాక్ మెయిలర్. ముందుజాగ్రత్త కోసం అదనంగా ఈ కాపీలు తయారుచేసుకున్నాడు. నెగటివ్ నుంచి ఫోటోలు కాపీ తీసినట్లు, నెగటివ్ నుండి నెగటివ్ కాపీలు తయారు చేయవచ్చని నవీన్‌కు తెలియదు. అందుకే యధాలాపంగా చేతికందిన కవరు తనకు సంబంధించింది కావడంతో దాన్ని తీసుకుని వెళ్ళిపోయాడు. అందులో అతని ఫోటోలు, నెగటివ్‌లు వున్నాయి.

కానీ ఇక్కడ వాటి డూప్లికేట్ నెగటివ్ కాపీలున్నాయి."

"వీటిని వెంటనే ప్రింట్ తీయించాలి!" లాల్ అన్నాడు.

"అంతే కాదు, నవీన్ ఆ కవర్‌తో పెరటిదారి గుండా పారిపోయాడు. వాటిని కూడా తీసికెళ్ళకుండా వెనుక రాళ్ళూ రప్పలూ, చెట్లూ చేమలతో కూడిన విశాలమైన మైదానంలో ఎక్కడో నాశనం చేసి, ఆ తర్వాత తల్లి దగ్గరికెళ్ళి వుండొచ్చు. కృష్ణన్ మీ బలగం వాటికోసం వెంటనే గాలింపు ప్రారంభించాలి!" అన్నాడు.

కృష్ణన్ తలూపాడు.

* * *

కామరాజ్ ఇంటి వెనుక భాగంలో పోలీసు గాలింపు ప్రారంభమైంది. అప్పుడొక గొడ్లకాపరి స్టేట్‌మెంట్‌తో సాక్ష్యాధారాలు నాశనం చేయబడ్డ స్థలం సులువుగా కనుక్కోగలిగారు.

క్రితంరోజు మధ్యాహ్నం సుమారు రెండుగంటలకు ఆ ప్రాంతాల పశువుల్ని కాస్తున్న కాపరి—అటు వేపు ఒకవ్యక్తి గాభరాగా పరిగెత్తి కొచ్చి, చెట్లచాటున కూర్చొని దేనికో నిప్పుపెట్టడం గమనించినట్లు చెప్పాడు. అతని షర్టుమీద అరచేతి వెడల్పులో అస్పష్టంగా ఎర్రటి మరక చూసినట్లు కూడా చెప్పాడు.

పోలీసులకి ఆ స్థలంలో బూడిద, నల్లటి ప్లాస్టిక్ పదార్థం లభించింది.

నెగటివ్ డూప్లికేట్ కాపీలనుండి ప్రింట్స్ తీయబడ్డాయి. గొడ్లకాపరి ఆ ప్రింట్స్‌లోని వ్యక్తిని గుర్తించాడు. ఆ ఫోటోల్లో నవీన్ అసభ్య సన్నివేశాల్లో పాల్గొంటున్న దృశ్యాలున్నాయి.

—: ఐపోయింది :—

# శనివారం రాత్రి అతిథి

---

## వి. ఎస్. చెన్నూరి

రంగమ్మ చీపురు చేతబట్టి తన గుడిసెలోంచి బైటపడే సరికి, ఇంకా వీధిదీపాలు వెలుగుతూనే వున్నాయ్. ముసిరిన చీకట్లు యింకా పారిపోలేదు.

రంగమ్మ తిన్నగా వచ్చి మేజర్ మోహన్‌రంగం యింటిముందు ఆగింది. గేటుతలుపు తెరుచుకుని కాంపౌండు లోకి చేరుకుంది. వీధివాకిలీ-వరండా శుభ్రం చేసి, వీధి గుమ్మంవద్దకు చేరుకుంది. మూసిన తలుపులకి వ్రేలాడు తోన్న తాళంకప్ప కనిపించేసరికి చటుక్కున ఆగి పోయింది.

మేజర్ మోహన్‌రంగం రిటైర్డ్ మిలిటరీ ఆఫీసరు. ఆయనకు అన్నీ టైంప్రకారం జరగాలి. జరగవలసిన టైముకి ఏ మాత్రం ఆలస్యమయినా సహించడు.

రోజూ రంగమ్మ నాలుగున్నరకల్లా ఇల్లు చేరుకుని డోర్ బెల్ మోగిస్తుంది. మోహన్‌రంగం పక్కమీంచి లేచి తలుపు తెరుస్తాడు. బట్టలు మార్చుకుని, టైగర్ని

వెంటబెట్టుకుని ఇంట్లోంచి బైటపడతాడు. మార్నింగ్ వాక్ పూర్తిచేసుకుని' ఇల్లు చేరుకునేసరికి అరున్నరవుతుంది.

ఆయన ఇల్లు చేరుకునే సరికి రంగమ్మ యిల్లు శుభ్రం చెయ్యడం, కాంపౌండ్‌లోని మొక్కలికి నీళ్ళు పెట్టడం వగైరాపనులన్నీ పూర్తిచేసుంది. నాయర్ వేడివేడి కాఫీ గ్లాసుతో ఎదురొస్తాడు. మేజర్ కాఫీ త్రాగిన తరువాత తన కాలకృత్యాలు తీర్చుకునేందుకు వెళతాడు.

అతడు కాలకృత్యాలు తీర్చుకుని డైనింగ్ హాల్లోకి చేరుకునేసరికి నాయర్ వేడివేడి టిఫిన్ తయారుచేసి వడ్డించడానికి తయారుగా వుంటాడు. ఇదీ-రోజూ జరుగుతోన్న కార్యక్రమం!—

మేజర్ ఆ యింటిని అద్దెకు తీసుకుని సంవత్సరం దాటుతోంది. ఆ సంవత్సర కాలంలోనూ దైనందిన కార్యక్రమంలో ఎలాంటి మార్పులేదు.

తాను యిల్లువిడిచి ఎక్కడికైనా వెళ్ళవలసి వచ్చినా, తనింటికి ఎవరైనా అతిథులు వస్తున్నా, ముందుగానే నౌకర్లందరికి తెలియపరుస్తాడు. ఎవరెవరు ఏం చెయ్యవలసింది కూడా ముందుగానే నిర్ణయిస్తాడు.

అలాంటి మేజర్ యింత ప్రొద్దున్నే ఇంటికి తాళం పెట్టి ఎక్కడికి వెళ్ళాడో రంగమ్మకి అర్థంకాలేదు.

గుమ్మంవద్ద నుండి మెల్లగా కిటికీవద్దకి చేరుకుంది. కిటికీ క్రింది రెక్కలు మూసివున్నయ్. పైరెక్కలు తెరిచి వున్నయ్. లోపలదీపం వెలుగుతోంది. దీపం వెలుగులో మేజర్ పడుకునే మంచం ఖాళీగా దర్శనమిచ్చింది. మంచం క్రింద టైగర్ చుట్టచుట్టుకుని పడుకునివుంది.

టైగర్ కంటపడగానే రంగమ్మ మరింత ఆశ్చర్యపోయింది. దగ్గర్లో ఎక్కడికెళ్లినా మేజర్ టైగర్ని వెంట పెట్టుకుని వెళ్ళడం అలవాటు. టైగర్ని గదిలోనే విడిచిపెట్టి వెళ్ళాడంటే ఆమె మనసు కీడుని శంకించింది. కాని ఏం చెయ్యాలో తోచక కాలుగాలిన పిల్లిలా వరండాలో పచార్లు చెయ్యసాగింది.

అంతలో గేటు గుమ్మందగ్గర సైకిల్ బెల్లు మోగింది. రంగమ్మ గేటుకేసి తిరిగింది. పాలుపోసే మల్లేషు సైకిల్ దిగాడు. రంగమ్మ మల్లేషుని కలుసుకుని తన అనుమానాన్ని తెలియపరిచింది.

"అయితే ఇప్పుడేం చెయ్యాలి?" అన్నాడు మల్లేషు ఏం చెయ్యాలో తోచక.

"అదే నాకూ పాలుపోవడంలేదు" అంది రంగమ్మ.

"ఎదురింటి మరియమ్మగారికీ విషయం తెలియజేస్తే ఆమె పోలీసులకి తెలియజేయవచ్చు. వాళ్ళింట్లో ఫోను కూడా వుందనుకుంటాను" అంది రంగమ్మ మళ్ళీ ఆలోచించి.

వెంటనే ఇద్దరూ కలిసి ఎదురింటి పోర్టికోలోకి చేరుకుని డోర్ బెల్లు మోగించారు. రెండుమూడు మార్లు మోగించిన తరువాత గానీ మేరీ తలుపు తెరవలేదు. బదకంగా వొళ్ళు విరుచుకుంటూ పాలగిన్నె తెచ్చి మల్లేషుకిచ్చింది. మల్లేషు గిన్నెలో పాలుపోస్తూ, ఎదురింటి మేజర్ గురించి చెప్పాడు.

"అలాగా? ఇంత ప్రొద్దున్నే ఎక్కడికెళ్ళాడు చెప్మా!" మేరీ ఆశ్చర్యంగా రంగమ్మకేసి చూసింది.

"నాకూ అదే బోధపడ్డంలేదమ్మగారూ! ఎందుకయినా మంచిది మీరీ విషయాన్ని పోలీస్ స్టేషన్కి ఫోన్ చేస్తే

మంచిదనిపిస్తోంది" అంది రంగమ్మ.

మేరీ యీ విషయాన్ని పోలీసులకి ఫోన్ చెయ్యడానికి ఎందుకో తటపటాయించింది. "మనం పోలీసుల దృష్టికి వెళ్ళనే వెళ్ళకూడదు. వెళ్ళామా ప్రతి చిన్న విషయానికీ మనల్నే అనుమానిస్తారు. వాళ్ళు వేసే ప్రశ్నలకి జవాబు చెప్పలేక చావాలి!" అంది.

"అదేటండమ్మగారూ! మీరు చదువుకున్న వాళ్ళు. మీరే ఇలా తటపటాయిస్తే ఇక మాలాంటి చదువురాని వాళ్ళు ఏం చెయ్యగలం?" అంది రంగమ్మ.

మేరీ తటపటాయిస్తూనే వెళ్ళి స్టేషన్‌కి ఫోన్ చేసి మేజర్ విషయం తెలియపరిచింది.

పావుగంట గడిచింది. పోలీస్ వాన్ మేజర్ యింటి ముందు ఆగింది. వాన్‌లోంచి క్రిందికి దిగిన ఇన్‌స్పెక్టర్ సత్యం యింటిముందు మూగిన జనాన్ని ఉద్దేశించి ప్రశ్నించాడు.

"స్టేషన్‌కి ఫోన్ చేసిందెవరు?" అని.

ముఖం కడుక్కొని టవలుతో ముఖం తుడుచుకుంటూ అప్పుడే అక్కడికి వచ్చిన మేరీ, "నేనేనండి! రంగమ్మా, మల్లేషూ మా యింటికొచ్చి మీకీ విషయాన్ని ఫోన్ చెయ్యమన్నారు" అంది.

ఇన్‌స్పెక్టర్ మేరీకేసి తిరిగి చూశాడు. ఆమెకు ముప్ఫయ్యేళ్ళుంటయ్. చామనచాయ. ఏపుగా పెరిగిన అవయవ పరిపుష్టితో పిటపిటలాడుతోంది. గుండ్రటి ముఖంలో కొనతేరిన ముక్కూ, చారడేసి కళ్ళూ, మన్మథుని ధనుస్సులా వొంగిన లావుపాటి పెదాలూ, లోనెక్ జాకెట్లో బంధించిన వక్షోజాలూ మగవాడ్ని రెచ్చగొట్టడానికి అనువైన అంశాలు.—

"మీ పేరేమిటో తెలుసుకోవచ్చా?" అని ప్రశ్నించాడు ఇన్స్పెక్టర్.

"మేరీవిక్టర్! మావారు స్టేట్స్‌లో వున్నారు. నేను మిషన్ స్కూల్లో హెడ్‌మిస్ట్రెస్‌గా పని చేస్తున్నాను. ఎదురల్లే మాది" అంది మేరీ సౌజన్యాన్ని ఒలకబోస్తూ.

"మీకు మేజర్ గారితో బాగా పరిచయముందా?"

మేరీ లేదన్నట్టు తలూపింది. "మేజర్ యీ యింటికొచ్చి సంవత్సరం దాటుతోంది. కాని ఈ పరిసరాల్లో ఎవరికీ ఆయనతో పరిచయం లేదు. ఆయన చాలా 'రిజర్వ్‌డ్' టైప్. ఎవరితో పరిచయం కలిగించుకున్నట్టు లేదు."

"థాంక్స్! అవసరమైతే మళ్ళీ కలుసుకుంటాను" అంటూ కాంపౌండ్ గేటుకేసి నడిచాడు ఇన్స్పెక్టర్ సత్యం. అతని అసిస్టెంటు ఆనందరావూ, మిగతా పోలీసు బృందం ఇన్స్పెక్టర్‌ని అనుసరించారు. మేరీ వెనక్కి తిరిగి వెళ్ళిపోయింది.

ఇన్స్పెక్టర్ పోర్టికోలో ఆగి, "నీ పేరేనా రంగమ్మ?" అని ప్రశ్నించాడు రంగమ్మని వుద్దేశించి.

"అవునండి! ఇల్లూ వాకిలి శుభ్రం చెయ్యడం, మొక్కలికి నీళ్ళుపొయ్యడం వగైరా పనులన్నీ నేనే చేస్తుంటానండి! నేనువొచ్చి బెల్లు మోగించేదాకా అయ్యగారు నిద్ర లేచేవారు కారు. ఈ రోజు ఇంత ప్రొద్దున్నే లేచి తలుపుకి తాళంపెట్టి ఎక్కడికెళ్ళారో అర్థంకావడంలేదు. ఎక్కడికైనా వెళితే టైగర్ని కూడా తీసికుని వెళ్ళేవారు. టైగర్ కూడా ఇంట్లోనే వుంది.

ఆయనకి అన్ని టైంప్రకారం జరగాలి. లేకపోతే

విసుక్కునేవారు. ఎక్కడికైనా వెళ్ళవలసి వస్తే ముందు గానే తెలియపరిచేవారు. అందుచేత నాకు అనుమానం వేసి, అప్పుడే పాలు పొయ్యడానికొచ్చిన మల్లేషుని వెంటపెట్టుకుని మరియమ్మ యింటికెళ్ళాను. మీకు ఫోన్ చేయించాను" అంది రంగమ్మ.

"అవును సార్! మేజర్ గారు అర్జంటుగా వెళ్ళవలసి వస్తే నాకు ఫోన్ చేసి చెప్పేవారు. మా ఇంటి యజమానికి ఫోన్ వుంది సార్. మేజర్ గారికి ఆ ఫోన్ నంబరు తెలుసు. రెండు మూడుసార్లు నాకు ఫోన్ చేశారు కూడా" అన్నాడు అంతక్రితమే అక్కడికి చేరుకున్న వ్యక్తి.

"ఎవరు నువ్వు?" ప్రశ్నార్థకంగా ఆ వ్యక్తికేసి చూశాడు ఇన్‌స్పెక్టర్ సత్యం.

"నా పేరు వేలాయుధం సార్. నన్నందరూ నాయర్ అనే పిలుస్తారు. నేను మేజర్ గారికి వంట చేసి పెడుతూ వుంటాను" అన్నాడా వ్యక్తి.

"మేజర్ గారికి, ఈ వూళ్ళో బంధువులు గానీ, స్నేహితులు గానీ ఎవరూ లేరా?"

"లేరుసార్" నాయర్ తల అడ్డంగా వూపి, "కానీ...." అంటూ ఆగిపోయాడు.

ఇన్‌స్పెక్టర్ నాయర్ కేసే ప్రశ్నార్థకంగా చూస్తూ వుండిపొయ్యాడు.

"ఈ మధ్య నాలుగయిదు వారాలుగా ఇంటి కెవరో అతిథులొస్తున్నారని వంటకాలు స్పెషల్ గా చేయించే వారు...." నాయర్ చెప్పటం ఆపి, "ఈ రోజు అది వారం కదా సార్?" అని ప్రశ్నించాడు.

ఇన్‌స్పెక్టర్ అవునన్నట్టు తలూపాడు.

"ఆ అతిధి ఎవరోగాని, శనివారం రాత్రిళ్ళే వస్తూంటాడు. రాత్రి కూడా ఇంటికెవరో వస్తున్నారని రెండు ఆమ్లెట్లూ, జింజెర్ చికెన్, చపాతీలు చేయమన్నారు. మేజర్‌గారు బహుశా, ఆ అతిధిని ఏ స్టేషన్‌లోనో దిగబెట్టేందుకు వెళ్ళివుండొచ్చు" అన్నాడు నాయర్. వెంటనే ఏదో గుర్తుకు రాగా "ఆగండి సార్, ఇప్పుడే వస్తాను!" అంటూ ఇంటి పెరటికేసి పరుగుతాడు.

ఇన్‌స్పెక్టర్‌కేమీ అర్ధంకాక అతనికేసే చూస్తూ వుండిపొయ్యాడు.

పెరటికేసి పరుగెత్తిన నాయర్ ఐదునిమిషాల్లో తిరిగి వచ్చాడు. "నా వూహ కరెక్ట్ కాదు సార్! ఆ అతిధిని స్టేషన్‌దాకా దిగబెట్టడానికి వెళ్ళివుంటే మేజర్‌గారు స్కూటరేసుకుని వెళ్ళివుండేవారు సార్. స్కూటర్ గారేజీలోనే వుంది" అన్నాడు నాయర్.

"నాయిర్ తెలివైనవాడే" అనుకున్నాడు ఇన్స్పెక్టర్.

"ఇంతకీ ఆ 'శనివారం రాత్రి' అతిధి ఆడా, మగా? నువ్వు చూశావా?" అని ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

నాయర్ తల అడ్డంగా వూపాడు. "నేను చూడలేదు సార్! ఆడో మగో చెప్పలేను కాని, ఆ అతిధికి ఆమ్లెట్లన్నా, జింజెర్ చికెన్ అన్నా చాలా యిష్టంలాగుంది" అన్నాడు.

ఇన్‌స్పెక్టర్ సత్యం అడుగు ముందుకి వేసి గుమ్మం వద్దకి చేరుకున్నాడు. కానిస్టేబుల్ అందించిన తాళాల గుత్తితో తాళంకప్పని తెరవడానికి ప్రయత్నించసాగాడు. రెండు మూడు తాళంచెవులకే కప్ప వూడి వచ్చింది.

"ఆగండి సార్! తలుపు తెరవకండి!" ఒక్క అంగలో అక్కడికి చేరుకున్నాడు నాయర్. "మీరు తలుపు తెరిచారంటే టైగర్ మీది కురుకుతుంది సార్. కొత్త వ్యక్తుల్ని చూస్తే దానికి కోపమెక్కువ. నేను లోపలికెళ్ళి టైగర్ని పట్టుకుంటాను. తరువాత మీరు రండి!" అంటూ ఇన్స్పెక్టర్ జవాబుకోసం యెదురు చూడకుండానే లోపలి కెళ్ళి టైగర్ మెడ పట్టీ పట్టుకున్నాడు.

ఆ తరువాత ఇన్స్పెక్టర్ సత్యం, అతని అసిస్టెంటు ఆనందరావు లోపలికి వెళ్ళారు.

టైగర్ లోపలికొచ్చిన కొత్త వ్యక్తుల్ని చూసి అరవ సాగింది. మీది కురకడానికి ప్రయత్నిస్తోంది. నాయర్ దాన్ని సముదాయించడానికి తన శాయశక్తులా ప్రయత్నిస్తున్నాడు. చివరికి అతని ప్రయత్నం ఫలించింది. టైగర్ని మెల్లగా గదిలోంచి బైటకు తీసుకువచ్చి, పోర్టికోలో గుంజకు కట్టివేశాడు.

ఇన్స్పెక్టర్ సత్యం తిన్నగా బెడ్రూములోకి చేరుకున్నాడు.

మంచాని కెదురుగా టీపాయ్మీద వాట్ సిక్సీ నెన్ బాటిలు ఖాళీది, రెండు గాజుగ్లాసులూ, ఖాళీ చేసిన రెండు సోడాబుడ్లూ స్టెయిన్లెస్ స్టీల్ ప్లేటులో తినగా మిగిలిన చపాతీ ముక్కలు, కోడి ముడుసులూ అస్తవ్యస్తంగా పడివున్నయ్. మంచంమీద పరిచిన పరుపుమీద తెల్లని బెడ్షీటు బాగా నలిగిపోయి వుంది. అక్కడక్కడా నలిగిన మల్లెపూలు యెర్రగా రాలి వున్నయ్.

"ఈ 'శనివారం రాత్రి అతిథి' మగ కాదు—ఆడే!" అన్నాడు ఇన్స్పెక్టర్ సత్యం.

"అవునుసార్! మనమీ గదంతా ఓసారి గాలిస్తే ఆవిడ పేరూ అడ్రసు కూడా తెలుసుకోవచ్చు" అన్నాడు ఆనందరావు.

టీపాయ్‌మీది వస్తువులేవీ ముట్టుకోకుండా యెదురుగా వున్న బుక్‌షెల్ఫ్‌వద్దకి చేరుకున్నారు. అందులో వున్న పుస్తకాలన్నింటినీ గాలించారు. కాని వుపయోగించే విషయాలేవీ దొరకలేదు.

ఇన్‌స్పెక్టర్ టేబుల్ డ్రాయర్ లాగాడు. తాళం వెయ్యలేదు గనక వెంటనే వచ్చేసింది. లోపల చిల్లర పైసలూ, బాంక్ పాస్‌బుక్కూ, ఏవో బిల్లులూ కనిపించాయి. ఓ మూల ప్లాస్టిక్ కవర్ తొడిగిన ఓ పెద్ద డైరీ కంటబడింది.

ఇన్‌స్పెక్టర్ వెంటనే దాన్ని అందుకుని ఆత్రంగా పేజీలు తిప్పసాగాడు. కాని తాను ఆశించిందేమీ అందులో దొరకలేదు. తన ప్రియురాలిని గురించి అతడు అందులో యేమీ వ్రాసుకోలేదు. కనీసం ఆమె తాలూకు ప్రేమలేఖ కూడా దొరకలేదు. నిరాశగా పేజీలు త్రిప్పుతుండగా అందులోంచి ఓ కార్డుసైజు ఫోటో క్రింద పడింది.

ఇన్‌స్పెక్టర్ ఫోటోని చేతిలోకి తీసుకున్నాడు.

అది ఓ అందమైన యువతి ఫోటో. కాని అందులో ఆమె అడ్రసు-గానీ, సంతకంగానీ యేమీలేదు. ప్రకాష్ స్టుడియో, బాంబే-4 అన్న స్టాంపు మాత్రం వెనక వేపున వేయబడి వుంది. ఆమె పేరూ, అడ్రసూ తెలుసుకోవాలంటే బొంబాయి వెళ్ళి దర్యాప్తు చెయ్యాలి.

ఇన్‌స్పెక్టర్ ఫోటోని జేబులో దాచుకుని గదిలోంచి బైటికి నడిచాడు. ఆనందరావు అతడ్ని అనుసరించాడు.

ఇద్దరూ పోర్టికోలోకి చేరుకుని, టైగర్ దగ్గర నిల్చుని వున్న నాయర్‌ని దగ్గరికి పిలిచి, ఫోటో చూపించి, "ఈవిడ యెవరో నీకు తెలుసా?" అని ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

నాయర్ ఫోటోని పరిశీలనగా చూచి తెలీదన్నట్టు తలూపాడు. "ఈమెను యెక్కడా చూచినట్లు గుర్తులేదు సార్!" అన్నాడు.

రంగమ్మ కూడా ఫోటోలోని వ్యక్తిని గుర్తుపట్టలేక పోయింది.

ఇన్‌స్పెక్టర్‌కి బుర్రంతా గందరగోళంగా వుంది. ఈ ఫోటోలోని వ్యక్తెవరో, రాత్రి మేజర్‌తో గడిపిన వ్యక్తికీ ఈమెకూ సంబంధమేమిటో, అసలు మేజర్ ఏమయ్యాడో ఏమీ అర్థం కావడంలేదు.

## 2

టైగర్‌కి బిస్కట్లు తినిపిస్తోన్న ఇన్‌స్పెక్టర్ తలెత్తి చూశాడు.

గుమ్మం దగ్గర నిల్చున్న మేరీ చిన్నగా నవ్వి "మీరు సామాన్యుల్లా కనిపించడంలేదు. రెండు రోజుల్లోనే టైగర్‌ని మచ్చిక చేసుకోవడం మామూలు విషయం కాదు" అంది. మెల్లగా ముందుకి వచ్చి టైగర్ దగ్గరగా నిల్చుంది.

కమ్మగా సెంటు వాసన గుప్పుమంది.

"నోరులేని జంతువుల్ని మచ్చిక చేసుకోవడం కష్టమేమీ కాదు. ఎటొచ్చీ నోరున్న మనుషుల్ని మచ్చిక చేసుకోవడమే కష్టం" అన్నాడు సత్యం తమాషాగా నవ్వుతూ.

"మీకు అదికూడా సులభమే ననిపిస్తోంది!" మేరీ ముత్యాలు వొలకబోసింది. "ఇంతకీ మేజర్ గురించి ఏమైనా తెలిసిందా?" అని ప్రశ్నించింది.

ఇన్‌స్పెక్టర్ సత్యం లేదన్నట్టు తలూపాడు.

"టెలిగ్రాం సార్!" గుమ్మం దగ్గర బంట్రోతు కేక వేశాడు.

"యెవరికి....? మేజర్ గారి కేనా....?" మేరీ ప్రశ్నించింది.

"అవును మేడమ్, మేజర్ మోహన్ రంగం గారికి" అన్నాడు టెలిగ్రాం తెచ్చిన బంట్రోతు.

ఇన్‌స్పెక్టర్ ముందుకి వెళ్ళి రిజిష్టర్‌లో సంతకం పెట్టి టెలిగ్రామ్ అందుకున్నాడు.

"అరైవింగ్ సికింద్రాబాద్ ఆన్ ఫోర్తు బై ట్రెయిన్ నం 31. వెయిట్ మీ అట్ స్టేషన్!"
—సుశీల."

అని వుందా టెలిగ్రామ్‌లో.

ఇన్‌స్పెక్టర్ ఆలోచనల్లో పడ్డాడు.

ఎవరీ సుశీల? శనివారం రాత్రి అతిథికీ—ఫోటోలోని వ్యక్తికీ—యీ సుశీలకీ యేమిటి సంబంధం?—ముగ్గురూ వొక్కరేనా?—

ఇన్‌స్పెక్టర్ బుర్ర మొద్దుబారింది.

"ఎవరీ సుశీల? మీకేమయినా తెలుసా?" అని ప్రశ్నించాడు మేరీకేసి తిరిగి.

ఆమె తనకి తెలీదన్నట్టు తల అడ్డంగా వూపింది.

ఇన్‌స్పెక్టర్ సత్యం బరువుగా నిట్టూర్చి పక్కకి తిరిగాడు. మేరీ రిస్టువాచీ చూచుకుని "ఓ మైగాడ్! తొమ్మిది దాటుతోంది! నేను వెళుతున్నా ఇన్‌స్పెక్టర్!

స్కూలుకి టైమైంది!" అంటూ అడుగు ముందుకి వేసింది.

ఇన్‌స్పెక్టర్ సత్యం ఆమెకు 'టా టా' చెప్పి, టైగర్‌తో పాటు హాల్లోకి చేరుకున్నాడు. జేబులోంచి సిగరెట్టు పాకెట్టూ అగ్గిపెట్టె బెటికి తీసి, సిగరెట్టు వెలిగించుకొని సోఫాలో కూలబడ్డాడు. రెండు దమ్ములు లాగాడో లేదో, అతని బుర్రలో ఏదో ఆలోచన తళుక్కుమంది. చటుక్కున సిగరెట్టుని ఆష్‌ట్రేలోకి విసిరి లేచి నిలుచున్నాడు.

"టైగర్! మనం మేజర్ గారి ఆచూకీ తెలుసుకోవాలి! బీ రెడీ మై బాయ్!" అంటూ క్రిందికి వొంగాడు.

నేలమీద చతికిలబడి తల పైకెత్తి ఇన్‌స్పెక్టర్ ముఖంలోకి చూస్తోంది టైగర్.

ఇన్‌స్పెక్టర్ పట్టెమంచం క్రింద మేజర్ తాలూకు బూట్లకేసి నడిచాడు. బూట్లమీద పడివున్న మాసిపోయిన సాక్స్‌ని ఎడం చేతివ్రేళ్ళతో పైకెత్తి టైగర్‌కి వాసన చూపి, "లెటజ్ ప్రొసీడ్, మై బోయ్!" అంటూ కుడి చేత్తో దాని వీపుమీద మెల్లగా తట్టాడు.

టైగర్ లేచి నిల్చుంది. ఇన్‌స్పెక్టర్ అడుగు ముందుకి వేశాడు. టైగర్ మెల్లగా బయలుదేరింది. మెల్లగా బయలుదేరిన టైగర్ క్రమంగా స్పీడందుకుంది. ఇన్‌స్పెక్టర్ సత్యం టైగర్‌ని అనుసరిస్తున్నాడు.

టైగర్ అక్కడక్కడ ఆగుతూ, నేల వాసన చూస్తూ, ముందుకి నడుస్తోంది. వెస్టుమారేడ్‌పల్లి దాటి ఈస్టు మారేడ్‌పల్లి చేరుకుంది. ఊరి బయట తూర్పు దిక్కుగా ఎత్తయిన పీఠభూమికేసి నడుస్తోంది. కొంత

దూరం నడిచాక రెండు ఎత్తయిన బండలమధ్య ఆగి పోయింది.

"టైగర్! ప్రొసీడ్! ప్రొసీడ్ మై బోయ్!" ఇన్‌స్పెక్టర్ సత్యం దాన్ని తొందరపెట్టసాగాడు.

టైగర్ ఆ ప్రదేశంలోనే నేల వాసన చూస్తూ తచ్చాడసాగింది.

ఇన్‌స్పెక్టర్ ఆ రెండు బండల మధ్య నేలని పరీక్షగా చూశాడు. నేల తవ్వి పూడ్చినట్టు కొత్త మట్టి కనిపించింది.

టైగర్ తాను ఆగిన చోటనే గుండ్రంగా తిరుగుతూ మెల్లగా మొరగసాగింది. ముంగాళ్ళతోనూ, వెనకకాళ్ళతోనూ మట్టిని ఎగజిమ్మసాగింది.

ఇన్‌స్పెక్టర్ సత్యం వెంటనే టైగర్‌ని అక్కడనుండి తొలగించి, మెడపట్టీకి గొలుసు తగిలించి, ఆ పక్కనే వున్న బండకి కట్టేశాడు. ఆ ప్రదేశాన్ని త్రవ్వి చూడడానికి యెవరైనా దొరుకుతారేమోనని ఆ పరిసరాలను పరికించాడు. ఎవరూ కనిపించలేదు. ఏం చెయ్యాలో తోచలేదు.

పది నిమిషాలు గడిచిపోయినయ్.

అల్లంతదూరంలో నలుగురైదుగురు కూలీలు పారలూ, గునపాలూ భుజానపెట్టుకుని మాట్లాడుకుంటూ మల్కాజిగిరివైపునుండి వస్తున్నారు. గాలివాటుకి వాళ్ళు మాట్లాడుకునే మాటలు స్పష్టంగా వినిపించసాగింది. ఇన్‌స్పెక్టర్‌కి ధైర్యమొచ్చింది. వాళ్ళు దగ్గరికి రాగానే ఆపి ఆ ప్రదేశాన్ని జాగ్రత్తగా త్రవ్వించాడు.

రెక్కసిక్కమైన బట్టల్లో ఓ శవం బైటపడింది. ఆ శవం మోహనరంగందేనని గుర్తుపట్టాడు ఇన్‌స్పెక్టర్ సత్యం.

హత్య జరిగి రెండురోజులయినప్పటికీ శవం ఆట్టే చెడ లేదు. తెల్లని లాల్చీ, చారల పైజామా తొడుక్కుని వున్నాడు. తెల్లని లాల్చీమీద, గుండెకు సమీపంలో రక్తం నల్లగా గడ్డకట్టి వుంది. కళ్ళు తెరుచుకుని వున్నయ్. శవం తాలూకు కుడిచేతి పిడికిలి బిగించబడి వుంది.

ఇన్‌స్పెక్టర్ తక్షణం పక్కకి తిరిగి, ఆ రూమ్‌లో హుషారైన కుర్రాళ్ళిద్దర్ని దగ్గరికి పిలిచి, తన అసిస్టెంటు ఆనందరావుకి కబురెట్టాడు.

కుర్రాళ్ళిద్దరూ వెళ్ళింతరువాత మెల్లగా శవం దగ్గరికి చేరుకున్నాడు. ముంగుకి వొంగి పిడికిలి వేళ్ళు బలవంతంగా తెరిచాడు. పిడికిట్లోంచి క్రిందపడ్డ బంగారు గొలుసుని అందుకున్నాడు.

అది మామూలు గొలుసుకాదు. పులిగోరు తగిలించిన మెనర్ చైను. బహుశా హంతకుడిది కావచ్చు. హతుడు హంతకుడితో, చివరిక్షణాలలో పెనుగులాడుతూ అతని మెడలోని పులిగోరు చైనుని అందుకొని వుండొచ్చు. హంతకుడు హత్యచేసి పారిపోయే కంగారులో తన మెడ లోని చైనుని గుర్తించి వుండడు.

ఇన్‌స్పెక్టర్ చైను నందుకుని పరీక్షించసాగాడు. అతని కళ్ళు మెరిసాయి. పులిగోరువైపున 'కే కే' అన్న ఇంగ్లీషు అక్షరాలు కనిపించాయి. బహుశా చైను సొంత దారుడి తాలూకు 'ఇనిషియల్' కావచ్చు. ఈ 'కే కే' యెవరో తెలుసుకొంటే హంతకుడి ఆచూకీ తెలుసుకో వచ్చు.

ఎవరీ కే.కే? శనివారం రాత్రి అతిధికీ ఈ కేకేకీ ఏమిటి సంబంధం? హంతకుడెవడై వుంటాడు?—

ఆలోచనలో పడ్డాడు ఇన్‌స్పెక్టర్ సత్యం.

ఏ మాగయితేనేం, శనివారం రాత్రి అతిథి ఎవరో తెలుసుకోగలిగితే, హంతకుడెవడో తెలుసుకోవచ్చు! హత్యకు కారణం కూడా బయటపడుతుంది!—అని నిశ్చయించుకున్నాడు.

ఇంతకీ ఎవరీ శనివారం రాత్రి అతిథి?—బొంబాయి నుండి టెలిగ్రాం యిచ్చిన సుశీలా? మేజర్ డైరీలోంచి క్రిందపడ్డ ఫోటోలోని వ్యక్తా? — లేక యెదురింటి మేరీయా?—

అతని బుర్రంతా గజిబిజీగా వుంది.

# 3

ఉదయం ఆరుగంటల సమయం.

ప్లాట్ ఫారమ్ మీద జనం, బొంబాయి నుండి సికింద్రాబాద్ చేరుకునే ట్రెయిన్ కోసం ఎదురు చూస్తున్నారు.

అంతక్రితమే అక్కడికి చేరుకున్న ఇన్‌స్పెక్టర్ సత్యం ప్లాట్ ఫారం మీద పచార్లు చేస్తున్నాడు. బొంబాయి నుండి సికింద్రాబాద్ చేరుకోవలసిన రైలు ఒక గంట ఆలస్యంగా వస్తూందని ఎనౌన్సర్ ఎనౌన్స్ చేశాడు.

'ఈ ట్రెయిన్స్ రావలసిన టైముకి ఎప్పుడూ రావు కదా!' అని విసుక్కుంటూ అక్కడే వున్న ఓ బెంచీమీద కూలబడ్డాడు.

గంట గడిచింది. రావలసిన రైలు వచ్చి చేరుకుంది.

క్షణంలో ప్లాట్ ఫారమంతా జనంతో గజిబిజిగా తయారైంది. రైల్లోంచి దిగిన పాసింజెర్స్ తమ లగేజీ పోర్టర్లనెత్తికెక్కించి ప్లాట్ ఫారం మీంచి బైట పడుతున్నారు. పది నిమిషాల్లో ప్లాట్ ఫారం క్లియర్ అయి

పోయింది. ఇన్‌స్పెక్టర్ సత్యం మాత్రం కూచున్న చోటు నుండి కదల్లేదు. అతని కళ్ళుమాత్రం ఎవరికోసమో ప్లాట్‌ఫారమంతా గాలిస్తున్నయ్.

ఫస్ట్‌క్లాస్ కంపార్టుమెంటు దగ్గర ప్లాట్‌ఫారం మీద ఓ యువతి నిల్చునివుంది. ఆమె ముందు ఓ లెదర్ కేసూ బెడ్డింగూ పడివున్నయ్. ఇద్దరు ముగ్గురు పోర్టర్లు ఆమె చుట్టూ చేరి ఏవో మాట్లాడుతున్నారు.

ఇన్‌స్పెక్టర్ సత్యం దృష్టి ఆమెమీద పడింది. వెంటనే లేచి నిల్చుని తిన్నగా ఆమె వద్దకి చేరుకున్నాడు.

"మీ పేరేనా, సుశీల?" అని ప్రశ్నించాడు.

ఆమె అవునన్నట్టు తలూపి, "మిమ్మల్ని అన్నయ్య పంపాడా?" అని ప్రశ్నించింది.

ఇన్‌స్పెక్టర్ అవునన్నట్టు తలూపి, పక్కనున్న పోర్టర్‌నెత్తికి పెట్టే బెడ్డింగూ పైకెత్తి, "వెళదాం పదండి!" అన్నాడా యువతి నుద్దేశించి.

ఆమె పోర్టర్ వెంట బయలుదేరింది. ఇన్‌స్పెక్టర్ ఆమె పక్కనే నడుస్తూన్నాడు.

"అన్నయ్య వూళ్ళోలేడా?" ఆమె మళ్ళీ ప్రశ్నించింది.

ఆమెకేం జవాబు చెప్పాలో తోచక అవునన్నట్టు తలూపాడు ఇన్‌స్పెక్టర్ సత్యం.

స్టేషన్‌లోంచి బైటపడి ఇద్దరూ ఓ టాక్సీలోకి చేరుకున్నారు. టాక్సీ తిన్నగా వెళ్ళి ప్రశాంత్ టాకీస్ దగ్గర ఓ లాడ్జిముందు ఆగింది.

టాక్సీలోంచి దిగిన సుశీల లాడ్జిముందున్న బోర్డుకేసి చూచి ఆశ్చర్యపోయింది. "అన్నయ్య లాడ్జిలో వుంటున్నాడా?" అని ప్రశ్నించింది అనుమానంగా.

ఇన్‌స్పెక్టర్ సత్యం వెంటనే జవాబు చెప్పడానికి తటపటాయించాడు.

"మేజర్ గారు మారేడ్‌పల్లిలో ఓ చిన్న బంగళా అద్దెకు తీసుకుని అందులో వుంటున్నారు. నిన్న సాయంత్రం ఆయన అర్జంటుగా ఎక్కడికో వెళ్ళవలసి వచ్చింది. బహుశా యీ సాయంత్రందాకా ఆయన తిరిగి రావడం వీలుపడదేమో. అందుచేత ఆయన వెళుతూ వెళుతూ మీ నుండి వచ్చిన టెలిగ్రాంని నాయర్ ద్వారా నాకు అందజేసి మిమ్మల్ని రిసీవ్ చేసుకోమని చెప్పి వెళ్ళాడు. వెళ్ళేటప్పుడు ఇంటి తాళంచెవులు నాయర్ కివ్వడం మరిచిపోయాడు. అందుచేత మీకు లాడ్జిలో బస ఏర్పాటు చెయ్యవలసి వచ్చింది" అన్నాడు టెలిగ్రాంని జేబులోంచి తీసి ఆమె కందిస్తూ.

టెలిగ్రాం చూచిన తరువాత ఆమె సందేహం నివృత్తి అయింది కాబోలు ధైర్యంగా అడుగు ముందుకు వేసింది.

ఇన్‌స్పెక్టర్ రెండడుగులు ముందుకివేసి యెందుకో వెనక్కి తిరిగి చూశాడు. లాడ్జికెదురుగావున్న పాన్‌షాపు ముందు సైకిల్ పట్టుకుని నిల్చున్నాడో వ్యక్తి. అతని దృష్టి తమమీదే వుంది. తాను వెనక్కి తిరిగి చూడగానే ఆ వ్యక్తి కంగారుగా ముఖం తిప్పేసి సైకిలెక్కి వెళ్ళిపోయ్యాడు.

ఇంతక్రితం ప్లాట్‌ఫారంలో కూడా అతడ్ని చూచి నట్టు గుర్తుకి రాగానే ఇన్‌స్పెక్టర్ అతని రూపాన్ని పదేపదే గుర్తుకి తెచ్చుకోసాగాడు.

నల్లగా పొట్టిగా కండలు తిరిగిన శరీరం. చట్టిముఖం; చప్పిడి ముక్కు; లావుపాటి పెదాలు; కుడి బుగ్గమీద కత్తిగాటు; ఎడం కంటిక్రింద పులిపిరికాయ!—

పరిచయమైన ముఖమే. ఎంత ప్రయత్నించినా గుర్తుకి రావడంలేదు.

ఇన్‌స్పెక్టర్ సత్యం సుశీలని లాడ్జిలో దిగబెట్టి స్టేషన్‌కేసి బయలుదేరాడు.

# 4

ఓల్డు రికార్డ్స్ రూములో ఇన్‌స్పెక్టర్ సత్యం దేని కోసమో వెతుకుతున్నాడు. అతడి చుట్టూ ఫైళ్ళు కుప్పగా పడివున్నయ్. అతని ముఖంలో స్వేదబిందువులు ముత్యాల్లా మెరుస్తున్నయ్. అతడి కళ్ళు దీక్షగా వెతుకుతున్నయ్.

చివరికి అతని ప్రయత్నం ఫలించింది. అతనికి కావలసిన ఫయిలు దొరికింది. ఫయిలు చేతికందుకుని చకచక పేజీలు తిప్పసాగాడు. ఓ పేజీలో అతని దృష్టి ఆగిపోయింది. ఆ ఫోటోని తదేకంగా చూడసాగాడు. ఫోటో క్రింద 'ముత్రాసి కనకయ్య-వయసు 25 సం॥రాలు' అని వుంది. ఫోటో క్రింద వున్న వివరాలు చదవసాగాడు.

"ముత్రాసి కనకయ్య 'వాగన్ లూటీ గాంగ్'లో ప్రధాన పాత్ర వహించేడు. ముఠానాయకుడు. 1962 లో మల్కాజిగిరి ప్రాంతంలో ఆగివున్న ఓ గూడ్సు బండిమీద పడి వాగన్ బద్దలుకొట్టి బట్టలబేళ్ళు దోచుకుంటూ వుండగా ముఠాతోబాటు పోలీసులకి పట్టుబడ్డాడు. రెండేళ్ళు జైలుకి వెళ్ళివచ్చాడు.

ఆ తరువాత 1966 మార్చి, పన్నెండో తారీఖున నిజామాబాద్ నుండి సికింద్రాబాద్‌కి వచ్చే గూడ్సు బండిని రామకృష్ణాపురం పరిసరాల్లో ఆపి వాగన్‌లోని చక్కెరబస్తాలు కొల్లకొట్టబడ్డాయి. పోలీసులు దర్యాప్తు

చేసి దుండగుల్ని అరెస్టుచేశారు. అందులో కూడా ముత్తాసి కనకయ్య ప్రధానపాత్ర వహించినట్టు బైట పడింది. మాగో గెండేళ్ళు జైలుశిక్ష విధించబడింది.”

ఆ తరువాత అతన్ని గురించి వివరాలేవీ చేర్చబడలేదు. అంటే జయిలికి వెళ్ళివచ్చిన తరువాత అతని ప్రవర్తనలో మార్పు వచ్చివుండవచ్చు. ఈ ఫోటో దాదాపు 13 ఏళ్ళ క్రితంది. అతని రూపురేఖల్లో అట్టే మార్పులేదు. కాక పోతే కాస్త లావెక్కినట్టు కన్పిస్తూన్నాడు.

అతనికీ మేజర్ మోహనరంగం హత్యకీ సంబంధ మేమిటో అర్థం కాలేదు. ఇన్‌స్పెక్టర్ సత్యం దీర్ఘంగా ఆలోచిస్తూవుండిపోయ్యాడు.

అంతలో టకటకా బూట్లచప్పుడు చేసుకుంటూ సబ్-ఇన్‌స్పెక్టర్ ఆనందరావు అక్కడికి చేరుకున్నాడు.

“ఏమిటి?” అన్నట్టు తలెత్తి చూశాడు ఇన్‌స్పెక్టర్ సత్యం తన అసిస్టెంట్ కేసి.

“బాస్ మీరూహించినట్టు హెడ్‌మిస్ట్రెస్ మేరీవిక్టరే ‘శనివారం రాత్రి అతిథి’” అన్నాడు ఉత్సాహంగా భుజాలెగరేస్తూ.

“ఎలా?” ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

“ఆమె ‘బయోడేటా’ సేకరించాను. ఆమెను గురించి క్షుణ్ణంగా తెలుసుకున్నాను.”

“ఏమిటది?”

“కొత్తగా పరిచయమైన వ్యక్తులందరికీ తన పేరు మేరీవిక్టర్ అనీ, తన భర్త స్టేట్సులో వుంటున్నాడనీ అబద్ధమాడుతుంది. నిజానికీ మేరీ అవివాహిత. స్వేచ్ఛా జీవి. తనకు నచ్చిన మగాడితో యథేచ్ఛగా గడుపు

తుంది. మోజు తీరగానే వాడి చేతుల్లోంచి తప్పుకుంటుంది.

ఆరు మాసాల క్రితం ఓ లిక్కర్ షాపు యజమాని కనకరాజ్ అనే వ్యక్తితో తిరిగేది. బహుశా మేజర్ మోహనరంగం తన కంటపడిం తరువాత, అతనితో తిరగడం మానుకున్నుంటుంది.

మేజర్ మోహనరంగం అందగాడు. ఆరోగ్యవంతుడు. పైగా ఒంటరి వాడు. అందులో ఎదురింటివాడు కూడాను. తన ప్రణయం రహస్యంగా వుంచడానికి అంతకంటే అనువైన చాన్సు దొరకదు."

"అయితే మేజర్ గారితో శనివారం రాత్రిళ్ళు గడిపే వ్యక్తి మేరీయేనంటావా?"

"అవును బాస్, నిస్సందేహంగా! ఆమెకో అలవాటుంది. శనివారం రాత్రిళ్ళు తప్ప ఆమె తన ప్రియుణ్ని కలుసుకోదు. ఆమె కనకరాజ్ ప్రాపకంలో వుండేప్పుడు కూడా అంతే. శనివారం రాత్రిళ్ళు మాత్రమే అతణ్ని కలుసుకునేది. రాత్రికి రాత్రే ఇల్లు చేరుకుని ఆదివారం వుదయం సూర్యోదయానికి పూర్వమే స్నానంచేసి, శుభ్రమైన బట్టలుధరించి, పవిత్రంగా చర్చికి బయలుదేరేది. ఎంత స్వేచ్ఛాజీవి అయినా నలుగురిలో తిరిగే వ్యక్తి. తన ప్రణయజీవితాన్ని రహస్యంగా వుంచాలనే ప్రయత్నించేది."

"అలాగా?" అన్నట్టు తలూపాడు ఇన్స్పెక్టర్ సత్యం.

"అవును బాస్. మేజర్ మోహనరంగంగార్ని శనివారంనాటి రాత్రిళ్ళు కలుసుకునే వ్యక్తి మేరీయేనని

నేననుమానించడానికి మరో కారణం కూడా లేక పోలేదు.

"ఏమిటది?" ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

"మేరీ శారీరకంగా నేగాక, వేష భాషల్లోనూ, ప్రవర్తనలోనూ మగాణ్ణి గెచ్చకొట్టే తత్వంగల మనిషి! బహుశా అది ఆమె సైజం కావచ్చు! కాని ఆమె కళ్ళల్లో 'కామం' కొట్టొచ్చినట్టు కనిపించడం మీరు గమనించి వుండకపోవచ్చు. నేనామెను చూడగానే గమనించాను, శాత్రీ 'వాంటింగ్'లో వుందనీ, అందగాడైని యువకు డెవడైనా సరే, ఏ మాత్రం ప్రయత్నించినా లొంగి పోతుందనీను. మెల్లగా మాటలు కలిపి, రెండు ఫలోకులు విసిరేసరికి కల్లుతాగిన కుక్కపిల్లలా వళ్లో పడిపోయింది. మొన్నటి రాత్రి—అంటే శనివారం రాత్రి నేనామె గదిలో గడపవలసి వచ్చింది."

"వాట్?" ఇన్‌స్పెక్టర్ సత్యం ఆశ్చర్యంగా తలెత్తి తన అసిస్టెంటు ముఖంలోకి చూశాడు.

"క్షమించండి బాస్! ఆమె అంతర్యాన్ని తెలుసుకునేందు నేనాపని చేయక తప్పలేదు" సబ్ ఇన్‌స్పెక్టర్ ఆనందరావు నేరం చేసినవాడిలా మళ్ళీ తల వొంచుకున్నాడు.

ఇన్‌స్పెక్టర్ సత్యం మనసులోనే నవ్వుకున్నాడు.

"దట్సాల్ రైట్!....క్యారీ ఆన్...." అన్నాడు అసలు విషయం చెప్పమన్నట్టు.

"ఆ రాత్రి మేరీ ఓల్డు టావరిన్ విస్కీ బాటిల్ ఓపెన్ చేసింది బాస్. తినడానికి చపాతీలు చేయించింది. వాటికి కర్రీ ఏమిటో తెలుసా? జింజర్ చికెన్, ఆమ్లెట్లు!" అన్నాడు ఆనందరావు.

తక్షణం నాయర్ అన్న మాటలు గుర్తుకొచ్చాయి ఇన్‌స్పెక్టర్ సత్యానికి. అతని ముఖం విప్పారింది.

"వెరీగుడ్! శనివారం రాత్రి అతిథి ఎవరో యిట్టే తేల్చేశావన్న మాట?" అంటూ హుషారుగా కుర్చీలోంచి లేచాడు ఇన్‌స్పెక్టర్ సత్యం.

"అవును బాస్! ఆమెను 'ఇంటరాగేట్' చేస్తే హంతకుడి ఆచూకీ తెలుసుకోవచ్చు!" అన్నాడు ఆనందరావు తేలిగ్గా ఊపిరి పీల్చుకుంటూ.

ఇన్‌స్పెక్టర్ సత్యం అడుగు ముందుకి వేసి "ఇంతకీ పులిగోరు చైను విషయం ఏం చేశావు?" అని ప్రశ్నించాడు.

"నగరంలోని అన్ని నగల షాపులూ గాలించాను బాస్. ఎవరూ దాని స్వంతదారుణ్ణి గుర్తుపట్టలేకపోయారు. అసలా చైను ఈ జంటనగరాల్లో ఎక్కడా తయారైనట్టు కనిపించడంలేదు. ఆ చైను ఏ మారుమూల పల్లెలోనో తయారై వుండొచ్చు. అందుచేత దాని విషయమై కాలాన్ని వృధా చెయ్యడం నా కిష్టమనిపించలేదు" అన్నాడు అసిస్టెంటు ఆనందరావు.

ఇన్‌స్పెక్టర్ సత్యం సాలోచనగా తల పంకించాడు.

"నేనిక్కడికి వచ్చేప్పుడు సుశీలగార్ని పరామర్శిద్దామని లాడ్జివేపు వెళ్ళాను. మేజర్ గారి హత్యని గురించి విన్నప్పటి నుండి ఆమె తిండీ తిప్పలు లేకుండా కన్నీరు మున్నీరుగా ఏడుస్తూ గదిలోంచి బైటికిగూడా రాలేదట. మేనేజర్ చెప్పాడు.

ఆమెను ఓదార్చి ఆమెచేత యిన్ని కాఫీనీళ్ళు తాగించే సరికి తాతలు దిగివచ్చారు. బొంబేనుండి ఆమెగారి భర్త యిక్కడికి వచ్చేదాకా మనమే ఆమె బాగోగులు విచారించవలసి వుంటుంది. మీరుకూడా ఓ సారి అటు వెళ్ళి

రావడం మంచిది. వీలయితే మేజర్ గారిని గురించి విచారించి, మనకుపయోగించే విషయాలేదయినా వుంటే సేకరించవచ్చు!"

"అలాగే" ఇన్‌స్పెక్టర్ సత్యం తల పంకించాడు.

# 5

"సుశీలాదేవిగారూ! పోయినవారి కోసం దుఃఖించి ప్రయోజనం లేదు. ఆరోగ్యం పాడుచేసుకోవడమేగాని పోయినవారిని బ్రతికించలేముగా?" అన్నాడు ఇన్‌స్పెక్టర్ సత్యం ఆమెను ఓదార్చుతూ.

సుశీల మంచంమీంచి లేచికూర్చుని పమిటచెంగుతో ముఖం తుడుచుకుంది.

"మీవారి నుండి వుత్తరం వచ్చిందా?"

వచ్చిందన్నట్టు తలూపింది సుశీల. "రేపు వుదయం రైల్లో దిగవచ్చు! ఎవరు వచ్చిమాత్రం ఏం చెయ్యగలరు?" నిరాశగా నిట్టూర్చింది.

"నిజమే! పోయినవారిని ఎవరూ బ్రతికించలేరు. కాని హంతకుడి ఆచూకీ తెలుసుకుని వాడ్ని ఉరికంబమెక్కించడం మన కర్తవ్యం! అప్పటికిగాని చనిపోయినవారి ఆత్మ శాంతించదు. హంతకుడి ఆచూకీ తెలుసుకునేందుకు మేము మా శాయశక్తులా ప్రయత్నిస్తున్నాము. మీరు కూడా మాతో సహకరిస్తే మా ప్రయత్నం మరింత తేలికవుతుంది" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"చెప్పండి, నేనేం చెయ్యగలను?"

"నేనడిగే ప్రశ్నలికి జవాబులివ్వండి చాలు!"

"అడగండి!" అన్నట్టు చూచింది సుశీల.

"మీ అన్నయ్యకి శత్రువులెవరైనా వున్నారా?"

"ఎలా చెప్పను? అన్నయ్య వుద్యోగ విరమణ చేసి రెండేళ్ళవుతోంది. మొదటి సంవత్సరమంతా దేశాటన లోనే గడిపేశారు. ఎక్కడా నిలకడగా ఓ నెలరోజులు కూడా గడపలేదు. సంవత్సరం క్రితం హైదరాబాదులో స్థిరపడిపోతున్నానని అన్నయ్య దగ్గర నుండి వుత్తరం వచ్చింది. అన్నయ్యకి పెళ్ళికాలేదు. నేను తప్ప నా అన్న వాళ్ళెవరూ లేరు. అన్నయ్యకి ఇక్కడ స్థిరపడ్డ తరువాత స్థానికంగా ఎవరితో ఎలాంటి శత్రుత్వం ఏర్పడిందో ఎలా చెప్పను? స్వతహాగా అన్నయ్య మితభాషి. ఎవరి జోలీ అట్టే పట్టించుకునేవారు కారు. అలాంటి వారికి శత్రువులుంటారని ఎలా అనుకోను?"

"ఆత్మీయులైన మీరు బొంబాయిలో వుండగా మీ అన్నయ్యగారు యిక్కడ స్థిరపడడానికి కారణమేమిటో బోధపడడంలేదు" అన్నాడు ఇన్‌స్పెక్టర్ సత్యం.

సుశీల చెప్పడానికి తటపటాయించింది.

"చెప్పండి సుశీలగారూ! సందేహించకండి! మీరు చెప్పే ప్రతి చిన్న విషయం మాకు వుపకరిస్తుందన్న విషయం మరిచిపోకండి!"

"అన్నయ్య యిష్టానికి వ్యతిరేకంగా నా పెళ్ళి జరిగింది. మాది 'ఇంటర్‌కాస్టు మేరేజి'. మావారు క్రిష్టియన్. మేము హిందువులం. అన్నయ్య ఆధునికంగా కనిపించినా సనాతనత్వం ఆయనలో పేరుకొని పోయింది.

మా పెళ్ళి విషయం తెలియపరచగానే అన్నయ్య మండిపడ్డారు. ఆ తరువాత ఆరుమాసాలపాటు వుత్తరాలు కూడా రాసేవారు కాదు. ఉద్యోగ విరమణ చేసేముందు వుత్తరం వ్రాశారు. నేను యెక్కడ స్థిరపడాలో ఆలో

చించుకోలేదనీ, కొంతకాలంపాటు దేశాలు తిరిగిన తరువాత ఎక్కడో ఒకచోట స్థిరపడిపోతాననీ అప్పుడు వుత్తరం వ్రాస్తాననీ.

ఆ తరువాత సంవత్సరం క్రితం హైదరాబాద్ లో స్థిరపడిపోతున్నాననీ అప్పుడప్పుడూ వుత్తరాలు రాస్తూ వుండవలసిందని రాశారు. కాని నన్ను రమ్మని కూడా రాయలేదు. మాకు పెళ్లయి నాలుగేళ్ళు దాటుతోంది. మావారు యెలా వుంటారో కూడా అన్నయ్యకి తెలీదు. మమ్మల్ని కలుసుకోవడానికి కూడా ఆయన ప్రయత్నించలేదు. ఒక్కగానొక్క చెల్లెల్ని నన్నెంత ఆప్యాయంగా చూసుకునేవారో చెప్పలేను. అలాంటివారు నా పెళ్లితో ఆయన మనసు మార్చుకున్నారు" సుశీల కళ్లలోంచి నీళ్ళు చిమ్మాయి.

"అయితే మీరిప్పుడు ఆయన ఆహ్వానం లేకుండా నే స్వయంగా బయలుదేరానన్నమాట?"

"కాదు. ఆయన ఆహ్వానంమీద నే బయలుదేరాను. ఈ మధ్య ఆయన మనస్తత్వం మారుతున్నట్టు ఆయన రాసే వుత్తరాలద్వారా గ్రహించాను. నేనిక్కడికి బయలుదేరే ముందు వారంరోజుల క్రితం అన్నయ్య నాకో వుత్తరం వ్రాశారు." సుశీల మంచంమీంచి లేచి, టేబుల్ మీదనున్న వానిటీబాగులోంచి ఓ వుత్తరం తీసి, ఇన్‌స్పెక్టర్ కి అందించింది.

ఇన్‌స్పెక్టర్ సత్యం ఆ వుత్తరాన్ని అందుకుని విప్పి చదివాడు.

"మైడియర్ సుశీ,—నువ్వు నాకంటే వయసులో చిన్నదానివయినా, అనుభవంలో, ప్రపంచాన్ని అర్థం

చేసుకోవడంలో నాకంటే చాలా పెద్దదానివమ్మా! నువ్వు నీ పెళ్లి విషయంలో చూపిన చొరవా, ధైర్యం సాహసాలూ నిజంగా హర్షించదగ్గవి. మీపట్ల నేను యింత మూర్ఖంగా ప్రవర్తించానో తలుచుకుంటే ఇప్పుడు సిగ్గేస్తోంది. నన్ను క్షమిస్తావు కదూ!—

నిజానికి, యీ కులమతాలూ అన్నీ మనం కల్పించుకున్నవే. మనస్ఫూర్తిగా ప్రేమించి పెళ్లి చేసుకున్న వ్యక్తులు తమ జీవితాల్లో సుఖాలు పండించుకోవచ్చని నీ వుత్తరాల ద్వారా అర్థం చేసుకున్నాను. మిమ్మల్ని నా మనసారా దీవిస్తున్నాను!

ఇప్పుడు మిమ్మల్ని చూడాలని యెంతగానో ఆశపడుతున్నాను. నా మూర్ఖత్వానికి బావ నన్ను క్షమించకపోవచ్చు. కాని నువ్వు నన్ను తప్పకుండా క్షమిస్తావు! ఒక్కసారి యీ అన్నయ్యను చూడ్డానికి రాకూడదూ? మిమ్మల్ని చూడ్డానికి నేనే బయలుదేరుదామనుకున్నాను. కాని ముఖం చెల్లలేదు.

అంతేకాదు. నేను నీతో ఓ ముఖ్యమయిన విషయం మాట్లాడాలి! సాధ్యమయినంత త్వరలో వస్తావు కదూ! వచ్చేముందు టెలిగ్రాం యిస్తే యీ అన్నయ్య నిన్ను స్టేషన్లోనే కలుసుకుంటాడు. మరిచిపోకు. వెంటనే జవాబు వ్రాయి!— మీ

అన్నయ్య."

ఇన్‌స్పెక్టర్ వుత్తరాన్ని మడిచి సుశీల కందిస్తూ "వారు మీతో మాట్లాడదలచుకున్న ముఖ్యమయిన విషయం యేమిటో?" అని ప్రశ్నించాడు.

"ఏమో! నేనా విషయమై అట్టే ఆలోచించలేదు,

అన్నయ్యా నన్ను చూడాలన్న వుబలాటంకొద్దీ అలా రాసి వుండొచ్చు! నాకూ అన్నయ్యను చూడాలనే వుంది. అందుచేత మావారిని వొప్పించి, టెలిగ్రాం యిప్పించి, వెంటనే బయలుదేరాను" అంది సుశీల.

ఇన్‌స్పెక్టర్ ఆలోచనల్లో పడ్డాడు.

# 6

ఇన్‌స్పెక్టర్ సత్యం బులెట్‌ని మేరీ ఇంటి ముందు ఆపి, గేటు తెరుచుకొని, కాంపౌండ్‌లోకి చేరు కొన్నాడు. గుమ్మం ముందు నిల్చుని డోర్ బెల్లు మోగిం చాడు.

రెండు నిమిషాల తరువాత తలుపు రెక్క తెరుచు కుంది. గుమ్మంలో ప్రత్యక్షమయిన మేరీ ఇన్‌స్పెక్టర్‌ని చూడగానే, "హల్లో ఇన్‌స్పెక్టర్‌జీ! ఏమిటిలా దయ చేశారు? రండి లోపలికి!" అంటూ ఆహ్వానించింది చిరు నవ్వుతో. కమ్మని కనేగా సెంటు ముక్కుపుటాల్ని సోకింది.

ఇన్‌స్పెక్టర్ లోపలికి అడుగేశాడు.

"కూచోండి!" సోఫాకేసి చూపింది. అతడు-కూచో గానే "కాఫీయా? కూల్ డ్రింకా? ఏది పుచ్చుకుంటారు?" ఆప్యాయంగా ప్రశ్నించింది.

"ఏదయినా ఫరవాలేదు! ఏది రెడీగా వుంటే అదే!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ సత్యం.

"ఫ్లాస్క్‌లో కాఫీ — ఫ్రిజ్‌లో కూల్ డ్రింకూ రెండూ రెడీయే! విచ్ డు యు ప్రిఫర్?"

"ఐ ప్రిఫర్ కూల్ డ్రింక్" అన్నాడు సత్యం.

"ఎస్, ఐ టూ ప్రిఫర్ కూల్ డ్రింక్। ఈ వేసవిలో

కూల్ డ్రింక్ ప్రాణానికి హాయిగా వుంటుంది" చిన్నగా నవ్వి "జస్టు ఎ మినిట్!" అంటూ అక్కడ్నించి కదిలి రాయంచలా పక్కనున్న గదికేసి నడిచింది.

'మేరీ చెప్పుకోదగ్గ అందగత్తె కాకపోయినా, మగవాడి దృష్టిని ఆకట్టుకోగల అన్ని హంగులూ వున్నయ్ ఆమెలో'——అనుకున్నాడు సత్యం.

రెండు నిమిషాల్లో తిరిగివచ్చింది మేరీ. ఆమె చేతిలో ట్రే. ట్రేలో రెండు కూల్ డ్రింక్స్ గ్లాసులూ వున్నయ్. ట్రేని ఇన్ స్పెక్టర్ కెదురుగా టీపాయ్‌మీద పెట్టి "తీసుకోండి!" అంది.

"మీరు కూడా తీసుకోండి!" అంటూ ఇన్ స్పెక్టర్ ఓ గ్లాసు నందుకున్నాడు.

మేరీ యెదురుగా వున్న మరో సోఫాలో కూచుని కూల్ డ్రింకుగ్లాసు నందుకుని, సిప్ చేసి ట్రేలో పెడుతూ "ఇంతకీ మీరొచ్చిన పనేమిటో చెప్పారు కారు?" అంది వాళ్లంట చూస్తూ.

"మేజర్ మోహన్ రంగంగారి హత్యకేసు విషయమై మీ సహాయం కావాలి" అన్నాడు ఇన్ స్పెక్టర్.

"నా సహాయమా? మీరు తమాషాగా మాట్లాడతారు" మేరీ చిన్నగా నవ్వింది.

"తమాషా కాదు. నిజమే! మీ కీ కేసు విషయంలో మీకు తెలిసిందంతా చెప్పి మాతో సహకరించాలి! మీరు తప్పకుండా సహకరిస్తారన్న ధీమాతోనే నేనిక్కడికి వచ్చాను" అన్నాడు ఇన్ స్పెక్టర్.

"ఏం చెప్పాలి? అడగండి!" తల ఏటవాలుగా తిప్పి వయ్యారం వొలకబోసింది.

"ఈ మధ్య మేజర్ మోహన్ రంగంగారింటికి, శని

వారం రాత్రిళ్ళు ఓ. అతిథి వస్తున్నాడు. హత్య జరిగిన నాటి రాత్రి కూడా ఆ అతిథి మోహన్‌రంగం గారింటి ఆతిథ్యం పుచ్చుకున్నాడు. పుచ్చుకున్నాడు అనడం కంటే పుచ్చుకున్నది—అనడం సబబుగా ఉంటుందేమో! మా వుద్దేశ్యంలో ఆ అతిథి మగ కాదు, ఆడ!—మీది ఎదురిల్లే గనక ఆ అతిథి యెవరో మీరు కనిపెట్టి వుండొచ్చు! ఆవిడ ఆచూకీ తెలిపితే మా పరిశోధనకి చాలా సహాయం చేసినట్టు వుంటుంది!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"క్షమించండి! నేనెప్పుడూ ఆ అతిథిని చూళ్ళేదు. అసలు నేను ఎనిమిదింటికల్లా బెడ్‌రూములోకి వెళతాను. నేను బెడ్‌రూము చేరుకుంటే మళ్ళీ తెల్లవారిం తరువాతే బెడ్‌రూములోంచి బైట పడడం. అందుచేత యెదురింట్లో యేం జరుగుతుందో తెలుసుకునే అవకాశం లేదు. పైగా యితరుల రహస్యాలు తెలుసుకోవాలన్న నైజం నాకు లేదు."

"అంతే నంటారా?"

"అవును."

"పోనీ మరో ప్రశ్నకి జవాబు చెప్పండి! మేజర్ మోహన్‌రంగంతో మీకు పరిచయం లేదా?"

"నే నా ప్రశ్నకి యింతక్రితమే జవాబు చెప్పాను. మోహన్‌రంగంగారు చాలా 'రిజర్వ్‌డ్ టైప్' అనీ, యిరుగు పొరుగు వాళ్ళెవరితోనూ ఆయనకి పరిచయం లేదనీ."

"మోహన్‌రంగంగారు యింట్లో లేనప్పుడు యెప్పుడైనా ఆ యింటికి మీరు వెళ్ళేవారా?" అని ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

"ఎందుకు? ఆ యింటితో నాకేం పని?" మేరీ ప్రశ్నార్థకంగా ఇన్‌స్పెక్టర్ కేసి చూసింది.

ఇన్‌స్పెక్టర్ సత్యం చిన్నగా నవ్వాడు. "మేరీ గారూ! ఇది హత్యకేసు. ఈ కేసు విషయంలో యేమాత్రం అబద్ధమాడినా అనవసరంగా కేసులో యిరుక్కోవలసి వస్తుంది. అందుచేత దయచేసి నిజాన్ని దాచడానికి ప్రయత్నించకండి!" అన్నాడు.

"ఏమిటి మీ వుద్దేశ్యం? నాకీ కేసుతో యేదో ప్రమేయం వుందనేగా?"

"కాదు. మేజర్ గారితో మీకు పరిచయమే లేదన్నది మాత్రం అబద్ధం!"

మేరీ ముఖంలో కోపం చిందులుతొక్కింది "మీరా మాట యే ఆధారంతో అంటున్నారు....?" అని ప్రశ్నించింది.

"చెబుతా వినండి! మేజర్ గారి కుక్క టైగర్ పరిచయం లేనివారినెవర్నీ తమ కాంపౌండులోకి కూడా రానీయదు. ఆ విషయం మీకు బాగా తెలుసు. నేను దాన్ని మచ్చిక చేసుకోవడానికి ఎన్ని తంటాలు పడ్డానో కూడా మీకు తెలుసు.

మొన్నటిరోజున నేను టైగర్‌కి బిస్కట్లు తినిపిస్తుండగా, మీరు నాతో మాట్లాడుతూ, నిర్భయంగా దగ్గరకొచ్చి టైగర్ పక్కనే నిల్చున్నారు. టైగర్ కూడా మిమ్మల్ని చూచి మొరగలేదు. బాగా పరిచయమున్న వ్యక్తిలా మీ దగ్గరగా వచ్చి, తలెత్తి తోకాడించింది. అంటే అర్థం ఏమిటి?—

మీకు మేజర్ మోహన్‌రంగంగారితో పరిచయం

లేదు. వారు యింట్లో లేని సమయాల్లో సైతం మీ రా యింటి పరిసరాలకే వెళ్ళరు. అయితే మైగర్ మిమ్మల్ని పరాయివాళ్ళుగా కాకుండా, పరిచయస్తులుగానే యెలా పరిగణించింది? జంతువుల్ని సైతం వశ్యం చేసుకునే 'వశీకరణ' మంత్రం వుందా మీ దగ్గర?" తమాషాగా నవ్వాడు.

ఇన్‌స్పెక్టర్ వేసిన ప్రశ్నకి, ఏం జవాబు చెప్పాలో తోచక బిక్క మొహం వేసింది మేరీ.

"అంతేకాదు—శనివారంరాత్రి అతిథి, హత్య జరిగిన రాత్రి మేజర్‌గారితో గడిపిన వ్యక్తీ మీరే నని మాకు తెలుసు! హత్య జరిగిననాటి రాత్రి విందు కుపయోగింపబడిన గాజుగ్లాసులూ, ప్లేట్లూ మా కస్టడీలోనే వున్నయ్. వాటి వేలిముద్రలు సైతం రికార్డు చెయ్యబడ్డవి!" అంటూ మేరీ త్రాగి టీపాయ్‌మీద పెట్టిన కూల్ డ్రింకు గ్లాసుని చేతిలో తీసుకున్నాడు. "ఈ గ్లాసుమీద నున్న మీ వేలిముద్రల సాయంతో హత్య జరిగిననాటి రాత్రి హతుడితో గడిపిన వ్యక్తి మీరేనని రుజువు చెయ్యడం మాకు కష్టమైన పనేమీ కాదు."

మేరీ మౌనంగా తల క్రిందికి వొంచేసింది.

"మిమ్మల్ని భయపెట్టి మీనుండి నిజాన్ని కక్కించడం మా వుద్దేశ్యం కాదు. మీరు నిర్దోషులే అయితే నిర్భయంగా నిజాన్ని వొప్పుకోవచ్చు. నిజాన్ని దాచడం మూలాన కష్టాలని కొనితెచ్చుకోవడమేగాక, అపోహలకి దారి తీస్తుంది కూడా" అన్నాడు ఇన్‌స్పెక్టర్ సత్యం.

"నిజమే ఇన్‌స్పెక్టర్ గారూ! మేజర్‌గారితో నాకు ఆరుమాసాల క్రితమే పరిచయమైంది. ప్రతి శనివారం రాత్రీ నేనతనితో గడిపేదాన్ని. మేజర్‌గారు చాలా

మంచివారు. మేజర్ గారితో పరిచయం కాక మునుపు జీవితమంటే కేవలం సంతోషంగా గడపడానికేననీ, నీతి నియమాలన్న కట్టుబాట్లకు లొంగిపోయి జీవితాన్ని నరక ప్రాయంగా తయారు చేసుకోవడం కంటే, స్వేచ్ఛగా అందినంత ఆనందాన్ని దోచుకొని జీవితాంతం హాయిగా గడపడానికేననీ అనుకునేదాన్ని. మేజర్ గారితో పరిచయమైన తరువాత నా జీవిత ధ్యేయమే మారి పోయింది.

"నిజానికి నాకు పెళ్ళికాలేదు. ఎవడ్నో ఒకడ్ని పెళ్ళి చేసుకుని జీవితాంతం వాడికి బానిసగా వుండడంకంటే, అవివాహితగా వుండిపోవడంలోనే యెంతో స్వేచ్ఛ వుందని అనుకొనేదాన్ని. కాని పెళ్ళికాని స్త్రీ అంటే యీ సంఘంలో లోకువగా చూస్తారు. అందుచేత నాకు పెళ్ళయిందనీ, మావారు స్టేట్సులో వుంటున్నారనీ అందరితోనూ అబద్ధమాడేదాన్ని.

"మేజర్ గారితో పరిచయమేర్పడిం తరువాత నేను నా జీవితంలో చేసిన పొరబాటేదో అర్ధమైంది. గుట్టుగా పెళ్ళి చేసుకుని జీవితాంతం ఆయన సాహచర్యంలో ప్రశాంతంగా గడిపేయాలన్న నిర్ణయానికి వచ్చేశాను. ఆ విషయమే మేజర్ గారితో కూడా చెప్పాను. మేజర్ గారుకూడా సమ్మతించారు. బొంబాయిలో తనకో చెల్లెలుందనీ, ఆమె త్వరలోనే యిక్కడికి వస్తోందనీ, ఆమె అభిప్రాయాన్ని కూడా తెలుసుకుని పెళ్ళి ఏర్పాట్లు చేస్తాననీ, హత్య జరిగిననాటి రాత్రి కూడా అన్నారు. కాని నాకా యోగం లేదు! ఇంతలో ఈ అఘాయిత్యం జరుగుతుందని నే నూహించలేదు...."

ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. మేరీ పక్కకి తిరిగి

పమిట చెంగుతో కళ్ళు తుడుచుకుని, "మేజర్ గారు నా కళ్ళెదుటే హత్య చెయ్యబడ్డారు! కాని నాకీ హత్యతో యెలాంటి సంబంధమూ లేదు. మీరు నమ్మినా నమ్మక పోయినా ఇప్పుడు నేను చెప్పిందంతా యదార్థం!" అన్నది మేరీ.

ఇన్‌స్పెక్టర్ సత్యం చిన్నగా నవ్వాడు.

"మీకీ హత్యతో సంబంధముందని కానీ, మీరీ కేసులో ముద్దాయిలని కానీ నే ననడంలేదు. మాకు నిజం కావాలి! హంతకుడి ఆచూకీ తెలియపరిచి మాతో సహకరిస్తారని మాత్రమే మేమాశిస్తున్నాము. ఈ హత్య మీ కళ్ళెదుటే జరిగిందని మీ రొప్పుకుంటున్నారు గనక, హంతకుడెవరో మీకు తెలుసు. అతని ఆచూకీ తెలియపరిస్తే చాలు!" అన్నాడు.

"తెలీదు. అసలు హత్య యెలా జరిగిందో చెబుతా వినండి! ఆరోజు మేము కబుర్లు చెప్పుకుంటూ పార్టీ ముగించేసరికి పన్నెండు దాటింది. మేజరుగారికో చెడ్డ అలవాటుంది. మందు పుచ్చుకున్న తరువాత నాలుగు గోడలమధ్య కూచోలేరు. అలా ఆరుబయట కొంత సేపు తిరిగిరావాలి. పైగా ఆరోజు నిండు పౌర్ణమి. పిండార బోసినట్టు విరగకాస్తోంది వెన్నెల! వెన్నెలన్నా, తెల్లని బట్టలన్నా, మల్లెపువ్వులన్నా మేజర్ గారికి మక్కువ యెక్కువ!

అందుచేత అలా యిద్దరం షికారు వెళ్ళడానికి బయలు దేరాము. టైగర్ ఓ మూల ముడుచుకుని పడుకుని వుంది. దాన్ని నిద్ర లేపడం ఇష్టంలేక మేమిద్దరమే బయలుదేరి, వీధి తలుపుకి తాళంపెట్టి ముందుకి నడిచాము. ఈస్టు

మారేడుపల్లి దాటుకొని, అడ్డగుట్ట మీదికి చేరుకుని, ఎదురుబొదురుగా చెరో బండమీద కూచున్నాము.

మేమక్కడ కూలబడి ఐదునిముషాలయిందో లేదో, యెక్కడనుండో వూడిపడ్డారు ముగ్గురు ముసుగుమనుషులు. ముగ్గురూ ఒక్కుమ్మడిగా మేజర్ గారిమీద విరుచుకు పడ్డారు. మేజర్ గారు యీ హఠాత్సంఘటనకు విస్తుపోయి, సంబాళించుకునేలోగా ఆ ముగ్గురిలో వొకడు మొల్లోంచి బాకు తీశాడు. కనురెప్పపాటులో బాకుని మేజర్ గారి గుండెల్లోకి దించేశాడు.

గుండెల్లోంచి చిక్కటి రక్తం పిచికారీతో చిమ్మినట్టు పైకి చిమ్మడంతో నాకు భయమేసింది. వాళ్ళు మేజర్ గారికి విడిచిపెట్టి, నా మీదికి ఎగబడేలోగా తప్పించుకు పారిపోవాలన్న ఆశకొద్దీ వొకటే పరుగు లంకించుకున్నాను. నేను ఇల్లు చేరుకుని, నా గదిలోకి వెళ్ళి, తలుపులు మూసుకొనే దాకా హంతకులు నన్నెక్కడ వెంబడిస్తున్నారోనన్న ధ్యాసే కాని, మేజర్ గారు ఏమైపొయ్యారోనన్న ఆలోచనే లేకపోయింది.

“దుండగులు ముగ్గురూ ముసుగుల్లో వున్నారు. మేజర్ గారిమీదికి విరుచుకుపడడం, హత్య చెయ్యడం, అంతా కనురెప్పపాటులో జరిగిపోయింది. అలాంటి పరిస్థితిలో ఆగంతకుల్ని నేనెలా గుర్తుపట్టగలనో ఆలోచించండి” అంది మేరీ.

ఇన్స్పెక్టర్ సత్యం ఒక్కక్షణం ఆలోచించాడు. జేబులోంచి పులిగోరు చైను బైటికితీసి ఆమెకి అందిస్తూ “ఈ చైనుని మీరు గుర్తుపట్టగలరేమో చూడండి!” అన్నాడు ఆమె ముఖంకేసి చూస్తూ.

మేరీ ఆ చైను నందుకుని, పరిశీలించి "ఇది కట్టెలడితీ కామరాజుది! దీన్ని నేనతని మెడలో చూశాను...." అంది.

"కట్టెలడితీ కామరాజా? ఎవరతను?" అతడాశించిన జవాబు అదికాదు. అందుచేత ఆశ్చర్యపడకుండా వుండ లేకపోయాడు.

"ఈ వీధి చివర ఓ కట్టెలడితీ వుంది. దాని ప్రొప్రైటర్ కామరాజనే ఓ కోమటిశెట్టి!"

"అతనితో మీకు బాగా పరిచయముందా?"

"అవును" అన్నట్టు తలూపింది మేరీ. "కామరాజు అందంగా వుండడు. కాని అమ్మాయిల మోజెక్కువ. నేను స్కూలునుండి యింటికి వచ్చేప్పుడు ఆ దారంటే రావాలి. నేను కనిపించినప్పుడల్లా పళ్ళికిలించేవాడు. నాతో మాట్లాడాలని ప్రయత్నించేవాడు. ధైర్యంచాలక మానుకునేవాడు.

అతని వాలకం కనిపెట్టి నేనే ఓ రోజు అతన్ని పలకరించాను. దాంతో ఎగిరి గంతేశాడు. నన్ను తన అడితీలోకి ఆహ్వానించి కాఫీ గ్లాసూ తెప్పించాడు. అప్పటి నుండీ నాకతనితో పరిచయమేర్పడింది. పాపం. మానవుడు వొట్టి అల్పసంతోషి. కాస్త నవ్వుతూ హుషారుగా మాట్లాడితేచాలు ఉబ్బి తబ్బిబ్బైపొయ్యేవాడు. కాని ఒట్టి పిరికిగొడ్డు! మనసులోని కోరికను బైటికి వెల్లడించే గుండె ధైర్యం లేదతనికి" మిస్ మేరీ పమిట సరుకుని "ఇంతకీ యీ చైను మీ చేతికెలా వచ్చింది?" అని ప్రశ్నించింది.

"ఇది హంతుడి గుప్పిట్లో దొరికింది! హత్యా సమయంలో హంతుడు హంతకుడితో ఘర్షణపడి అతని మెడలోని చైనుని

గుప్పిట్లోకి తీసుకుని వుండొచ్చు. ఎలాగయితేనేం మేజర్ చాలా తెలివైనవాడు. తన మరణసమయంలో హంతకుడి తాలూకు చైనుని తన గుప్పిట్లో దాచి అతని ఆచూకీ తెలుసుకునేందుకు మాకు సాయపడ్డాడు.

"ఏమిటి? మేజర్ గారిని హత్య చేసింది కట్టెలడితీ కామురాజా?" మిస్ మేరీ ఆశ్చర్యాన్ని ప్రకటించింది.

"ఏమో చెప్పలేను. మేమీ కేసులో మరింత ముందుకి వెళ్ళందే ఏ విషయమూ తేలదు" అంటూ ఇన్స్పెక్టర్ సత్యం సోఫాలోంచి లేచాడు. "నేనిక సెలవు తీసుకుంటాను. అవసరమైతే మళ్ళీ కలుసుకుంటాను" అంటూ అక్కడ్నించి బైటికి నడిచాడు.

వీధిలో ఆపివున్న బులెట్ స్టార్ట్ చేసి, తిన్నగా వెళ్ళి కట్టెలడితీ ముందు ఆపాడు. ఇన్స్పెక్టర్ సత్యం కంట బడగానే కట్టెలడితీ ప్రొప్రైటర్ తన స్థూలకాయాన్ని మోసుకుంటూ ఎదురొచ్చి "ఎవరికోసం సార్?" అని ప్రశ్నించాడు.

"అడితీ ప్రొప్రైటర్ కామరాజెవరు?"

"నేనే సార్, నేనే! లోపలికి రండి సార్" అంటూ ఆహ్వానించాడు కామరాజు.

ఇన్స్పెక్టర్‌కి కుర్చీ చూపుతూ "కూచోండి సార్! కూచోండి!" అన్నాడు.

ఇన్స్పెక్టర్ తలెత్తి అతనికేసి పరీక్షగా చూశాడు. నల్లగా చింత మొద్దులా వున్నాడు కామరాజు. పెద్ద బొజ్జ! స్థూలకాయం! చిన్నతల! చెమటతో కలిసిన సెంటు వాసన!

"మా చైను దొరికిందా సార్?" ఆశగా ప్రశ్నించాడు.

"చైనా? ఏం చైను?" ఇన్‌స్పెక్టర్ యెదురు ప్రశ్న వేశాడు.

"పులిగోరు చైను సార్. దాని వెనుక నా ఇనిషియల్ 'క.క' అన్న అక్షరాలు కూడా 'ఎన్‌గ్రేవ్' చెయ్యబడి వుంటుంది సార్. రెండు నెల్లయింది పోలీసు రిపోర్టిచ్చి. మహంకాళి జాతరప్పుడు వేడుక చూడ్డానికని వెళితే, జనంలో ఎవడో నా మెళ్ళోంచి లాగేశాడు సార్. రెండు తులాల బంగారం సార్! రెండు తులాలు!"

"ఎవరికిచ్చావు పోలీసు రిపోర్టు?"

"మహంకాళి గుడివీధిలో వున్న పోలీస్టేషన్‌లోనూ, మరో కాపీ గోపాలపురం పోలీస్ స్టేషన్‌లోనూ ఇచ్చాను సార్. ఎప్పుడెళ్ళినా 'దర్యాప్తు చేస్తున్నాం, మళ్ళీ రా' అంటున్నారే గాని సరిగ్గా జవాబు చెప్పడంలేదు సార్" అంటూ పక్కకి తిరిగి. "ఒరేయ్ చిన్నోడా!" అని గట్టిగా కేకేశాడు.

లోపలి గదిలోంచి గున్నేనుగులాంటి ఓ ఆకారం బైటికి రాగానే, "మనం పోలీసులకి రిపోర్టిచ్చామే, దాని కాపీ నా హోండుబాగులో వుంది పట్టుకురా!" అన్నాడు.

ఆకారం గదిలోకి వెళ్ళి మూడు నిమిషాల్లో బైటికి వచ్చింది, చేతిలో ఓ తెల్లపు రిపోర్టుతో.

రామరాజు రిపోర్టుని అందుకుని ఇన్‌స్పెక్టర్ ముందు పెడుతూ, "రిపోర్టు అందినట్టు గోపాలపురం పోలీ స్టేషన్‌లో రైటర్ సంతకం కూడా తీసుకున్నాం సార్" అంటూ ఆ సంతకాన్ని చూపెట్టాడు.

ఇన్‌స్పెక్టర్ సత్యం ఆ సంతకాన్ని చూసి, నిస్పృహగా నిట్టూర్చాడు.

ఇన్‌స్పెక్టర్ సత్యం కుర్చీకి జారగిలబడి, నడికప్పు కేసి చూస్తూ దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు.

"ఈ దెబ్బతో హంతకుని అంతు తేలిపోవాలి!" అంటూ సబ్ ఇన్‌స్పెక్టర్ ఆనందరావు లోపలికి ప్రవేశించాడు.

ఇన్‌స్పెక్టర్ సత్యం తలెత్తి ఆనందరావు కేసి చూశాడు. మనిషి హుషారుగా కనిపిస్తున్నాడు. అతని చేతిలో ఏదో పొట్లం వుంది.

ఆనందరావు తిన్నగా వచ్చి ఇన్‌స్పెక్టర్ ఎదురుగా వున్న టేబుల్ మీద పొట్లాన్ని పెట్టి "హతుడి గుప్పట్లో పులిగోరు చైను దొరికేసరికి హంతకుడి ఆచూకీ తెలిపేందుకు అది సాయపడుతుందని ఆశపడ్డాం. అందుచేత హత్యా ప్రదేశాన్ని అట్టే పరిశీలించలేదు. అప్పుడే ఆ పరిసరాలను పరిశీలించివుంటే హంతకుడి తాలూకు వస్తువులేవయినా దొరికివుండేవి. మన పరిశోధనకి సాయపడ్డివుండేవి" అన్నాడు.

ఇన్‌స్పెక్టర్ సత్యం నిజమేనన్నట్టు తలూపి, "ఇంతకీ ఈ పొట్లం ఏమిటి?" అని ప్రశ్నించాడు.

"ప్రొద్దున నలుగురు పోలీసుల్ని వెంటబెట్టుకుని హత్యాప్రదేశం చేరుకున్నాను. ఆ ప్రదేశమంతా గాలించేశాను. హంతకుడు హత్యాసమయంలో తొడుక్కున్న చొక్కా ఓ ముళ్ళపొదలో దొరికింది" అన్నాడు ఆనందరావు.

పొట్లం విప్పి [illegible] కసి క్తమైన గ్లాస్కో జుబ్బా ఒకటి బైటికి తీశాడు.

"జుబ్బా మెడమీద టైలర్ లేబిలూ, చాకలి గుర్తులూ వున్నయ్. వీటిసాయంతో హంతకుడి ఆచూకీ లాగడం ఏమంత కష్టంకాదు."

"వెల్ డన్ మిస్టర్ ఆనందరావ్! యూ హేవ్ డన్ ఎ గుడ్ థింగ్!" అంటూ హుషారుగా కుర్చీలోంచి లేచాడు ఇన్‌స్పెక్టర్ సత్యం.

"మరో ముఖ్యమైన విషయం బాస్" అన్నాడు ఆనందరావు.

"ఏమిటది?"

"మరేంలేదు బాస్! ఉదయం నేను హత్యాప్రదేశానికి బయలుదేరేముందు పంతులమ్మ మేకి ఫోన్ చేసింది. "మీతో ఓ ముఖ్యవిషయం మాట్లాడాలి. చాలా అర్జంటు, వెంటనే బయలుదేరి నన్ను స్కూల్లో కలుసుకోవాలి! ప్లీజ్!" అంటూ. నేను హత్యాప్రదేశానికి వెళుతూ వెళుతూ విషయమేమిటో తెలుసుకుందామని స్కూలుకి వెళ్ళి ఆమెను కలుసుకున్నాను.

"రెండు మూడు రోజులుగా ఆమెను ఎవరో వెంటాడుతున్నారట. రాత్రిళ్ళు కాంపౌండులో ఎవరో తచ్చాడుతున్నారట. అర్థరాత్రి పన్నెండు దాటిన తర్వాత తలుపు తెరవమన్నట్టు డోరుబెల్లు మోగిస్తున్నారట.

"తనకి భయంగా వుందనీ, పోలీసు రక్షణ కావాలనీ అంటోంది. మనిషి బాగా భయపడిపోయినట్టు కనిపిస్తోంది" అన్నాడు ఆనందరావు.

ఇన్‌స్పెక్టర్ సత్యం తలెత్తి అతని కళ్ళల్లోకి చూచి, తమాషాగా నవ్వుతూ, "అయితే ఏమంటావ్?-రాత్రిళ్ళు ఆమెకు కాపలా పడుకుంటానంటావ్? అంతేగా?" అన్నాడు.

"అది కాదు బాస్! హంతకుడు ఆమెను కూడా హత్య చెయ్యడానికి ప్రయత్నిస్తాడేమోనని నా అనుమానం."

"వాట్?" ఇన్‌స్పెక్టర్ ప్రశ్నార్థకంగా చూశాడు.

"అవును బాస్! మనం రహస్యంగా ఆ ఇంటి కాంపౌండులో దాగివుంటే హంతకుడి అంతు తేల్చుకోవచ్చు!"

ఇన్‌స్పెక్టర్ సాభ్యం సాలోచనగా తల పంకించాడు.

# 8

రాత్రి పన్నెండు గంటలు దాటింది.

మిస్ మేరీ యింటి కాంపౌండులో చీకటి రాజ్యం చేస్తోంది. చీకటికి నిశ్శబ్దం తోడై గుండెలు తోడేస్తోంది.

ఏదో ఆకారం కాంపౌండు గోడెక్కి క్రిందికి దూకింది. ఆకారం దూకిన శబ్దానికి కాంపౌండ్‌లోని క్రోటన్ మొక్కలు రెండు మెల్లగా కదిలాయి.

కాంపౌండ్‌లోకి ప్రవేశించిన ఆకారం ఇంటిచుట్టూ ఓసారి ప్రదక్షిణం చేసి, తిన్నగా వెళ్ళి గుమ్మం ముందు ఆగింది. గోడమీద నున్న బెల్ స్విచ్ నొక్కింది. లోపల బెల్ మోగిన శబ్దం స్పష్టంగా వినిపిస్తోంది కాని ఇంట్లోంచి ఎలాంటి జవాబూ లేదు. మనిషి కదిలిన అలికిడిగానీ, గదిలో దీపం వెలిగించిన జాడ గానీ లేదు.

గుమ్మం ముందు నిల్చున్న ఆకారం అంతటితో ఆగక మళ్ళీ మళ్ళీ డోర్ బెల్లు మోగించసాగింది.

ఐదునిమిషాలు గడిచాయి!

లోపల ఏదో చప్పుడైంది. గదిలో దీపం వెలిగింది. ఆకారం మరోసారి డోర్ బెల్లు మోగించి పక్కకు తొల గింది. మరో రెండు ఆకారాలు గోడదూకి కాంపౌండులోకి చేరుకున్నయ్. గుమ్మం దగ్గర నిల్చునివున్న ఆకారం ఆ

యిద్దరికీ ఏదో సైగ చేసింది. తక్షణం ఆ ఇద్దరూ గోడ పక్కకి చేరి గోడకి నక్కి నిల్చున్నారు.

లోపల వీధి గుమ్మందగ్గర నిల్చునివున్న ఆకారం చటుక్కున గోడకి నక్కినిల్చుంది.

కిర్రుమని శబ్దం చేసుకుంటూ ఓ తలుపురెక్క తెరుచుకుంది. "ఎవరది?" అంటూ మేరీ బైటికి తొంగిచూచింది. గోడకి నక్కినిల్చున్న ఆకారం చటుక్కున తన కుడిచేతితో వున్న కర్చీఫ్‌తో ఆమె ముఖాన్ని నొక్కిపట్టింది. రెండు సెకండ్లపాటు నిశ్శబ్దం. ఆ తరువాత గుమ్మంలో నిల్చున్న మేరీ కుప్పలా క్రిందికి కూలిపోయింది. గోడకి నక్కి నిల్చునివున్న ఆకారాలు రెండూ ముందుకి వచ్చాయి. ముగ్గురూ కలిసి మేరీని చుట్టుముట్టారు.

వెంటనే పోర్టికోలో నున్న దీపం వెలిగింది. ఇన్‌స్పెక్టర్ సత్యం చేతిలోని 'విజిల్' మోగింది. క్రోటన్ మొక్కలచాటున నక్కివున్న పోలీసులు నలువైపుల నుండి వచ్చి ఆకారాల్ని చుట్టుముట్టారు.

ఈ హఠాత్సంఘటనకు ఆశ్చర్యపోయిన ఆకారాల్లో ఒకటి రివ్వున ముందుకి దూకి పారిపోవడానికి ప్రయత్నించింది. కాని ఇన్‌స్పెక్టర్ సత్యం బాహుపంజరంలో చిక్కుకుపోయింది.

స్పృహ కోల్పోయి క్రిందికి తూలిపోయినట్టు నటించిన మేరీ మెల్లగా కళ్ళు తెరిచి, లేచికూచుని "ఇంతకీ ఎవరు వీళ్ళు? నన్నెందుకిలా వెంటాడుతున్నారు?" అని ప్రశ్నించింది, నల్లని చొక్కాలూ, నిక్కర్లూ తొడుక్కుని ముఖాలకి ముసుగులు ధరించిన ఆకారాలకేసి చూసి.

ఇన్‌స్పెక్టర్ సత్యం ఒక ముసుగుమనిషి ముఖంమీద చెయ్యివేసి, "దాదాపు పదేళ్ళ క్రితం రైల్వేవాగన్లు

లూటీచేసి బ్రతుకుతున్న రోజుల్లో ఇతగాడి పేరు ముత్రాసి కనకయ్య. రెండుమార్లు పోలీసుల చేతులకి చిక్కి, జైలు కెళ్ళి తిరిగి వచ్చిన తరువాత తన పాతజీవితాన్ని పక్కకి నెట్టి, లిక్కర్ షాపు ఓపెన్ చేసి నలుగుర్లో పెద్దమనిషిగా తలెత్తుకు తిరుగుతూ ప్రస్తుతం మిస్టర్ కనకరాజ్ గా చలామణీ అవుతోన్న మీ మాజీ ప్రియుడు!" అంటూ మేరీ కళ్ళల్లోకి సూటిగా చూశాడు.

ఆ మాటతో అటు మేరీ, ఇటు ముసుగుమనిషీ ఇద్దరూ షాక్ తిన్నట్టు తలలు పైకెత్తి ఇన్ స్పెక్టర్ కేసి చూశారు.

"నేను హంతకుడ్ని గాను. నేనెవర్నీ హత్య చెయ్యలేదు" గట్టిగా అరిచాడు కనకరాజ్.

"తొందరపడకండి మిస్టర్ కనకరాజ్! నేను చెప్పేదంతా పూర్తిగా విన్నతరువాత మీరు హంతకులు అవునో, కాదో తేల్చి చెప్పండి."

ఇన్ స్పెక్టర్ సత్యం గొంతు సవరించుకున్నాడు.

"రాష్ట్రపతి రోడ్ లో లిక్కర్ షాప్ నడుపుతోన్న మిస్టర్ కనకరాజ్ కీ, మారేడ్ పల్లిలో వుంటోన్న పంతులమ్మ మేరీకీ ఎలా భేటీపడిందో వూహించలేను. బహుశా ఏ పార్టీలోనో, ఏ బార్ లోనో కలుసుకునివుంటారు. మొత్తానికి ఆ యిద్దరికీ పరిచయంకావడం, పరిచయం ప్రణయంగా మారడం, కొంత కాలానికి మేరీ కనకరాజ్ ప్రాపకంలో వుండడం జరిగింది.

"కనకరాజ్ ఆట్టే చదువుకున్నవాడు కాడు. పైగా సభ్యతా సంస్కారాల్లో కూడా మేరీ స్థాయిని అందుకో గలిగినవాడు కాడు. ఇక అందచందాల్లో కూడా ఆట్టే ఆమెను ఆకర్షించగల 'చావ'వున్న వ్యక్తి కాడు. అయితే

మేరీ అతగాడ్ని ఏంచూసి మోహించింది? బహుశా అత గాడి విలాసజీవితాన్ని చూసి కావచ్చు!

ఎలాగైతేనేం మేరీ అతగాడికి లొంగిపోయింది. తాత్కాలిక బలహీనతలవల్ల లొంగిపోయిన వ్యక్తి సాధ్య మయినంత త్వరలోనే అందులోంచి బైటపడటానికి ప్రయత్నిస్తుంది. సభ్యతా ప్రపంచంలో తిరగ నేర్చిన మేరీలాంటి వ్యక్తుల విషయం మరి చెప్పనక్కరలేదు.

"ఆరుమాసాల క్రితం మేజర్ మోహన్ రంగంతో పరిచయమైంది. అతడే ఆమెను ఆకర్షించాడో, ఆమే అతడ్ని ఆకర్షించిందో చెప్పలేము. కాని ఇద్దరూ పరస్పర ఆకర్షణకు లోనయ్యారు. అదనుకోసం ఎదురుచూస్తున్న మేరీ, కనకరాజ్ పంజరంలోంచి బైటపడి, మేజర్ మోహన్ రంగం ఒళ్ళో వాలిపోయింది.

"తన ప్రాపకంలో వున్న స్త్రీ మరో వ్యక్తి అండ చూచుకునేసరికి మిస్టర్ కనకరాజ్ రెచ్చిపోయాడు. మేరీని తనకి కాకుండా చేసిన మేజర్ మీదా, మేజర్ అండచూసుకుని తన్ను కాలదన్నిన మేరీమీదా పగ బూనాడు. వాళ్ళ అంతు తేల్చుకోవాలనుకున్నాడు."

"అబద్ధం! నేనెవరిమీదా పగబూనలేదు! నేనెవర్నీ చంపదలచుకోలేదు. నన్ను కాదని మరొకడి చెంత జేరిన మేరీని భయపెట్టి, మళ్ళీ నా సొంతం చేసుకోవాలను కున్నానేగాని, ఆమెను నేను చంపదలచుకోలేదు" అన్నాడు మిస్టర్ కనకరాజ్.

"నేను చెప్పడం ఇంకా పూర్తి కాలేదు" ఇన్‌స్పెక్టర్ సత్యం కనకరాజు కళ్ళల్లోకి సూటిగా చూశాడు.

కనకరాజు మాట్లాడలేదు.

ఇన్‌స్పెక్టర్ చెప్పడం మొదలెట్టాడు.

"నేనింత సేపూ ముత్తా నాయకుడ్ని గురించే మాట్లాడాను. మిగతా ఇద్దర్నీ మీకు పరిచయం చెయ్యలేదు! కనకయ్యకి ఎడంవేపున వున్న ముసుగుమనిషి పేరు ముద్దా రాముడు, కుడివేపునవున్న మనిషి కర్రవీరడు. కనకయ్య రైల్వే వాగన్లు లూటీచేసే గోజుల నుండీ ఈ ఇద్దరూ అతగాడికి కుడి ఎడమ భుజాల్లాంటివారు. కనకయ్యతో పాటు వీళ్ళుకూడా జైలుకెళ్ళి వచ్చారు.

కనకయ్య లిక్కర్ షాపు ఓపెన్ చేసిన తరువాత తమకు సరైన నాయకుడు దొరక్క కాబోలు, వాగన్ లూటింగ్ మానివేశారు. కాని చిన్న చిన్న దొంగతనాలు చెయ్యడం, జనం రద్దీవున్నచోట హస్తలాఘవం చూపి పాంటు జేబుల్లోంచి పర్సులు కొట్టెయ్యడం, ఆడవాళ్ళ మెడల్లోంచి గొలుసులు లాగెయ్యడం మానలేదు. గూళీ పేటనుండి 'ఇలిసిట్ లిక్కర్'లాంటి నిషేధ వస్తువుల్ని కనకరాజ్ షాపుకి చేరవెయ్యడంలాంటి పనులు చేస్తూ తమ పాత నాయకుడ్ని విడిచిపెట్టలేదు.

"పైసా వున్నవాడికి సంఘంలో పలుకుపడి సంపాయించడం కష్టంకాదు. పైసాతో వచ్చిన పలుకుబడి కనకరాజ్‌కి వుంది గనుక, అతని అండ జూచుకొన్న ముద్దా రాముడూ, కర్ర వీరుడూ పోలీసుల చేతికి చిక్కకుండా తప్పించుకు తిరగగలుగుతున్నారు.

"ఆ మధ్య సికింద్రాబాద్‌లో జరిగిన మహంకాళి జాతర హాలూకు వేడుకల్ని చూడడానికి కట్టెలడితీ కామరాజు వెళ్ళాడు. జనం రద్దీగా ఉండడంవల్ల కనకరాజు భృత్యులు అతని మెడలోని పులిగోరు హైసుని తేలిగ్గా లాగేశారు.

పులిగోరు దిమ్మ వెనుక 'కేకే' అన్న అక్షరాలు వుండడంవల్లనైతేనేమి, పులిగోరు దిమ్మమీద ఎన్‌గ్రేవ్ చెయ్యబడిన సింహంబొమ్మ చాలా ఆకర్షణీయంగా వుండడంవల్లనైతేనేమి, మన కనకరాజుకి దానిమీద కన్ను పడింది. వెంటనే దాన్ని సొంతం చేసుకుని మెడలో తగిలించుకొన్నాడు. హత్య జరగడానికి నెల రోజుల ముందునుండి ఆ పులిగోరు చైను కనకరాజు మెడలో చూసినవాళ్ళు సాక్ష్యమివ్వగలరు.

"పదేళ్ళ క్రితం రైల్వే వాగన్లు లూటీచేసి బ్రతుకు తున్న రోజుల్లో ఇతగాడి పేరు ముత్రాసి కన్నయ్య అని యింతక్రితం చెప్పాను. అందరూ అలా పిలుస్తుండేవారు. కాని అసలు పేరు కట్టా కనకయ్య. పోలీసు రికార్డ్సులో ఇతని పేరు ముత్రాసి కన్నయ్య వురఫ్ కట్టా కనకయ్య అని వుంది. ఇతగాడు లిక్కర్ షాపు ఓపెన్ చేసి కనక రాజ్‌గా చెలామణి అవుతున్నప్పుడు కూడా యితడు కె. కనకరాజు అనే సంతకాలు చేస్తున్నాడు. పులిగోరు చైనుని యితగాడు ధైర్యంగా సొంతం చేసుకుని మెడలో వేసుకోవడానికి కారణం మీరందరూ వూహించే వుంటారు.

"కనకరాజు తన భృత్యులతోబాటు బైలుదేరి మేజర్ మోహన్‌రంగంగార్ని హత్య చేసినప్పుడు కూడా ఆ చైను ఇతగాడి మెళ్ళో వుంది. హత్యా సమయంలో ఆ చైను హతుడి చేజిక్కడం బహుశా కనకరాజ్ గమనించి వుండడు.

"అబద్ధం! ఆ చైను విషయం నాకేమీ తెలీదు! అది నా మెడలో లేదు. నేను యెవర్నీ హత్య చేయలేదు!" కనకరాజు మళ్ళీ బుకాయించాడు.

"మిస్టర్ కనకరాజ్! నువ్వెన్నయినా బుకాయించ వచ్చు. కాని హత్య జరిగిన ముందురోజు ఆ చైను నీ మెడలో వున్నట్టు బలమైన సాక్ష్యం వుంది. ఒక్క క్షణం తొందరపడకుండా నేను చెప్పేది వింటే నువ్విప్పుడు చెప్పింది కేవలం అబద్ధమేనని నువ్వే ఒప్పుకుంటావు" అన్నాడు ఇనస్పెక్టర్.

కనకరాజ్ నోరు మెదపలేదు.

"కట్టెలడితి కామరాజు చాలా తెలివయిన వాడు. మహంకాళి జాతరనాడు తన మెడలోంచి ఆ చైను మాయంకాగానే పోలీసులకు రిపోర్టు చేశాడు. ఆ రిపోర్టులో చైనుని గురించి పూర్తి వర్ణన యిచ్చాడు. ఆ చైను పులి గోళ్ళమీద నున్న దిమ్మపై ఓ సింహం బొమ్మవుంది. ఆ బొమ్మలో రెండు కళ్ళకీ రెండు కెంపులు పొదగబడి వున్నయ్. ఈ బొమ్మ చాలా చిన్నదయినప్పటికీ చాలా అందమైంది. దీనిని తయారుచేసిన కంసాలి తనకున్న శిల్ప నైపుణ్యాన్నంతా దీనిలో చూపాడు. ఈ చైనుజాడ తేలిగ్గా కనిపెట్టేందుకు యీ వర్ణన సాయపడుతుందన్న వుద్దేశంతో కామరాజు తన రిపోర్టులో పేర్కొనివుండొచ్చు.

కామరాజు రిపోర్టు యిచ్చినప్పటి నుంచీ పోలీసులు ఈ చైనుకోసం గాలిస్తూనేవున్నారు. చివరికి ఓ 'ఇన్‌ఫార్మెంట్' ద్వారా దీని ఆచూకీ తెలుసుకుని, మహంకాళి వీధిలోవున్న స్టేషన్ సబ్ ఇన్‌స్పెక్టర్ స్వయంగా వెళ్ళి కనకరాజ్‌ని కలుసుకుని, అతడు ఏ మాత్రం అనుమానించకుండా, ఆ చైను పనితనాన్ని అతని సమక్షంలోనే ప్రశంసించి మరీ వచ్చాడు. ఆ సమయంలో అక్కడవున్న వ్యక్తులు సాక్ష్యమివ్వగలరు.

ఆ రాత్రే మోహనరంగం హత్య చెయ్యబడడంతో పైను అతని మెడలోంచి హతుడి చేతిలోకి మారడంవల్ల మరుసటిరోజు అతడ్ని అరెస్టు చెయ్యడానికి అన్నీ సమ కూర్చుకుని వెళ్ళిన సబ్ ఇన్‌స్పెక్టర్ నిరాశగా వెనక్కి తిరిగి వెళ్ళవలసి వచ్చింది" అన్నాడు యిన్‌స్పెక్టర్ సత్యం.

పాపం, కనకరాజ్ మారుమాట్లాడలేకపోయాడు. అతనికి ముచ్చెమటలు పోసినయ్.

"అంతేకాదు! హత్యా సమయంలో హంతకుడు తొడుక్కొనివున్న గ్లాస్కొజుబ్బా ఆ పరిసరాల్లోనే ఓ ముళ్ళ పొదలో మాకు దొరికింది. దాని మెడ వెనుక భాగానవున్న టైలర్ లేబిల్ సహాయంతోనూ, చాకలి గుర్తుల సహా యంతోనూ అది కనకరాజ్‌దేనని రుజువు చెయ్యడం, దాని మీదవున్న నెత్తుటి మరకలవల్ల ఇతడే హంతకుడని నిరూపించడం కష్టమైన పనేమీ కాదు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

కనకరాజు గుండెలు జారిపోయినయ్. ఎటూ తప్పించు కోలేని పరిస్థితిలో నిల్చున్నపళాన నేలకూలాడు.

"మోహన్‌రంగం యింటి వెనుక సత్యనారాయణ శెట్టిగారి మేడొకటి వుంది. క్రింద కొట్లూ మేడమీద స్టూడెంట్సు అద్దెకుంటోన్న గదులూ వున్నయ్. ఈ మధ్య రెండుమాసాల క్రితం ఓ గది ఖాళీ అయింది.

కనకరాజ్ కుడిభుజం ముద్దా రాముడు ఆ గదికి అడ్వాన్సు ఇచ్చి దాన్ని తన స్వాధీనంలో వుంచుకున్నాడు. ముద్దా రాముడూ కర్రవీరుడూ అప్పుడప్పుడూ ఆ గదిని వాడుకునేవాళ్ళు, కాని శనివారం రోజు రాత్రిళ్ళు

మాత్రం కనకరాజ్ కూడా వాళ్ళతో బాటు ఆ గదిలో గడిపేవాడు.

ఆ గది దొడ్డివైపున వున్న పిట్టగోడవద్ద నిల్చుంటే మేజర్ గారి ఇంటి కాంపౌండ్ లోనూ ఆ పరిసరాల్లోనూ ఏం జరుగుతున్నదీ తెలుసుకోవచ్చు. అంటే అర్థం ఏమిటి? కనకరాజ్ అతని అనుచరులూ ఆ గదిలో బిచాణా వేసి, మేజర్ మోహనరంగం మేకిల కదలికల్ని రెండుమాసాలుగా గమనిస్తున్నారన్న మాట.

శనివారం రాత్రిళ్ళు కనకరాజ్ అతని భృత్యులూ ఆ గదిలో చేరి, మేకీ మోహన్ రంగం ఇల్లు చేరుకునేదాకా ఏ కబుర్లు చెప్పుకుంటూనో, ఏ పేకాట ఆడుతూనో గడిపే వారు.

ఎప్పుడన్నా పేకాటకి డబ్బు తగ్గినపుడు పక్క గదిలోవున్న యాదగిరి అనే కుర్రవాడ్ని సాయం తీసుకునేవాళ్ళు. యాదగిరి అనే కుర్రాడికి క్లెటలడిటీ కాము రాజుతో బాగా పరిచయముంది. కామురాజు మెడలోని పులిగోరు చైనుని బాగా గుర్తుపట్టగలడు. కామురాజు మెడలోంచి చైను మాయమైంతరువాత, అది కనక్ రాజ్ మెడలో కనిపించడంతో అతనికి అనుమానమేసి పోలీసులకి తెలియపరిచాడు!" ఇన్ స్పెక్టర్ సత్యం చెప్పడం ఆపాడు.

అప్పటి ఆ యింటి కాంపౌండు అంతా జనంతో నిండి పోయింది. పోలీసుజీపు ఇంటిముందు ఆగింది.

కనక్ రాజ్ కీ, అతని భృత్యులికీ బేడీలు తగిలించి జీపు నెక్కించారు పోలీసులు.

—:ఐపోయింది:—

# హత్య చేయని హంతకుడు!

వసుంధర

"బాస్! ఇంతకాలం నువ్వు నాకు చేసిన సాయానికి ధన్యవాదాలు. ఇక నాకు సెలవు ఇప్పించు" అన్నాడతను.

"సెలవా? ఎందుకు" అన్నాడు బాస్ ఆశ్చర్యంగా.

"ఈ వృత్తికీ, నా మనస్తత్వానికీ సరిపడదు బాస్! నీ దయవల్ల ఇప్పటికి కొంత డబ్బు కూడబెట్టుకోగలిగాను. ఆ ఆధారంతో నా జీవన విధానాన్ని మార్చుకుంటాను" అన్నాడతడు.

"వెర్రివాడా-మంచితనానికివి రోజులు కావు. నీ సామర్థ్యం నన్నెంతగానో ఆకర్షించింది. నిన్ను నేను వదులుకోలేను. నువ్వుగానీ న్యాయస్థానానికి భయపడుతున్నావేమో - నాకు అనుచరుడిగా వున్నంతకాలం ఆ భయం నీకుండదు. ఏదో వెర్రి ఆవేశంలో పిచ్చి పిచ్చి నిర్ణయాలు మాత్రం తీసుకోకు."

"లేదు - బాస్ ఇది ఆవేశంలో తీసుకున్న నిర్ణయం

కాదు. ఆశతో తీసుకున్న నిర్ణయం. నేరాలు చేయడం నా మనసుకు సరిపడ్డంలేదు" అన్నాడతను దిగులుగా.

బాస్ అతనివంక పరీక్షగా చూశాడు. అతని ముఖ కవళికల్ని బట్టి మనసులో భావాల్ని చదివాడు.

అతడి గురించి బాస్‌కు బాగా తెలుసు. కూటికి గతి లేని పరిస్థితుల్లో అతనుండగా తను చేరదీశాడు. తగిన శిక్షణ యిచ్చి నేరాలు చేయించి డబ్బు సంపాదించాడు. అతని మంచితనం, నమ్మకత్వం తనను ఆకర్షించగా తనకు ఆంతరంగికుణ్ణిగా చేసుకొన్నాడు. ఇప్పుడైనా సరే— అతను తన మాట కాదనడు. ఎటొచ్చీ గతిలేక నేరాలు చేస్తున్నాడు తప్పితే యిలాంటి జీవితం అతనికి నచ్చదు. ఏదో వొకరోజున అతనిలాంటి మాట అంటాడని బాస్‌కు తెలుసును.

"ఎస్. నీ మాట కాదనను. నిన్ను బలవంత పెట్టను. నువ్వు చేసిన పాత నేరాల గురించి నిన్ను బ్లాక్ మెయిల్ చేయను. నీకు పూర్తి స్వతంత్రం ఇస్తాను. కానీ...." అని ఆగాడు బాస్.

అతను ఆతృతగా బాస్ వంక చూశాడు. ఆ.... "కానీ" పైనే తన భవిష్యత్తు అంతా ఆధారపడి ఉంది...."చెప్పు బాస్!" అన్నాడు.

"నువ్వో హత్య చేయాలి....!" అన్నాడు బాస్ తాపీగా.

"హత్యా!...." అన్నా డతను కంగారుగా— "ఎందుకు?"

"హత్య లెందుకు చేస్తారు? మన నిబ్బంది పెడుతున్న

మనిషిని అడ్డు తొలగించుకోవడానికి. ఓ మనిషి కారణంగా నాకు కొన్ని ఇబ్బందులొచ్చాయి. ఆ మనిషిని నేను స్వయంగా చంపడానికి లేదు. ఏ కేసులోనూ నేను డైరెక్టుగా యిన్వాల్వ్ కాలేనుగదా! ఊళ్ళో నాకున్న పేరు ప్రఖ్యాతులింతా అంతా కావు. అలాంటప్పుడు నా అనుచరులే నాకు పని చేసిపెట్టాలి. అనుచరుల్లో నువ్వు తప్ప నమ్మకస్థులింకెవరున్నారు నాకు?" అంటూ బాస్ అతనివంక దీనంగా చూశాడు.

"కానీ యింతవరకూ నే నెన్నడూ హత్య చేయ లేదు...."

"వెర్రివాడా—అన్ని నేరాల్లోకీ అదే సులభమైనది" అంటూ నవ్వాడు బాస్.

"వద్దు బాస్! నన్ను హత్యకు పురికొల్పవద్దు. కావాలంటే నీవద్ద మరికొంతకాలంపాటు పాత పనులే కొనసాగిస్తాను. హత్య చేయమని మాత్రం చెప్పకండి—" అన్నాడతను. అతని అసహాయత అతని కంఠంలో ధ్వనిస్తోంది.

"నువ్వు తప్ప నాకు నమ్మకస్థులు లేరు. ఆ మనిషి చావు నాకు ముఖ్యం. ఈ ఒక్క పనీ నువ్వు నాకు చేయక తప్పదు. ఇది పనికాదు, సాయం. ఇది నా ఆజ్ఞ కాదు. అర్థింపు. నా అవసరాన్ని అర్థం చేసుకుని నాకు సహకరించు. ఈ ఒక్కసారికీ నా మాట మన్నించగలిగావంటే జీవితంలో యిదే నువ్వు చేసే ఆఖరి నేరం కాగలదు...."

"నేను చేస్తున్న నేరాలు చివరికి నన్ను హంతకుడిగా మారుస్తాయేమోనని భయపడే ఈ వృత్తిని వదిలిపెట్టాలనుకుంటే నువ్వు నా ఆఖరి నేరాన్ని హత్యకు నియో

గిస్తున్నావు. నేను హత్యలు చేయలేను. హంతకుణ్ని కాలేను. నన్ను వదలిపెట్టు బాస్!" అన్నాడతను వేడుకుంటున్నట్లుగా.

"హత్య చేస్తావో, మానతావో నీ ఇష్టం. ఆ మనిషి చావడం నాకు కావాలి. హత్య చేయకుండా చంపగల ననుకుంటే అలాగే చేయి. ఇందుకు నీకు మూడు నెలల వ్యవధకూడా ఇస్తున్నాను—"

ఈ పని తనకు తప్పదని అతనికి అర్థమైంది. ఒక మనిషిని చంపాలని నిర్ణయించుకున్నాక—హత్య తప్ప మరో మార్గమేముంటుంది? అంటే తను హంతకుడు కాక తప్పదు.

అతను గుండె రాయి చేసుకొన్నాడు—"ఇంతకీ ఆ మనిషి యెవరో చెప్పు బాస్!"

"ఇప్పటికి దారికి వచ్చావ్—" అని—"నీకు గోపీనాథంగారు తెలుసు ననుకొంటాను....—" అన్నాడు బాస్.

గోపీనాథంగారు మరీ గొప్పవాడు కాకపోయినా ఆ ఊళ్ళోని ధనవంతుల్లో ఒకడు. చాలామందికి తెలిసినవాడు. అతనికి గోపీనాథం తెలుసును. భయంగా బాస్ వంక చూసి—"నేను గోపీనాథంగారిని చంపాలా?" అన్నాడు.

"అలా కంగారుపడకు. గోపీనాథానికి రూప అని ఓ కూతురుంది. తెలుసా?"

రూపని అతను చూడలేదు. కానీ ఆమె గురించి కొంత విన్నాడు. రూప అందంగా ఉంటుందట. ఆ అందం చూసి బాస్ కొడుకు కృష్ణారావు ఆమెను ప్రేమించాడు.

కానీ రూప అతన్ని నిరాకరించింది. ఆ కారణంగా బాస్ గారీనాథంమీద పగబట్టాడుకూడా.

అయితే తనిప్పుడు చంపవలసింది ఒక ఆడపిల్లనా అనుకున్నాడు అతను.

"రూపకాదు. ఆమె మరొకరిని ప్రేమిస్తుంది—" అంటూ బాస్ వివరించసాగాడు.

అతను శ్రద్ధగా వినసాగాడు.

## 2

రూప పార్కులో అటూ ఇటూ అసహనంగా కదులుతూ వాచీ చూసుకుంది.

"అప్పుడే ఐదు నిముషాలు లేటు—" అని విసుక్కుంది. చుట్టూ చూసింది. దూరంగా చూడగలిగినంత వరకూ ఆమెకు కావలసిన వ్యక్తి కనబడడం లేదు.

రూప పార్కు బెంచీ మీద కూలబడి గతంలోకి వెళ్ళింది.

ఆ రోజు తను కాలేజీకి యెగేసి మ్యాట్నీకని వెళ్ళింది.

హాలుదగ్గర జనం కిటకిటలాడి పోతున్నారు. క్యూలలోకి అడుగుపెట్టే ప్రసక్తి లేదు.

ఆ రోజు సినిమా చూడాలని రూపకు కోరికగా ఉంది. సినిమాకని బయల్దేరి వచ్చి చూడకుండా వెళ్ళిపోవడం ఆమెకు అనుభవంలో లేదు. అయితే అప్పుడున్న పరిస్థితుల్లో ఏం చేయాలో ఆమెకు తోచడంలేదు.

సరిగ్గా ఆ సమయంలో ఒక వ్యక్తి ఆమెను పలకరించాడు—"సినిమాకు టికెట్లు కావాలా మేడమ్?"

ఆమె ఉలిక్కిపడి అతన్ని చూసింది. ఆ పలుకులు

అమృతోపమానంగా తోచాయామెకు. "ఏమిటన్నారూ?" అంది నమ్మలేక.

అతను తన ప్రశ్నను రిపీట్ చేశాడు.

"కావాలి—" అందామె ముక్తసరిగా.

"సినిమాపిచ్చిని నేను అర్థం చేసుకోగలను. ఏదో పని మీద పోతూ యథాలాపంగా యిక్కడ మిమ్మల్ని చూశాను. మీ కళ్ళు చూస్తూనే మీ ఆవేదన అర్థం చేసుకున్నాను. నాకూ సినిమా పిచ్చి ఉంది లెండి. కావాలంటే మీకు టికెట్ తెచ్చిపెట్టగలను—" అన్నాడతను.

అతనివంక పరీక్షగా చూపిందామె. మనిషి అందంగా ఉన్నాడు. సన్నగా, పొడుగ్గా, నాజూగ్గా, ఆకర్షణీయంగా ఉన్నాడు. ఆమె వయసు అమ్మాయిలతన్ని మోసగాడని అనుకునేలా లేదు వేషం.

సందేహించకుండా ఓ యాభై రూపాయలనోటు తీసి అతనికిచ్చి—"చిల్లరలేదు మరి—" అంది. అతనా నోటు అందుకొని జనసమూహంలో కలిసిపోయాడు.

నిజానికామెవద్ద చిల్లర ఉంది. కానీ అతని వేషాన్ని చూసి ఆమె చిన్నబోయి ఇవ్వడానికి తటపటాయించింది. కావాలని టికెట్స్ తీసిపెడతానని అన్న అతన్ని తను అనుమానించడం లేదనడానికి నిదర్శనంగా ఆమె ఆ పెద్ద నోటును యిచ్చింది. అతను మోసం చేస్తే ఆమెకు ఆర్థికంగా పెద్ద నష్టమేమీ ఉండదు. జీవితంలో అదో అనుభవమవుతుంది. లేదా టికెట్ దొరుకుతుంది.

ఆమె ఆలోచనలింకా సగంలో ఉండగానే అతను వచ్చి ఆమెకు నాలుగు పదులు తిరిగిచ్చి—చేతిలో రెండు టికెట్లు పెట్టి "బ్లాకులో కొన్నాను. ఈ రోజు

బ్లాక్ ధర ఎక్కువగా ఉంది. నేను కొన్నవాడి దగ్గర ఇవి రెండే ఉన్నాయి. రెండూ పదిరూపాయల కిచ్చాడు. ఎన్ని టికెట్సు కావాలని మిమ్మల్ని ముందుగా అడగ లేదు. మీ వాటం చూస్తే యే ఫ్రెండ్స్ కోసమో ఎదురు చూస్తున్నట్లనిపించింది. జనం మూగేలోగా రెండు టికెట్సూ పట్టుకొచ్చేశాను—" అన్నాడు.

రూప అతనికి థాంక్స్ చెప్పి—"నేను సింగిల్ గా వచ్చాను. రెండో టికెట్ నాకు అవసరం లేదు!—" అంది.

"అయితే యిలాగివ్వండి—అది యెవరికైనా క్లియర్ చేసేస్తాను—" అన్నాడతను.

ఆమె తడబడుతూ—"ఎందుకు? మీకు వేరే పనేమీ లేకపోతే, అభ్యంతరం లేదనుకుంటే—ఈ టికెట్ మీరే తీసుకోండి—" అంది. అయితే ఆమె మనసులో ఆలోచన వేరు. ఇతను చూడ్డానికి పెద్దమనిషిలా ఉన్నాడు. ఇతను తన పక్కన ఉంటే ఫరవాలేదు. లేకపోతే ఆ టికెట్ యే రౌడీ వెధవ చేతిలో పడుతుందో!

అతను ముందు తటపటాయించి—"సినిమాకని బయ లేరలేదు నేను. చిన్న పనికూడా ఉంది నాకు. కానీ మీ బోటివారి పరిచయం లభించడం చాలా అదృష్టం. మీ ఆహ్వానాన్ని కాదనలేను—" అన్నాడు.

ఇద్దరూ కలిసి సినిమా చూశారు. సినిమా కథ చాలా మామూలు కథ.

ఒక గొప్ప ధనవంతుడికి అప్సరసల్లాంటి యిద్దరు కూతుళ్ళు. పెద్దమ్మాయికి పేదవాళ్ళంటే అసహ్యం. చిన్నమ్మాయికి వాళ్ళంటేనే యిష్టం. తమ తమ అభి

రు నుల మేరకు వాళ్ళిద్దరూ ప్రేమించి పెళ్ళిళ్ళు చేసుకుం టూరు. తండ్రి రెండో అమ్మాయిని అసహ్యించుకుని ఇంట్లోంచి గెంటేస్తాడు. కానీ కథ ముగిసేసరికి పెద్ద మ్మాయి మొగుడు జైల్లో ఉంటాడు. రెండో అమ్మాయి మొగుడు హైదరాబాదులో పెద్ద మేడ కొని హాయిగా ఉంటాడు. సినిమా అంతా పేదవాళ్ళని పొగడ్డంతోనే సరిపోయింది.

ఈ కథ రూపపైన కొంత ప్రభావం చూపించక పోలేదు. ఆమె అతని వివరాల నడిగింది.

అతను ఉత్సాహంగా ఆమెకు తన గురించిన వివరాలు చెప్పాడు.

అతని పేరు చంద్రశేఖరం. అతను చదువుకున్న అంద మైన పేదవాడు. నిరుద్యోగి. సినిమాలో ఇలాంటివాళ్ళనే పొగడ్డం జరిగింది. అందువల్లనే అతనామె కుత్సాహంగా తన వివరాలు చెప్పాడు. అందమైన ధనిక యువతి ముందు యే యువకుడూ తన పేదరికాన్ని మరో పరిస్థితిలో అయితే అంగీకరించడు.

అప్పటికి వాళ్ళిద్దరూ విడిపోయారు కానీ ఓ రెండ్రో జుల తర్వాత చంద్రశేఖరం ఆమెను ప్రత్యేకంగా కలుసు కొని ఆమెకు పదిరూపాయలు యిచ్చి—"మగవాడినై ఉండి మీ డబ్బుతో సినిమా చూసినందుకు చాలా బాధ పడ్డాను. ఇది తీసుకొని నాకు సంతృప్తి కలిగించండి—" అన్నాడు.

మొదట వద్దన్నా ఆ డబ్బు తీసుకోక తప్పలేదు రూపకు. అప్పుడు చంద్రశేఖరం తన గురించిన నిజాలు మరికొన్ని చెప్పి ఆమెకు విస్మయం కలిగించాడు.

ఆరోజు రూపను చూస్తూనే అతను ప్రేమించేశాట్ట.

ఆమెతో యేదో విధంగా పరిచయం సంపాదించాలను కున్నాట్ట. కావాలనే సినిమా టికెట్లు రెండు కొన్నాట్ట. సమయానికి జేబులో డబ్బు లేనందుకు బాధపడ్డాట్ట. ఆ బాధ ఇప్పుడు తీరింది.

ఈ వివరాలన్నీ చంద్రశేఖరం చక్కటి పద్ధతిలో చెప్పాడు. అతని మాటలు, మాట్లాడే పద్ధతి కూడా రూపకు నచ్చాయి. అప్పుడే ఆమెకు అతనిపై ప్రేమ అంకురించింది. తన మనసులోని భావాన్ని ఆమె కూడా అతనికి చెప్పింది.

"మీతో కలిసి ఆ సినిమా చూడడం చాలా మంచిదైంది. అందువల్లనే నా మనసు మీపైకి మళ్ళింది. నాకూ డబ్బున్న వాళ్ళంటే అసహ్యమే! నేను డబ్బున్నదాన్నే కావచ్చు. కానీ మా ఇళ్ళలో ఆడదానికున్న నీతి మగాడికుండదు. అన్నిరకాల అలవాట్లూ ఉంటాయి వాళ్ళకు. వాళ్ళను చేసుకుని యే ఆడపిల్లా సుఖపడలేదు. ఆడదాన్ని విలాస వస్తువుగా కాక ప్రేమస్వరూపిణిగా గుర్తించే మంచి మనసు పేదవాళ్ళలో తప్ప ఉండదు" అంది రూప.

ఇద్దరికీ పరిచయం ముదిరింది. పరిచయంతో పాటు ప్రేమ కూడా ముదిరింది.

రూప, చంద్రశేఖరం రోజూ పార్కులో కలుసుకుని భవిష్యత్తు గురించి యెన్నో కలలు కంటూండేవారు. రూప మనసులో తను సినిమాలో చూసిన ధనవంతుడి రెండో కూతురు మెదుల్తోంది. అందుకు కారణాలు లేక పోలేదు.

చంద్రశేఖరం, రూప—ఒకరినొకరు బాగా అర్థం చేసుకున్నారు. రూపకు అతని సామర్థ్యంపైన బాగా

నమ్మకం కలిగింది. చంద్రశేఖరం ఆలోచనలు కేవలం ఉద్యోగంచుట్టూ పరిభ్రమించడంలేదు. అతని బుర్రలో వ్యాపారానికి సంబంధించిన ఎన్నో ఆలోచనలున్నాయి. సరైన పెట్టుబడి లభిస్తే అతను వో యేడాదిలోనే తనూ స్వంతంగా హైదరాబాదులో వో మేడ కట్టగలడు.

అతను పేదవాడు కాబట్టి మంచివాడయియుంటాడని రూప అనుకొంటోంది. అయితే యెల్లకాలమూ అతను పేదవాడుగా వుండడం యిష్టంలేదు. ధనికులు దుర్మార్గులని అంగీకరిస్తూనే ఆ ధనికులు కావడమే తమ లక్ష్యంగా కానున్న ఆ దంపతులు భావిస్తున్నారు.

నిన్నటి రోజున రూప యింట్లో పరోక్షంగా ఇలాంటి పెళ్ళి ప్రసక్తి తీసుకువచ్చింది. ఇంట్లో ఒక్కరు కూడా యీ పెళ్ళికి అనుమతించేలా కనబడలేదు. తండ్రి, తల్లి, అన్న—అందరూ పేదవాళ్ళను బాగా అసహ్యించుకుంటున్నారు. తను చంద్రశేఖరాన్ని పెళ్ళి చేసుకోవాలనుకుంటే యిల్లు వదిలిపెట్టి అతనితో వెళ్ళిపోవాలి. అంతకు మించి వేరే దారిలేదు.

ఇప్పుడు రూపకు యేమీ పాలుపోవడంలేదు. ఆమె త్రికరణశుద్ధిగా అతన్ని ప్రేమిస్తోంది. అతను లేని జీవితాన్ని ఊహించుకోలేక భయపడుతోంది. ఇందుకు ఏదో దారి చంద్రశేఖరమే చూపించాలి.అతనే తనకు ధైర్యాన్ని ప్రసాదించాలి.

అతనికోసం ఎదురుచూస్తూ మాటిమాటికీ వాచీ చూసుకుంటోంది రూప.

సాధారణంగా రోజూ కలుసుకొనే టైముకి అర్ధగంట ఆలస్యంగా వచ్చాడు చంద్రశేఖరం.

"అమ్మయ్య, వచ్చావా?—అసలు రావేమోనను కున్నాను—" అంది రూప అతన్ని పలకరిస్తూ.

"అనుకోని ఆలశ్యమైంది. వచ్చినట్టే వచ్చి ఓ ఆఫర్ ఎగిరిపోయింది—" అన్నాడు చంద్రశేఖరం. అతని కళ్ళలో నిరుత్సాహం కొట్టొచ్చినట్లు కనబడింది.

"ఏమిటది?"

"ఒకతను నన్ను చూసి చాలా ఇంప్రెస్ అయ్యాడు. కానీ...."

"ఎవరతను? వివరంగా చెప్పు...."

"ఈ ఊళ్ళోనే ఓ చిన్న ఇంటర్వ్యూకి వెళ్ళాను. ఇంటర్వ్యూల కెళ్ళడం బాగా అలవాటైంది కాబట్టి ధైర్యంగా జవాబులిచ్చాను. నాకు ఉద్యోగం రాలేదని అక్కడే చెప్పేశారు కానీ ఇంటర్వ్యూ బోర్డులో ఉన్న ఒకతను—ఇంటర్వ్యూ కాగానే బయటకు వచ్చి నన్ను పలకరించి—'నీ సమాధానాలు నాకు నచ్చాయి. నీ అరవ తెలుగు కూడా బాగున్నాయి. నేను కొత్తగా వ్యాపారం ప్రారంభిద్దామనుకొంటున్నాను. అది నీ వల్లనే అవుతుందనిపిస్తోంది. సరిగ్గా నాలుగ్గంటలకి కనబడు—' అన్నాడు.

అతను చెప్పినట్లుగానే నాలుగ్గంటలకు కలుసుకున్నాను. అతను నాతో కాసేపు మార్కెట్లో కొన్ని వస్తువులకున్న డిమాండూ, ప్రస్తుతం ఉన్న సరఫరా—వగైరాల గురించి చర్చించి నా వ్యక్తిగత విషయాల గురించి అడిగాడు. చెప్పాను. పెళ్ళయిందా అనడిగాడు. లేదన్నాను. ఇప్పట్లో చేసుకోవద్దన్నాడు. నేను వెంటనే మన ప్రేమ విషయం చెప్పాను. నీ పేరు వింటూనే ఎందుకో ఉలిక్కిపడ్డాడు. మరి కొన్ని వివరా లడిగాడు.

అన్నీ విని—"రూప నాకు తెలుసు. ఆమె ప్రేమను పొందిన నువ్వు చాలా అదృష్టవంతుడివి. అయితే నేను వెతుకుతున్న వ్యక్తివి నువ్వుకాదు. నా వ్యాపారంలో అడుగిడబోయేవాడు కనీసం నాలుగైదేళ్ళవరకూ పెళ్ళి గురించి ఆలోచించకూడదు. కాబట్టి అయాం సారీ" అన్నాడు.

వెంటనే నేనూ నిరుత్సాహంగా లేచి నిలబడ్డాను. "అయితే పెళ్ళికే ప్రాముఖ్యత నిచ్చి వెళ్ళిపోవడానికి నిశ్చయించుకున్నావన్నమాట. నీ ఖర్మ! ఇంకా కొద్దిరోజుల గడువు అడిగి మళ్ళీ ఆలోచించుకు వస్తావేమో నను కున్నాను—" అన్నాడతను. అనగానే మొహమాటం వేసి—"గడువు లేదేమోననుకున్నాను! ఓ వారంరోజులు గడువు యివ్వండి, మిమ్మల్ని మళ్ళీ కలుసుకుంటాను" అని చెప్పి యిలా వచ్చేశాను. అందుకే ఆలశ్యమైంది—" అన్నాడు చంద్రశేఖరం.

"అయితే యేం నిర్ణయించుకున్నావ్?" అంది రూప కంగారుగా.

"నిన్ను కాదని నేనేం నిర్ణయించుకోగలను? అంతా నీ యిష్టం!" అన్నాడు చంద్రశేఖరం.

రూప ఆలోచించింది. ఇందుకు తానంగీకరిస్తే మరో నాలుగైదేళ్ళపాటు వివాహం జరుగదు. అంతకాలం తన వివాహం ఆగదు. ఇంట్లోవాళ్ళని అంతకాలం ఆపడం కష్టం. అలాగని ఇప్పుడు చంద్రశేఖరాన్ని పెళ్ళాడితే తన కాళ్ళమీద తను నిలబడే అవకాశం అతనికి పోతుంది. మళ్ళీ యిలాంటి అవకాశం అతనికి వస్తుందో, రాదో....!

"ఇంతకీ నీకిలాంటి అవకాశమిస్తానన్న ఆ పెద్దమనిషి ఎవరు?"

చంద్రశేఖరం పేరు చెప్పలేదు—"సమయం వచ్చినప్పుడెలాగూ తెలుస్తుంది. అతను తన పేరు ఎక్కడా చెప్పొద్దన్నాడు. నీకు చెప్పకూడని రహస్యం కాదుగానీ నీక్కూడా చెప్పకుండా ఉన్నప్పుడేకదా—నా నిజాయితీ బయటపడేది!" అన్నాడు.

ఆ పేరు గురించి రూప నొక్కించలేదు. ఆమె ఆలోచనలన్నీ వేరే ఉన్నాయి. వాటిలో పూర్తిగా తన భావి జీవితం మెదుల్తోంది. ఇప్పుడేం చేయాలి?

ఇంట్లో పరిస్థితుల్ని ఆమె అతనికి వివరించి చెప్పింది.

చంద్రశేఖరం మొహం పాలిపోయింది.

"ఏ ఆధారమూ లేనివాణ్ని నిన్ను నా పేదరికంలోకి యెలా ఆహ్వానించను? నీకు కొన్ని కనీసపు సౌకర్యాలన్నా కూర్చగల స్థాయికి చేరుకొంటే తప్ప మన పెళ్ళి జరగదు—" అన్నాడు చంద్రశేఖరం.

"నీకొక బంగారంలాంటి అవకాశం వచ్చింది. నా కారణంగా నీకు అది పోతే—అంతకంటే ఉచ్చదశకు వెళ్ళగల స్థితి యేర్పడాలి. అలా జరిగితేనే నాకూ తృప్తిగా ఉంటుంది. నేను నిన్ను మనసారా ప్రేమించాను. నువ్వు లేకుండా నా ముందు జీవితం చీకటిమయంగా కనబడుతుంది. నీకోసం నేనూ యేదో వొక యేర్పాటు చేయాలి గదా—అందుకు నాకు కొంత వ్యవధి కావాలి. ఎంతో వద్దులే—వారం రోజులలోపే!" అంది రూప.

"నువ్వు నాగురించి ఆలోచిస్తున్నావు. నేను నీగురించి ఆలోచిస్తున్నాను. మనిద్దరికీ దంపతులుగా సుఖపడే రాత

నిజంగా ఉంటుందో లేదో తెలియదు—" అన్నాడు చంద్రశేఖరం బాధగా.

"అలా నిరుత్సాహపడకు—" అంది రూప. కానీ ఆమెకూడా కాస్త నిరుత్సాహంగానే ఉంది.

## 3

"హలో!" అంది రూప.

"నేను—కృష్ణారావుని మాట్లాడుతున్నాను—" అంది అవతలి కంఠం.

"నువ్వా?" అంది రూప.

"అవును. నేనే. కంగారుపడి ఫోన్ పెట్టేసేయకు. చాలా ముఖ్యమైన విశేషం చెప్పాలి నీకు—"

"చెప్పేసేయ్ త్వరగా. అవతల నాకు చాలా పెద్ద పనుంది—" అసహనంగా అంది రూప.

"ఎంత పెద్ద పనున్నా సరే నువ్వు కాస్త సహనం చూపక తప్పదు. ఇది నీ జీవితానికి సంబంధించిన విషయం" అన్నాడు కృష్ణారావు.

"సరే వింటున్నాను—చెప్పు—"

"ఇది ఫోన్‌లో చెప్పే విషయంకాదు. స్వయంగా చెప్పాలి—" అన్నాడు కృష్ణారావు.

"ఎలా కుదుర్తుంది? ఇప్పుడు మనమున్నది ఫోన్ దగ్గర—"

"నీ వెటకారం అర్ధమయిందిలే—ఫోన్‌లో తప్ప నాతో స్వయంగా మాట్లాడే తీరిక లేదంటావ్? అయినా ఫరవాలేదు. అంతగా ఫోన్ దగ్గరే మాట్లాడాలనుకుంటే నేనిప్పుడే మీ యింటికి బయల్దేరి వస్తున్నాను. నా మాటలు లెక్కచేయక నిర్లక్ష్యంగా వెళ్ళిపోయావా చాలా విచారించవలసిన విషయం జరుగుతుంది. అందుకని

అలాంటి పని మాత్రం చేయకు—" అంటూ అవతల అతను ఫోన్ పెట్టేశాడు.

రూప ఫోన్ పెట్టేసి అసహనంగా అటూ యిటూ కదిలి అక్కడున్న సోఫాలో కూర్చుంది.

కృష్ణారావు తన్ను ప్రేమించాడు. కృష్ణారావంటే యింట్లోవాళ్ళందరికీ ఇష్టం. అందుకు కారణాలు వివరించ క్కర్లేదు. కృష్ణారావు తనకు మంచి జోడీ. పైగా బోలెడు డబ్బూ, సంఘంలో ప్రతిష్ఠా ఉన్నవాడు.

కానీ తను అతన్ని నిరాకరించింది. అతనిలో తనకు నచ్చే లక్షణాలు లేవు. ఆడది అతనికి విలాసవస్తువు. అతను క్లబ్బులకు వెళ్ళి కేబరే డాన్సులు చూసివస్తాడు. సిగ్గులేకుండా ఆ వివరాలు తనకు చెప్పబోతాడు. తను వినదు. అవన్నా అవి చూసేవాళ్ళన్నా తనకు అసహ్యమని చెప్పింది. నీకోసం అవన్నీ వదిలేస్తానన్నాడు. ఆ మాటలు నమ్మకర్లేదు. ఒకసారి పెళ్ళయ్యాక తను అతనికీ, అతని డబ్బుకూ, పేరు ప్రతిష్ఠలకూ బానిస. అతనిపై తనకు అదుపుండదు.

తను కోరుకునే జీవితం వేరు. తన వ్యక్తిత్వాన్ని నిలుపు కుంటూ—సినిమాలోని హీరోహీరోయిన్ లలా గడపా లని ఉంటుంది తనకు. పేదవాళ్ళయితే అలా ఉండగల రన్న ఆమె అనుమానం క్రమంగా నమ్మకంగా మారి పోయింది. ఇప్పుడు చంద్రశేఖరాన్ని ప్రేమిస్తోంది కాబట్టి అన్ని సమస్యలూ తీరిపోయాయి.

ఇంట్లోవాళ్ళకి బుద్ధిలేదు. ఆ కష్ణారావునింకా ఇంటికి రానిస్తున్నారు. అతను తనకోసమే వస్తాడు. ఇష్టం లేక పోయినా కాసేపు మాట్లాడి వెడతాడు.

ఏమి చెబుతాడో అన్న కుతూహలంకొద్దీ రూప యింట్లో అతనికోసం యెదురుచూసింది.

కృష్ణారావు వచ్చి—"ఫోన్ దగ్గరే మనం కలుసుకుంటున్నాం. ఓ. కే—" అన్నాడు.

రూప టైము చూసుకుని "త్వరగా చెప్పు" అంది.

"నువు నన్ను పెళ్ళిచేసుకోవాలి" అన్నాడు కృష్ణారావు వెంటనే.

"అది ఈ జన్మకు జరగదు" అంది రూప తడుముకోకుండా.

"అయితే వెంటనే నువ్వు రెండోజన్మ ఎత్తాల్సుంటుంది."

"అంటే?"

"సరిగ్గా వారంరోజులు గడువిస్తున్నాను. ఆ వారం రోజుల్లో నీ నిర్ణయం మారకపోతే ఈ జన్మ యిప్పటికి చాలిస్తావు" అన్నాడు కృష్ణారావు.

"నా చావు పుట్టుకలు నీ చేతుల్లో వున్నట్లు మాట్లాడుతున్నావ్" అంది రూప కోపంగా.

"నా చేతుల్లోనే వున్నాయి మరి. ఈ జన్మలో పుట్టుకకు కారణం నేనుకాదు. కానీ నీ చావుకు మాత్రం నేను ఏర్పాట్లు చేస్తున్నాను. ఏర్పాట్లు చాలా పకడ్బందీగా జరుగుతున్నాయి. నిన్నెవరు చంపారో, ఎందుకు చంపారో ఎవ్వరికీ తెలియదు. ఆ విధంగా నువ్వు తనువు చాలిస్తే అప్పుడు నా కోసం నువ్వింకో జన్మ ఎత్తాలిగదా! ఆ విధంగా నీ పుట్టుకకు కూడా నేను కారణమవుతాను" అన్నాడు కృష్ణారావు.

"నేను మళ్ళీ పుడితే పెరిగి పెద్దయ్యేసరికి ముసలాడివై పోతావ్" అని నవ్వింది రూప.

"ఆ లెక్కలన్నీ చూసుకున్నాను. ఇప్పుడు నాకు పాతికేళ్ళు. నువ్వు చచ్చేది వారం రోజుల్లోనే కదా— అంటే నువ్వు మళ్ళీ పుట్టి పదిహేనేళ్ళ దానివయ్యేసరికి నలభైఏళ్ళవాడినౌతాను నేను. ఈ రోజుల్లో పెళ్ళికి అదో పెద్దవయస్సు కాదు. ఎన్టీరామారావు శ్రీదేవితో వేస్తే విరగబడి చూసే ఈ జనం-మన జంటని తప్పక అభినందిస్తారు. అంతవరకూ నేను పెళ్ళి చేసుకోకుండా కేబరే డ్యాన్సర్లతో సరిపెట్టుకుంటాను" అన్నాడు కృష్ణారావు.

రూప అతని వంక చూసింది. అతని ముఖం చాలా సీరియస్‌గా వుంది.

"ఇదేం ప్రేమ? పెళ్ళి చేసుకోకపోతే చంపేస్తావా?" అంది రూప.

"నా ప్రేమ అలాగే వుంటుంది. ఇది చెప్పడానికే వచ్చాను. అవతల నీకు చాలా అర్జంటు పనులున్నాయి కాబోలు వెళ్ళు. నేనూ వస్తాను" అంటూ వెళ్ళిపోయాడు కృష్ణారావు.

అతను వెళ్ళిపోగానే వాచీ చూసుకుంది రూప. పదకొండో తేదీ చూపిస్తోంది వాచీ. అంటే సరిగ్గా పద్దెనిమిదో తేదీనాటికి తను కృష్ణారావుని పెళ్ళి చేసుకుందుకు నిర్ణయించుకోకపోతే ప్రాణాలు కోల్పోతోంది. అందుకు ఏర్పాట్లు జరుగుతున్నాయంటున్నాడు. నిజమా? అయితే అవి ఎలాంటి ఏర్పాట్లు?

## 4

"ఇప్పుడింకో కొత్తసమస్య వచ్చిపడింది—" అంది రూప.

"ఏమిటది?" అన్నాడు చంద్రశేఖరం.

రూప, కృష్ణారావు గురించి చెప్పింది.

కృష్ణారావు పేరు వింటూనే చంద్రశేఖరం భయ పడ్డాడు "అతను నాకు తెలుసు. చాలా ప్రమాదకరమైన మనిషి!"

"అందుకే అతనంటే నేనిష్టపడలేదు. ఇప్పుడు నీకూ నాకూ వారంరోజుల గడువొచ్చింది. ఆలోచించుకునే టందుకు టయింలేదు. ఇంతవరకూ మన వ్యవహారం ఎవ్వరికీ తెలియకుండా రహస్యంగా వుంచగలిగాను. అది ఏ మాత్రం బయటపడినా నా పెళ్ళి బలవంతంగా కృష్ణా రావుతో జరిగిపోతుంది. నేను నీలాంటి పేదవాణ్ణి చేసు కుందుకు సిద్ధపడితే యింతకాలం మా యింట్లో నాపైన వున్న గౌరవం పోతుంది. నా ఇష్టాన్ని లక్ష్యపెట్టడం మానేస్తారు!" అంది రూప.

"అయితే ఏంచేద్దాం?"

"చేయడానికేమీ లేదు. మనిద్దరం కలిసి యీ ఊరు విడిచి పెట్టేసి మరెక్కడికైనా వెళ్ళి పెళ్ళి చేసేసు కుందాం" అంది రూప.

ఇబ్బందిగా మొహంపెట్టాడు చంద్రశేఖరం "అప్పుడు అటు కృష్ణారావూ, ఇటు మీ నాన్నా కలిసి వేటాడి మనిద్దర్నీ చంపేస్తారు."

"అలాంటి ప్రమాదమేమీ వుండదు. మనం కాస్త ధైర్యం వహించాలి. అంతే! ఒకసారి మన పెళ్ళి జరిగాక చూస్తూ చూస్తూ మా నాన్న మనని కాదనలేడు. అంతగా అయితే నేను తన కూతుర్ని కాదంటాడు తప్పితే వేటాడ లేడు. ఎటొచ్చీ కృష్ణారావు కాస్త ప్రమాదకరమైన మనిషి. నన్నుచంపడానికిప్రయత్నాలారంభించానన్నాడు.

ఏవో ఏర్పాట్లు చేశానన్నాడు. అవేమిటో తెలియదు. ఆ మాటల్లో నిజమెంతుందో తెలియదు. కొంతకాలం ఆచూకీ దొరక్కుండా జాగ్రత్తపడితే ఆ వేడి అదే చల్లారుంది" అంది రూప.

"సరే మనం ఇల్లు వదిలిపెట్టాం. ఎక్కడికని వెళ్తాం. ఎక్కడికో అక్కడికి వెళ్ళామనుకో-ఎలా బ్రతుకుతాం?" అన్నాడు చంద్రశేఖరం బాధగా.

"నువ్వు మగాడివి. నిన్ను నమ్ముకుని తనవాళ్ళందర్నీ వదులుకుని వస్తున్న ఆడదానికా మాత్రం ఆసరా యివ్వలేవా?" అంది రూప నొచ్చుకుంటూ.

చంద్రశేఖరం తడబడలేదు "నేను నిన్నెంతగా ప్రేమించానో, ప్రేమిస్తున్నానో నీకర్థం కాదు. నా బాధ నీకర్థం కానిది. ఎండ కన్నెరుగని సుకుమారివి. ధనవంతుల అల్లారు ముద్దుబిడ్డవు. అలాంటి నిన్ను నడివీధిలో నిలబెట్టే స్థితికి తీసుకురాలేను. నిన్ను చూసుకునేందుకు ఒక కనీసపు స్థాయి వుంది. ఆ స్థాయికి ఆరంభంలో ఓ గవర్నమెంటు ఉద్యోగమైనా వుండాలి. ఒకటి రెండు లక్షల రూపాయల క్యాష్ అయినా వుండాలి. ఈ రెండింట్లో యేదో ఒకటి లేకుండా నేను నిన్ను పెళ్ళిచేసుకోవడం కల్ల—"

"ఆ కారణంగా నేను నీకు శాశ్వతంగా దూరమైతే!" అంది రూప.

"నువ్వు సుఖంగా వుండమే నాక్కావలసింది. నీ సుఖంకోసం నీకు దూరమైనా బాధపడను. కానీ నిన్ను నా జీవితంలోకి ఆహ్వానించి బాధలకు గురిచేయలేను" అన్నాడు చంద్రశేఖరం విచారంగా.

"నీతోడి నరకమైనా నాకు స్వర్గమే! నీకు దూరంగా

వుంటే సుఖమనే పదం నన్ను దరిచేరడం అసాధ్యం" అంది రూప ఆవేశంగా.

"ఆవేశాలు తాత్కాలికం రూపా! ఈ రోజున్న ఈ ఆవేశం రేపుండదు. మన ముందున్నది నూరేళ్ళ జీవితం. వేసే ప్రతి అడుగూ చాలా ఆలోచించి వేయాలి!"అన్నాడు చంద్రశేఖరం.

"అయితే మన పెళ్ళి జరగదా?" అంది రూప.

"ఎందుకు జరగదు? నాలుగైదు రోజుల్లో ఒకటి రెండు లక్షలు సంపాదించగలగాలి. అందుకు నా శాయశక్తులా ప్రయత్నిస్తాను...." అన్నాడు చంద్రశేఖరం.

"అంత తక్కువ వ్యవధిలో అంత డబ్బు ఎలా కూడ బెట్టగలవు? నిజంగా కూడబెట్టగలిగే శక్తి వుంటే నన్ను పెళ్ళి చేసుకున్నాక మాత్రం అదెందుకు సాధ్యపడదు?" అంది రూప.

"నీకు తెలియదు రూపా! ఇప్పుడున్న విల్ పవర్ (Will power) అప్పుడుండదు. ఏంచేసినా పెళ్ళికి ముందే చేయాలి" అన్నాడు చంద్రశేఖరం.

"నీ మాటలు నిజమే-ఈ విషయమై నేనూ ఏదో ఒకటి చేయాలి. ఈ పెళ్ళికోసం నేను ఏమైనా చేయగలను. నా ప్రయత్నాలు నేను చేస్తాను. నీ ప్రయత్నాలు నువ్వు చేయి. కాస్త ఆ కృష్ణారావును కనిపెట్టివుండు. అతను నా గురించి ఎటువంటి ఏర్పాట్లు చేస్తాడోనని భయంగా వుంది" అంది రూప.

# 5

జ్యోతిష్కుడి వద్ద జనం చాలామంది వున్నారు.

"చాలా సేపట్నించిక్కడ ఉన్నావు. నీ చేయి

చూపించు నాయనా!" అన్నాడు జ్యోతిష్కుడు సాదరంగా.

అయితే అతను చేయి చూపించలేదు "నేను మీతో ప్రత్యేకంగా మాట్లాడాల్సి వుంది. అందరి పనీ అయిపోనివ్వండి" అన్నాడు.

జ్యోతిష్కుడివద్ద జనం పూర్తికావడానికి రెండు గంటలు పట్టింది. అంతసేపూ అతను ఓపికగా ఎదురు చూస్తూనే వున్నాడు.

జ్యోతిష్కుడు సాదరంగా అతనివంక చూసి "ఇప్పుడు చెప్పు నాయనా" అన్నాడు.

"హస్తసాముద్రికం నమ్మదగ్గదే నంటారా" అన్నాడతను.

ఈ ప్రశ్నకు జ్యోతిష్కుడులిక్కిపడ్డాడు. అతను తనకు సంబంధించిన చిక్కులేవో అడుగుతాడని అనుకున్న జ్యోతిష్కుడి అంచనా తారుమారైంది.

"నమ్మదగ్గది కాదని నీకు అనుమానుమా?"

"ఊఁ" అన్నాడతను.

"ఎందుకు?"

"మనిషి భవిష్యత్తు అతడి చేతిలోని రేఖల్లో ఎందుకుంటుంది?" అన్నాడతను.

జ్యోతిష్కుడు నవ్వి "ఈ ప్రపంచంలో ఎన్నో వస్తు విషయ నిర్ణయాలు లక్షణాలపై ఆధారపడి వుంటున్నాయి. మామిడిపండు ఆకు పచ్చగా వుంటే పచ్చిది. పసుపురంగులోకి మారితే పండు. మనిషిజుట్టు నల్లగా వుంటే పడుచువాడు. తెల్లబడితే ముసలివాడు. అలాగని ఆకు పచ్చగావుండే మామిడిపండ్లు లేకపోలేదు. పడుచు దనంలోనే జుట్టు నెరసినవాళ్ళు వుండకపోరు. అంత

మాత్రాన తెల్లజుట్టు ముసలితనానికి చిహ్నం కాదని అన లేము. కొందరు మహానుభావులు ప్రపంచంలోని ఎందరో మనుషుల హస్తరేఖలను గమనించి వాటి విశేషాలను తెలుసుకోగలిగారు. అవి చాలావరకూ నిజాలేనని నా అనుభవం చెబుతోంది. మనిషి స్వభావానికీ, భవిష్యత్తుకూ ఎంతో సంబంధముంది. హస్తరేఖలు మనిషి స్వభావాన్ని ప్రతిబింబింప జేస్తాయి. ఏదీ నీ చేయి జాపు!" అన్నాడు జ్యోతిష్కుడు.

అతని కళ్ళలో సంతృప్తి కనబడింది. అప్రయత్నంగా తన చేయి జాపాడు.

"ఆహా ఏమి హస్తం, దివ్య హస్తం!" అన్నాడు జ్యోతిష్కుడు.

అతని కళ్ళు వెలిగాయి. ఆత్రుతగా జ్యోతిష్కుడి వంకే చూశాడు. జ్యోతిష్కుడు అది గమనించి అదేపనిగా అతడి అదృష్టాన్నీ, భవిష్యత్తునూ పొగడసాగాడు.

కాసేపు విన్నాక అతనికి విసుగుపుట్టింది. "నేను మీకు చేయి చూపించినది ఒక ముఖ్యవిషయం తెలుసుకుందుకు! అది మీరింతవరకూ చెప్పలేదు" అన్నాడు.

జ్యోతిష్కుడు తడుముకోకుండా "నేను నీ రేఖలు చూసి లక్షణాలు చెపుతున్నాను. నీ మనసులోని మాట చెప్పడంలేదు. అదేమిటో అడుగు, చేయి చూసి చెబుతాను" అన్నాడు.

అతను తటపటాయిస్తూ "నా చేతిలో దుష్టత్వాన్ని సూచించే రేఖలేమైనా కనబడుతున్నాయేమో చూడండి" అన్నాడు.

జ్యోతిష్కుడు శ్రద్ధగా చేతిని పరిశీలించి "దుష్టత్వమని చెప్పలేను కానీ పెకిపోవడానికి నువ్వు నలుగురూ

అనుసరించని దార్లు అనుసరిస్తావు. నీకు మంచి తెలివి తేటలు, తెగువ వున్నాయి. కోరికలున్నాయి. రాజకీయ వాదులు అవినీతి, ఉద్యోగుల లంచాలు దుష్టత్వం అని పించుకుంటే నీలోనూ దుష్టత్వాన్ని చూపిస్తున్నాయ్ కొన్ని రేఖలు" అన్నాడు.

అతని ముఖంలో సంతృప్తి కనబడి అసానే భయం ఆక్రమించుకుంది "శ్రద్ధగా చూడండి దుష్టత్వమంటే నా ఉద్దేశ్యం అదికాదు. నా స్వంత ప్రయోజనంకోసం గానీ, మరేకారణం చేతగానీ నేను ఇంకొకరి ప్రాణాలు తీయ గలనా? ఆ శక్తి నాలో వుందా? నేను హత్య చేస్తానన్న సూచనను నా చేయి చూపుతోందా?" అన్నాడు కంగారుగా.

జ్యోతిష్కుడి ముఖంలో కూడా భయం కనబడింది. మనిషి కొద్దిగా వణికాడు కూడా. మరోసారి జేయి పరీ క్షించి "నువ్వు హంతకుడివి కావు. నీ చేయి ఈ విష యాన్ని నిరూపిస్తోంది" అన్నాడు.

"అబద్ధమాడకూడదు" అన్నాడతను.

"నేను రేఖలు చూసి చెబుతున్నాను. ఇందులో అబద్ధం ప్రసక్తిలేదు" అన్నాడు జ్యోతిష్కుడు హుందాగా.

"అయితే వినండి. నాకు ఇలాంటి జ్యోతిష్కుల మీద నమ్మకంలేదు. ఒక బలహీనమైన క్షణంలో మీ దగ్గరకు వచ్చాను. ఎందుకో మీ మాటలు నాలో నమ్మకం కలి గిస్తున్నాయి. మీకు నా ధన్యవాదాలు. ప్రస్తుతానికి ఈ పదిరూపాయలూ వుంచండి. మీరు చెప్పింది నిజమైతే మళ్ళీ మీ వద్దకు వచ్చి నూటపదహార్లు చదివించుకుంటాను. మీరు చెప్పింది అబద్ధమైతే మాత్రం నేను చేసే రెండవ హత్య మిమ్మల్నే!" అన్నాడతను.

జ్యోతిష్కుడి వేళ్ళు పదిరూపాయలను అందుకుంటూ వణికిపోయాయి.

అతను ఆ విషయం పట్టించుకోకుండా అక్కణ్నించి కదిలి "గడువు దగ్గర పడుతోంది. హత్య చేయకుండా ఆ మనిషిని నేనెలా చంపగలుగుతాను? ఆ మనిషిని చంపి తీరాలన్న నా బాస్ నిర్ణయం మారుతుందా?" అని తనలో తానే గొణుకున్నాడు.

## 6

రెండ్రోజుల్నించి రూప ఇంట్లో శ్రద్ధగా తండ్రినునుస రించి తిరుగుతోంది. ఆయన వ్యవహారాలను కనిపెడుతోంది. డబ్బెక్కడుంటుందీ, నగలెక్కడుంటాయీ, తాళాలెక్కడుంటాయీ మొదలైన విషయాలన్నీ అంచనా వేసుకుని రెండులక్షలు కూడబెట్టడానికి తను యేమేం తీయాల్సివుంటుందో లెక్కవేస్తోంది.

ఇంట్లో దొంగతనం చేసి డబ్బు పట్టుకుపోవాలని ఆమె అనుకుంది.

ఆమె ఈ నిర్ణయానికి ఒకేఒక్క కారణం. అది చంద్రశేఖరం పైన ప్రేమ.

చంద్రశేఖరం అసహాయుడని ఆమెకు తెలుసు. మెహర్బానీకి పైకి ఏదో కబుర్లు చెప్పినా డబ్బు సంపాదించడం అతనివల్ల కాదని ఆమెకు తెలుసును. డబ్బు సంపాదించడం తనవల్లనే కావాలి. తనకూ వేరే దారి లేదు. ఇంట్లో దొంగతనం చేయాలి.

రూప ఇంట్లో తరతరాలుగా వస్తున్న బంగారు నగలున్నాయి. వాటి ఖరీదు ఆరేడు లక్షలకు తగ్గదని ఇంట్లో అంచనా. ఏ పరిస్థితుల్లోనూ యింట్లోవాళ్ళు వాటిని

వాడరు. గొప్పగొప్ప అతిథులు వచ్చినప్పుడు మాత్రం వాటిని చూపిస్తూంటారు. సాధారణంగా సంవత్సరానికి రెండు మూడుసార్లకు మించి వాటిని చూడడం కూడా జరుగదు. అవి ఇనప్పెట్టెలో భద్రంగా వుంటాయి.

వాటిని తీసుకువెళ్ళి చంద్రశేఖరానికివ్వాలని రూప నిర్ణయించుకుంది. అవి కాక రూపకున్న నగలవిలువ వేరే అరవై వేల వరకూ వుంటుంది. ఆ నగలు రూప కస్టడీలోనే వున్నాయి. పాతనగల్లో కొన్నీ, తన నగలూ కలిపితే చంద్రశేఖరం మంచి వ్యాపారాన్ని ప్రారంభించడానికి అవసరమైన డబ్బు సంపాదించవచ్చునని రూప అనుకుంది.

ఇనప్పెట్టె తండ్రి గదిలోనే వుంటుంది. ఆ గదిలో రాత్రి తల్లి, తండ్రి పడుకుంటారు. అందువల్ల రాత్రి దొంగతనం చేసే ప్రసక్తి లేనేలేదు. తాళాలు మంచానికున్న ఒక అరలో వుంటాయి.

దొంగతనం చేసే ఉద్దేశ్యంలో ఒక రోజల్లా రూప ఇంటిల్లపాదినీ గమనించింది. ఆ ప్రకారం ఉదయం పది కొండు గంటల ప్రాంతం దొంగతనానికి అనువైన వేళగా నిర్ణయించుకుంది. ఆ సమయంలో ఇంట్లో ఇంకెవ్వరూ వుండరు. తల్లి పూజలో వుంటుంది.

ఇనప్పెట్టె ఎలా తెరవాలో ఆ రహస్యాలన్నీ రూపకు తెలుసును. లేకపోతే ఆ ఇనప్పెట్టెకు బర్గ్లర్ అలారం కూడా వుంది.

తను నిర్ణయించుకున్న సమయానికి రూప దర్జాగా ఒక చిన్న సూట్ కేస్‌లో తండ్రి పడకగదిలోకి వెళ్ళింది. ఇనప్పెట్టె తెరిచి తనకు కావలసిన ఆ పాత నగలను రహస్యపుటరలోంచి తీసి సూట్ కేసులోకి మార్చింది.

మళ్ళీ ఇనప్పెట్టె మూసేసి తాళాలు యథాస్థానంలో పెట్టేసింది. ఈ పని చేస్తున్నంతసేపూ ఆమె విపరీతంగా వణికిపోతూనే వుంది. ఆదుపు చేసుకుందామని ఎంత ప్రయత్నించినా వణుకు తగ్గలేదు.

తనింట్లో తనే దొంగతనం చేసింది!

ఆ సూట్ కేసు తీసుకుని తన గదికెళ్ళింది. అప్పుడే తల్లి పెట్టిన కేక వినబడింది. సూట్ కేసును భద్రంగా దాచి తల్లి దగ్గరకు వెళ్ళింది. అప్పటికామె వణుకు అధికమైంది.

తల్లి ఆమెకు ఏదో పని పురమాయించబోయిందల్లా "అదేంటే అల్లా వణికిపోతున్నావ్" అంది.

తను వణకడం లేదని రూప ఇచ్చిన సమాధానం కూడా వణుకుతూనే వుంది.

తల్లి కంగారుగా "ఏమయిందే నీకు!" అంది.

రూపకు ఏం జవాబు చెప్పాలో తెలియలేదు. అలవాటులేని ఆ పని తనకు నరనరాలోంచీ వణుకు పుట్టిస్తోంది. చంద్రశేఖరంమీది ప్రేమలో ఆఖరికి తను దొంగతనం చేసేటంత నీచస్థితికి దిగజారిపోయింది. కాని ఈ దొంగతనం శాశ్వతం కాదు. వ్యాపారంలో తాము స్థిరపడ్డాక తాకట్టు పెట్టిన ఈ నగలన్నీ విడిపించి మళ్ళీ తెండ్రికిచ్చేస్తారు. అంతవరకూ అవమానం భరించక తప్పదు.

రూప కాస్త సర్దుకొని—"తన్ను పెళ్ళాడనన్నానని కోపం వచ్చి ఆ కృష్ణారావు నన్ను చంపడానికి యేర్పాట్లు చేస్తున్నానన్నాడు. ఆ గడువు దగ్గరకొచ్చే సరికి భయం వేసింది" అంది.

రూప తల్లి నవ్వి— "ఏడిసినట్లే వుంది—కృష్ణారావు నిన్నలా బెదిరిస్తానని మా అందరికి చెప్పే చేశాడు. అది మంచి సంబంధం. నువ్వో దానికి వస్తావన్న ఆశతో షే

పుతన్ని అలా చేయనిచ్చాం. ఈ మాత్రంపానికే ప్రాణ భయంతో వణికిపోవాలా? నా ప్రాణంలో ప్రాణానివి నువ్వు. నీకేదైనా కీడు రానిస్తానా?" అంది.

"అమ్మా—నన్నింతగా అభిమానిస్తున్నావు. నేను మీరు చెప్పిన సంబంధం కాదని పేదవాడిని కట్టుకుని యిల్లు వదిలిపెడితే—అప్పుడు కూడా ఇలా అభిమానించ గలవా?" అంది రూప.

"కన్నతల్లి ప్రేమ యేమిటో నువ్వూ ఓ బిడ్డ తల్లివైతే తెలుస్తుంది. నువ్వెక్కడున్నా నా అభిమానం అలాగే ఉంటుంది. ఎటొచ్చీ ఒకోసారి పరిస్థితులు అసహాయు రాల్ని చేస్తే నేనేం చేయలేను. నాకు తెలియకుండా ఎవ రైనా నీకన్యాయం తలపెడితే, అందుకు నువ్వు సహాక రిస్తే నేను నిన్నెలా కాపాడగలను?"

తల్లి మాటలు రూపకు అర్థంకాలేదు. అదే తల్లికి చెప్పింది.

"మేము చెప్పినవాణ్ని నువ్వు పెళ్ళి చేసుకున్నా వనుకో. నిన్ను కళ్ళల్లో వత్తులు వేసుకుని కాపాడుకో గలం. కానీ నీకు తెలిసినవాణ్ని, మాకు తెలియనివాణ్ని చేసుకున్నావనుకో. వాడు మంచివాడైతే ఫరవాలేదు. చెడ్డవాడైతే మేము చేయగలిగేదేమీ ఉండదు. అందుకే పెళ్ళికి పెద్దవాళ్ళమీద ఆధారపడాలి—"

"పెద్దలు చేసిన పెళ్ళిళ్లెలా ఏడుస్తున్నాయో నేనూ చూశాలే—" అని రూప అక్కణ్నించి కదిలింది. ఇప్పుడు తను అర్జంటుగా చంద్రశేఖరాన్ని కలుసుకొని మాట్లా డాలి.

అర్జంటు పనులకు చంద్రశేఖరం ఆమెకో ఫోన్ నంబ రిచ్చాడు. ఆ నెంబర్ చేసిందామె.

అదృష్టవశాత్తూ చంద్రశేఖరం వెంటనే దొరికాడు. లేకపోతే అతనికి మెసేజ్ యివ్వవలసి ఉండేది. చంద్రశేఖరం గొంతు వింటూనే ఆమె హుషారుగా—

"పార్కుకివచ్చేయ్. అర్జంటుగా నీతో మాట్లాడాలి—" అంది.

ఇద్దరూ పార్కులో కలుసుకొన్నారు.

"డబ్బు దొరికిందా?" అందామె.

"లేదు!" నీరసంగా అన్నాడు చంద్రశేఖరం.

"డబ్బు తేలిగ్గా దొరకదని నాకు తెలుసు. అందుకే నా ప్రయత్నాలు నేను చేశాను. యింక ధైర్యంగా ఉండు. మంచి ఆలోచన చెప్పు—" అంది రూప.

"డబ్బు నువ్వు తెస్తావా?" అన్నాడు చంద్రశేఖరం ఆశ్చర్యంగా.

"నీకోసం ఏమైనా తేగలను! ఏమైనా చేయగలను!!" అంది రూప.

"నిజంగా డబ్బు దొరికిందా?" అన్నాడు చంద్రశేఖరం యింకా ఆశ్చర్యాన్నుంచి కోలుకోకుండా.

"నీతో అబద్ధమాడ్డం నాకు సరదా అనుకున్నావా!" అంటూ రూప తను చేసిన పని వివరంగా చెప్పింది.

చంద్రశేఖరం రూపవంక ఆరాధనాపూర్వకంగా చూసి —"నీకు నామీద ఎంత ప్రేమ రూపా! ఈ ప్రేమకు నేను అర్హుణ్నో కానో కాలమే ఋజువు చేయాలి—" అన్నాడు.

"నీ అర్హతకు వేరే ఋజువులక్కర్లేదు. అది నేనే నాడో నిర్ణయించేశాను. ఇప్పుడు చర్చించాల్సిన విషయ మదికాదు. ముందు సంగతి చెప్పు—" అంది రూప.

ఇద్దరూ కలిసి కాసేపు ఆలోచించారు.

"రూపా! నువ్వు అనుమానించవలసిన పరిస్థితుల్లో ఇల్లు వదిలి పెట్టకూడదు. అలాగైతే మీ అమ్మా నాన్న లకు అనుమానం వస్తుంది. దూరప్రాంతం పోయి వివాహం చేసుకునేంత వ్యవధి నాకుండదు. ఈలోగా నేను యేం చేయాలో నిర్ణయించుకొంటాను—రేపు సాయంత్రం ఆరు గంటలకు అశోకా హోటల్ కి రా. రేపు ఫోన్ చేసి నేను యే రూం బుక్ చేసిందీ చెబుతాను. గది నీ పేరున బుక్ చేస్తాను. అందులోకి వెళ్ళి ఉండు. ఎనిమిది దాటేక నే నక్కడికి వస్తాను. వచ్చేముందు నా పేరు అశోక్ అని రిసెప్షనిస్టుకు చెబుతాను. అతను నీకు ఫోన్ చేసి నా పేరు చెబుతాడు. రమ్మను. ఇద్దరం అనుకున్న పథకం ప్రకారం అక్కణ్నించి యెగిరిపోదాం. నువ్వక్కడ నగలతో ఉంటావు. నేను మంచి తిరుగులేనిపథకంతో వస్తాను...." అన్నాడు చంద్రశేఖరం.

"అలాగే!" అంది రూప. ఎందుకో ఆమె శరీరం మళ్ళీ వణుకుతోంది.

# 7

స్నేహితురాలు శాంతను ఒప్పించగలిగింది రూప. ఆమె రూప యింటికి వచ్చి ఒక వారంరోజులపాటు తామంతా మహాబలిపురం ట్రిప్పు వేసుకున్నామనీ రూపను పంపించ మనీ అడిగింది. పర్మిషన్ ఫార్మాలిటీయే అని రూపకూ తెలుసు. సాక్ష్యం కోసం శాంతను ఇంటికి తీసుకువచ్చింది రూప.

శాంత, మరి నలుగురు అమ్మాయిలు కలిసి నిజంగానే మహాబలిపురం ట్రిప్పు వేసుకున్నారు. ప్రయాణం శాంత కారులో! ఎటొచ్చీ ఆ ట్రిప్పులో రూప వెళ్ళదు.

రూప—శాంతకు చాలా థాంక్స్ చెప్పుకొంది. తన కోసం మహాబలిపురం ట్రిప్పు నిజంగానే వేసుకుంది. నిజంగా వేసుకోని పక్షంలో తను చంద్రశేఖరంతో లేచి పోయినందుకు శాంతకు చెడ్డ పేరు వస్తుంది. ఆమే సహకరించిందంటారు. ఇప్పుడైతే—చివరిక్షణంలో అది రానని వెళ్ళి పోయిందని అబద్ధమాడవచ్చు. ఆవిధంగా శాంతకు చెడ్డ పేరు రాదు. వచ్చే దంతా రూపకు మాత్రమే వస్తుంది.

"మర్చిపోకు-ఆరయ్యేసరికల్లా మా ఇంట్లో ఉండాలి" గుర్తుచేసి మరీ వెళ్ళింది శాంత. ఆమె అలా గుర్తుచేయడం రూప తల్లి కూడా వింది. వినాలన్నదే శాంత ఉద్దేశ్యం.

"విష్యూ బెస్టాఫ్ లక్—...." అంది శాంత వెళ్ళి పోతూ.

"మళ్ళీ యెప్పుడు కలుస్తామో—" అంది కన్నీళ్ళొత్తుకుంటూ రూప.

శాంత నవ్వి వెళ్ళిపోయింది.

రూప ఇంట్లో వస్తూండగా టెలిఫోన్ మ్రోగింది. రూప తల్లి ఫోన్ తీసింది.

"ముప్పైమూడు!" అన్నాడవతలి వ్యక్తి.

"హలో యెవరు మాట్లాడుతూంట....!" అంది రూప తల్లి.

అవతల క్లిక్కుమంది.

"ఏమిటమ్మా—" అనడిగింది తల్లిని రూప.

ఆమె చెప్పి—"యెవడో పిచ్చి వెధవలా ఉన్నాడు" అంది.

అది అశోకా హోటల్లో తన పేరున బుక్ అయిన గది నెంబరని గ్రహించింది రూప. చంద్రశేఖరం చాలా

తెలివిగా వ్యవహరిస్తున్నాడని ఆమె సంతోషించింది. ఫోన్ దగ్గరకు తనను పిలవమంటే అనవసరపు టనుమానాలకు దారి తీయవచ్చు.

తప్పు చేసేటప్పుడు మనిషి చాలా జాగ్రత్తగా ఉండాలి. అందుకే చంద్రశేఖరం జాగ్రత్త పడుతున్నాడు. అయితే తాము చేస్తున్న తప్పేమిటి?

తప్పు కాకపోతే ఈ బెగురెందుకు?

ప్రేమించిన మనిషిని పెళ్ళాడ్డం తప్పుకాదు. తనింట్లో అది తప్పయింది. అందుకే ఆ తప్పుకోసం మరి కొన్ని తప్పులు చేయాల్సి వస్తోంది. ఈ తప్పులకు తనను తండ్రి క్షమిస్తాడో లేదో తెలీయదు. ఆ భగవంతుడి దృష్టిలో తను నేరస్థురాలు కాకపోతే అదే చాలు!

రూప ఆ రోజల్లా యింట్లో అసిమితంగా తిరిగింది. ఇంతకాలం తన దనుకున్న ఆ ఇంటితో తనకు ఋణం తీరిపోతోంది. మళ్ళీ ఆ యింట్లో అడుగుపెట్టే అవకాశం తనకు కలుగుతుందో కలగదో!

ఇంట్లోని అందరికీ తనపైన విపరీతమైన ప్రేమ వున్నదనీ - అందరు ప్రేమమూర్తులను వదులుకుని తను స్వార్థపూరితమైన ప్రేమకోసం యిల్లు వదిలిపెట్టడం న్యాయంకాదని ఆమెకు అనిపిస్తోంది.

అదే ఆమెకు ఆశ్చర్యంగాకూడా ఉంది.

నిన్నగాక మొన్న పరిచయమైన చంద్రశేఖరంకోసం తను జీవితంలో ఊహించని సాహసం చేస్తోంది. ఇందులో విశేష మేమిటి? అది వయసు బలమా?

సూట్ కేస్ తీసుకొని సాయంత్రం అయిదున్నరకు యిల్లు వదిలినప్పుడు రూపకు దుఃఖం ఆగలేదు. ఆమె

ఎందుకు యేడుస్తోందో అర్థంకాక తల్లి ఆశ్చర్యంగా చూసింది ఆమెవంక.

దుఃఖాన్ని దిగమింగుకుని పుట్టిల్లు వదిలిపెట్టిన కొత్త పెళ్ళికూతురిలా ఇల్లు కదిలింది రూప.

## 8

"బాస్ హత్య విషయంలో నీ నిర్ణయం మారలేదు కదూ!" అన్నాడతను.

"లేదు__గడువు కూడా పూర్తికావచ్చింది."

"అయితే వెడుతున్నాను...." అన్నాడతను నిస్పృహగా.

"వెళ్ళు. నీకు శుభమవుతుంది__" అన్నాడు బాస్.

"ఇకమీదనుంచి హత్యలే నాకు జరిగే శుభం!" అని అస్పష్టంగా గొణుక్కున్నాడతను.

"అయితే బయల్దేరుతున్నావా?"

"ఊఁ."

"అశోకా హోటల్ కేనని గుర్తుందా?"

"ఉంది__"

## 9

రూప వాచీ చూసుకుంది.

టైము ఎనిమిదయింది. ఆమె అసహనంగా అటూ ఇటూ పచార్లు చేస్తూ__"వస్తానన్న మనిషి అన్న టైముకు కాస్త ముందు వస్తే ఎంత బాగుండేది?" అనుకొంది.

ఆమె అటూ ఇటూ తిరుగుతుండగా గదిలో యేదో క్రిందపడ్డ చప్పుడు వినిపించింది. ఉలిక్కిపడి అటు చూసింది. మంచానికి దగ్గరగా ఉన్న టీపాయ్ పైన తను మంచినీళ్ళు తాగి ఉంచిన స్టీలుగ్లాసు క్రింద పడింది.

అది తనంతట తను క్రింద యిలా పడింది?

రూప ఓసారి పైకి చూసి వేగంగా తిరుగుతున్న ఫాన్ వంక చూసుకొని—"అది మరీ వేగంగా తిరుగుతూంటే—బల్లలే యెగిరిపోవాలి—గ్లాసేం లెక్క—?" అనుకొంది.

సరిగ్గా అప్పుడే గదిలోని యింటర్ కామ్ మ్రోగింది. ఆమె వెళ్ళి ఫోన్ తీసింది.

అంతా అనుకొన్నట్లే జరుగుతోంది. అశోక్ పేరు వినగానే ఆమె పంపించమని చెప్పింది.

ఫోన్ క్రింద పెట్టేసి గది తలుపులు తీసి ఓర వాకిలిగా ఉంచింది. తను వెళ్ళి మంచానికి పక్కగా ఉన్న సోఫా పైన కూర్చుని అడుగుల చప్పుడు కోసం యెదురు చూస్తోంది.

సరిగ్గా అయిదు నిముషాల్లో ఆమెకు గుమ్మందగ్గర అడుగుల చప్పుడు వినిపించింది.

రూప ఆత్రతగా గుమ్మంవైపే చూస్తోంది. ఆమె చూస్తూండగా ఒక వ్యక్తి మెరుపువేగంతో గదిలో ప్రవేశించి తలుపులు బోల్టు వేశాడు. అతను తనవైపు తిరగగానే రూప ఉలిక్కిపడింది.

అతను చంద్రశేఖరం కాదు! యెవరో గడ్డపు వ్యక్తి....!

"ఎవర్నువ్వు?" కంగారుగా లేచి నిలబడింది రూప.

అతను తాపీగా ఆమెను సమీపించి—"వెరీగుడ్! నువ్వు నన్ను గుర్తుపట్టలేదన్నమాట. అయితే వేషం బాగున్నట్లే లెక్క...." అన్నాడు.

ఆమె కంఠాన్ని గుర్తుపట్టి—"చంద్రశేఖరం....!" అంది.

అతను మారువేషాన్ని తొలగించి—"ఈ వేషంలో నేనూ, అబ్బాయి వేషంలో నువ్వూ ఇక్కణ్ణించి బయట పడతాం—ఇదిలా ఉంది మన ప్లాను—...." అన్నాడు.

"బాగుంది—" అంది రూప—"మన పథకం ఏమిటో వివరంగా పూర్తిగా చెప్పు—"

"చెబుతాను. ముందు నగలు చూపించు—"అన్నాడు చంద్రశేఖరం.

రూప సూట్ కేసు తెరిచింది. పైన పేర్చిన తన బట్టలు తీసింది. అడుగున ఉన్న ఆ నగలు చూసి అతను నోట మాట రాకుండా నిలబడిపోయాడు.

"అద్భుతం!" అన్న మాటలు అప్రయత్నంగా అతడి నోటమ్మట వచ్చాయి.

"తాకట్టు పెడితే రెండు లక్షలకు తక్కువ రాదు" అంది రూప.

"అమ్మితే?" అన్నాడు చంద్రశేఖరం.

"ఏ పరిస్థితుల్లోనూ ఇవి అమ్మడానికి వీల్లేదు. తరతరాలుగా మా ఇంట్లో ఉంటున్న నగలివి" అంది రూప.

"అబ్బే—ధర తెలుసుకొందుకు అడిగాను" అంటూ అతను రూపను దగ్గరగా తీసుకొన్నాడు. ఆమె అభ్యంతరం పెట్టలేదు. అతను ఆమె నడుముపై తన వ్రేళ్ళను తమాషాగా కదిలిస్తూ—"నాకోసం ఎంత సాహసం చేశావ్ రూపా!" అన్నాడు.

"నా సాహసం ఈ క్షణంలో ముగిసింది. ఇక ముందున్నదంతా నీ సాహసమే—" అంది రూప.

"అయితే నేను చేస్తున్న తొలిసాహసం ఇదిగో చూడు" అంటూ అతనామెను చటుక్కున తనవైపు తిప్పు

కుని బలంగా ముద్దుపెట్టుకున్నాడు. కొద్ది క్షణాలు మాత్రమే అతనికి సహకరించి చటుక్కున అతన్ని విడిపించుకుని "ఇలాంటి సాహసం ఎవరైనా చేస్తారు. నేను కోరినదది కాదు" అంది. అతని చిలిపితనానికి ఆమె బుగ్గలు యెరుపెక్కాయి. కళ్ళలో తొలిముద్దు సిగ్గులు స్పష్టంగా కనబడుతున్నాయి.

"నీ దగ్గర యిలాంటి సాహసం ఎవరు చేసినా వాళ్ళను నేను బ్రతకనివ్వను. ప్రస్తుతానికి నన్ను సాహసం చెయ్యనివ్వకపోతే నేను బ్రతకలేను" అన్నాడు చంద్రశేఖరం.

"మనకింకా పెళ్ళికాలేదు" అంది రూప.

"ఈ క్షణం నుంచీ మనం దంపతులం. గాంధర్వ వివాహం చేసుకుందాం" అన్నాడు చంద్రశేఖరం.

"గాంధర్వ వివాహం సంగతి తర్వాత చూద్దాం మన కార్యక్రమం సంగతి చెప్పు" అంది రూప.

"మన-అనకు. మనకింకా పెళ్ళి కాలేదు" అన్నాడు చంద్రశేఖరం చిరాగ్గా.

"మనం తల్చుకుంటే రేపే అవుతుంది మన పెళ్ళి" అంది రూప.

"రేపటిదాకా యెందుకు యిప్పుడే అవుతుంది. నేను తల్చుకున్నాను. ఇంక నువ్వే తల్చుకోవాలి!" అన్నాడు చంద్రశేఖరం.

"నువ్వు మన కార్యక్రమం గురించి మాట్లాడ్డంలేదు" అంది రూప విసుగ్గా.

"ఏం మాట్లాడను-నేను అన్నీ వివరంగా చెబితే నన్ను నువ్వు నమ్ముతావా అని భయంగా ఉంది" అన్నాడు చంద్రశేఖరం.

"ఇప్పుడు నువ్వు నమ్మకం గురించి ఆలోచిస్తున్నావా? ఏ నమ్మకమూ లేకుండానే నేను ఇంతదూరం వస్తానా?" అంది రూప.

"అది కాదు రూపా-ప్రస్తుతానికి నాకీ నగలిచ్చి కొంత కాలంపాటు మన పెళ్ళి వాయిదా వేయమన్నాననుకో. నువ్వు అంగీకరిస్తావా?" అడిగాడు చంద్రశేఖరం.

రూప ఉలిక్కిపడి "ఏమన్నావ్" అంది.

"ముందుగా డబ్బివ్వమన్నాననుకో నన్ను నువ్వు నమ్మ్తావా?" అన్నాడు చంద్రశేఖరం.

"దేనికైనా నిన్ను నమ్ముతాను. కానీ మన పెళ్ళి వాయిదా వెయ్యవలసిన అవసరమేమిటి?" అని కాస్త తీవ్రంగానే అడిగింది రూప.

"నాకు కొన్ని ఇబ్బందులున్నాయి రూపా!"

"ఏమిటివి?"

"నాకో మరదలుంది. అందంలో అది నీకు ఏమాత్రమూ తీసిపోదు. దానికి తల్లీ, తండ్రీ లేరు. మా ఇంట్లోనే మా పోషణలోనే వుంటోంది. నేను తనను పెళ్ళి చేసుకుంటా నని దాని ఆశ. మా అమ్మకూడా అలాగే అనుకుంటోంది" అని ఆగాడు చంద్రశేఖరం.

"అయితే?" అంది రూప కంగారుగా.

"నేనిప్పుడు నిన్ను పెళ్ళి చేసుకుంటే మనిద్దరికీ అపవాదు వస్తుంది. డబ్బుకోసం మరదలికి అన్యాయం చేశానని నాకూ, చేయించావని నీకూ చెడ్డ పేరు వస్తుంది. అటుపైన నీ తండ్రి పగ ఉండనేవుంది. వీటన్నింటినీ తప్పించుకోవడానికి ఒకేఒక్క ఉపాయముంది—" అని ఆగాడు చంద్రశేఖరం.

"ఏమిటది?" అంది రూప అనుమానంగా.

"నేను నా మరదలికి మంచి సంబంధం చూసి పెళ్ళి చేస్తాను. వ్యాపారం ప్రారంభించి ఓ ఏడాదిలోనే వృద్ధి లోకి వచ్చి నీ ఇంటికి వచ్చి ధైర్యంగానే నీ తండ్రికి మన ప్రేమవిషయం చెప్పి నిన్ను పెళ్ళి చేసుకుంటాను" అన్నాడు చంద్రశేఖరం.

రూప సూటిగా చంద్రశేఖరం కళ్ళలోకి చూసింది. అతనామెతో కళ్ళు కలపలేక తల వంచుకున్నాడు. ఒక్క క్షణంపాటు ఇద్దరిమధ్యా నిశ్శబ్దం రాజ్యమేలింది. రూప నెమ్మదిగా అంది "సరే అలాగే చేయి. నా డబ్బు అక్కర్లే కుండా ఓ ఏడాదిలో గొప్పవాణ్ని కాగలననుకుంటే నాక్కావలసినదేముంది? నీ కోసం తప్పక ఎలాగో అలాగ ఓ యేడాది ఆగగలను."

"నేననుకున్న పనులు ప్రారంభించడానికి నాకు నీ డబ్బు కావాలి" అన్నాడు చంద్రశేఖరం వెంటనే.

"రేపే నన్ను రిజిస్ట్రాఫీసులో పెళ్ళి చేసుకో. నా నగలు నీవే అవుతాయి" అంది రూప కూడా వెంటనే.

"చెప్పానుగా పెళ్ళి యేడాది వరకూ సాధ్యంకాదని."

"అయితే నగల విషయం ఏడ్దాదివరకూ మరచిపో" అంది రూప.

చంద్రశేఖరం ముఖం బాధగా అయిపోయింది. అతను దీనంగా రూప వంక చూసి "నువ్వు నన్ను నమ్మలేవన్న మాట!" అన్నాడు.

"ఎలా నమ్మగలను? నేను నగలు తీసుకొచ్చేవరకూ నీ మరదల కథ నాకు తెలియనేలేదు. పెళ్ళి కాకుండానే నీకు నగలిస్తే-యింకా ఎన్ని కథలు వినాల్సివుంటుందో" అంది రూప. ఆమె మాటల్లో విషాదం కనబడుతోంది. అదే భావం ముఖంలో స్పష్టంగా కనబడుతోంది.

"పరస్పరావగాహన లేకపోతే మన దాంపత్యజీవనం బాగుండదు" అన్నాడు చంద్రశేఖరం.

"నీ అభిప్రాయంతో నేను ఏకీభవిస్తున్నాను" అంది రూప.

రూప అలాగ నేసరికి ఏమనాలో తెలియలేదు చంద్రశేఖరానికి. అతడు భారంగా నిట్టూర్చి "ఆఖరికి మన ప్రేమ ఇలాగౌతుందనుకోలేదు" అన్నాడు.

"నేనూ అనుకోలేదు" అంది రూప.

"అయితే నగలు యివ్వనంటావ్" అన్నాడు చంద్రశేఖరం.

"ఇవ్వను" అంది రూప.

"ఒకవేళ నేను బలవంతంగా తీసుకువెడితే."

"పోలీసులు నిన్ను పట్టుకుంటారు" అంది రూప.

"ఊహూ౦" అని నిట్టూర్చాడు చంద్రశేఖరం.

"ఓకే రూపా! నీ యిష్టప్రకారమే కానీ-నేను బాగా ఆలోచించుకుని నీకు తర్వాతనే ఏ విషయమూ చెబుతాను."

అంటూనే చటుక్కున ఒక చేయితో ఆమె నోరు మూశాడు. రెండో చేయి ఆమె గుండెల్లోకి సూటిగా కత్తిని దింపింది.

"సారీ రూపా! నీ ప్రేమను నేనసలు పట్టించుకోలేదు. అవసరంకోసం అలా నటించాను. నిన్ను పెళ్లి చేసుకునే ఉద్దేశ్యం నాకెన్నడూ లేదు. మామూలుగా నగలు నాకిచ్చేసివుంటే, కనీసం నీ ప్రాణాలు నీకు దక్కివుండేవి. ఈ నగల చోరీ విషయంలో నన్ను పట్టివ్వగల ఏకైక సాక్షివి నువ్వే-అందువల్ల హత్యచేయక తప్పలేదు నాకు" అన్నాడు చంద్రశేఖరం.

అతను హత్యకు ముందుగా సిద్ధపడి వచ్చినట్లుంది తప్పితే అనుకోకుండా హత్య చేసినట్లు లేదు. ఇవన్నీ ఆలోచించి అవగాహన చేసుకునే స్థితిలో రూప ఉన్నట్లు లేదు. ఆమె శరీరం బలహీనమైనది. తల పక్కకు వాల్చేసిందామె.

చంద్రశేఖరం నగలున్న సూట్ కేసు తీసుకుని అక్కణ్నించి వెళ్ళిపోయాడు.

* * *

తెల్లవారుజామున ఎవరో తలుపు తడితే బద్ధకంగా లేచివెళ్ళాడు చంద్రశేఖరం. తలుపు తీయగానే అతనికి కనబడింది పోలీసులు.

పోలీసులు తనదగ్గర కెందుకొచ్చారు? తన నేరం బయట పడిపోయిందా? అయితే తనవల్ల ఎక్కడ పొరపాటు జరిగింది?

అతనాలోచిస్తూండగానే "రూపను హత్య చేసినట్లు నీపై అభియోగం" అన్నాడు పోలీస్ ఇన్‌స్పెక్టర్.

ఆ తర్వాత ఆయన ఏం మాట్లాడాడో చంద్రశేఖరానికి వినబడలేదు. అతనికి చాలా పెద్దషాక్ తగిలినట్లుంది. స్పృహతప్పి కింద పడిపోయాడు.

# 10

"బాస్!"

"ఊఁ"

"చంద్రశేఖరానికి ఉరిశిక్ష పడింది."

"నువ్వు అందించిన ఆకాశరామన్న వివరాలు అంత పకడ్బందీగా వుంటే ఉరిశిక్ష పడకేం చేస్తుంది?"

"చంద్రశేఖరాన్ని చంపడంకోసం ఆ సదిలో నేను

చాలా సేపటి నుంచి ఎదురుచూస్తున్నాను. ముందు టీపా వచ్చింది. తర్వాత కొన్ని గంటలకు అతను వచ్చాడు. కానీ నేనూహించని విధంగా అతను హత్య చేశాడు. చివరిక్షణం వరకూ అతను హత్య చేస్తాడని నేననుకోలేదు బాస్...."

"హంతకుడంటే అలాగే వుండాలి."

"ముందు కాసేపు నాకు కాళ్ళూ చేతులూ ఆడలేదు. ఆ చంద్రశేఖరాన్ని నేను చంపాల్సి వుందని గుర్తువచ్చేక ఈ హత్యకేసులో అతన్ని పట్టిచ్చేస్తే సరిపోదా అని పించి వెంటనే పోలీస్ స్టేషన్‌కు ఆకాశరామన్న ఫోన్ కాల్ చేశాను."

"ఏమైతేనేం హత్య చేయకుండానే చంపగలిగావ్- అదృష్టవంతుడివి."

"చంద్రశేఖరంలాంటి నమ్మకద్రోహి, దుర్మార్గులు— ఒకరి చేతుల్లో చావక్కర్లేదు. తమ చేతుల్లో తామే చస్తారు."

"అ సమానూ అలా జరుగుతుందనుకోను. చంద్ర శేఖరం దగ్గర నువ్వు హంతకుడి మెలకువలు నేర్చుకుని వుంటే అవి ముందు ముందు పనికి వస్తాయి."

"వద్దు బాస్ నన్ను హంతకుణ్ణి చేయవద్దు."

బాస్ నవ్వి ఊరుకున్నాడు.

అతను ఏదో అనబోయి చటుక్కున ఏదో గుర్తుకు రాగా అక్కణ్ణించి కదిలాడు.

జ్యోతిష్కుడు చెప్పిన మాట నిజమైంది. తను బాస్ పని పూర్తి చేశాడు. అలాగని హత్య కూడా చేయలేదు. చేతిలోని రేఖలు చూసి మనిషి హంతకుడయ్యేదీ లేనిదీ ఖచ్చితంగా చెప్పవచ్చునన్న మాట!

అతను జ్యోతిష్కుడుండే చోటికి వెళ్ళాడు. జ్యోతిష్కుడికి నూటపదహార్లిచ్చుకోవాలని తన రేఖల్లో ఇంకా యేవేం విశేషాలున్నాయో తెలుసుకోవాలనీ అతని కోరిక.

కానీ అక్కడ జ్యోతిష్కుడు లేడు. పక్కన వాకబు చేయగా "ఎందుకో కొద్దిరోజుల క్రితమే వాడిక్కడ్నుంచి మకాం మార్చేశాడు సార్! ఏమని అడిగితే ప్రాణ ప్రమాదం అన్నాడు" అని కిళ్ళీకొట్టువాడు చెప్పాడు.

జ్యోతిష్కుడి మాట అబద్ధమైతే తను రెండో హత్య చేస్తాననడం అతనికి గుర్తువచ్చింది.

"అంటే నాకు కలిగించిన నమ్మకం ఆ జ్యోతిష్కుడికి లేదన్నమాట-తన మాట అబద్ధమవుతుందేమోనని భయపడి యిక్కణ్ణించి మకాం ఎత్తేశాడన్నమాట!" అనుకుని తనలో తనే నవ్వుకున్నాడతను.

—:ఐపోయింది:—

# మొండి శవం?

## వాణిశ్రీ

ముసురుపట్టి మూడురోజులయింది.

ఎక్కడో సముద్రంలో వాయుగుండం పడి దాని ప్రభావం యిక్కడ ముసురు రూపంలో చూపిస్తున్నది.

రంగడికి ఒకటే చిరాకుగా వుంది.

రోజూ గుట్టలమీద స్వేచ్ఛగా తిరిగే ప్రాణం వాడిది. చేతులు ముడుచుకుని యింట్లో కూర్చునేసరికి ఏమీ తోచక గిలగిల కొట్టుకున్నాడు.

నాలుగోరోజు కొంచెం తెరపిచ్చింది. అయినా మబ్బులు క్రమ్ముకునే వున్నాయి. వర్షం రాదని గ్యారంటీ లేదు.

"పశువుల్ని గుట్టలకెళ్లి తోలుకెళ్తా!" అన్నాడు రంగడు యజమానితో.

"వాన వచ్చేటట్టుంది" అన్నాడు రామిరెడ్డి.

"రాదయ్యా!" అన్నాడు రంగడు.

"వద్దులే. అవి వానలో తడిస్తే లేనిపోని రోగాలు

వస్తాయి" అన్నాడు.

"పోనీ పచ్చగడ్డి కోసుకొస్తా" అంటూ యజమాని అనుమతి కోసం యెదురు చూడకుండానే వెళ్ళిపోయాడు రంగడు.

గోకుడుపార భుజాన పెట్టుకుని హుషారుగా బయల్దేరాడు రంగడు.

చల్లగా హాయిగా వుంది వాతావరణం.

ఆనందంగా తలలూపుతున్నాయి చింతల తోపులో చెట్లు.

కారుమేఘాలు హడావుడిగా పరుగులు తీస్తున్నాయి ఆకాశంలో.

ఊరుచివర గుట్టల దగ్గర వెళ్ళి గడ్డి దట్టంగా పెరిగిన చోట చూసి కూర్చుని గోకుడుపారతో గడ్డి కోస్తున్నాడు. కోస్తూ కోస్తూ ముందుకెళ్ళి యెందుకో తల పైకెత్తి చూశాడు.

అంతే. వాడి గుండె ఆగిపోయినట్టయింది. ముచ్చెమటలు పోసుకొచ్చాయి. భయంతో వొళ్ళు చల్లబడిపోయింది.

భూమిలో నుంచి పుట్టుకొచ్చిన మనిషి చెయ్యి స్పష్టంగా కనిపించింది. ఐదు వ్రేళ్ళతో సహా అరఅడుగు పైకిలేచి అప్పుడే మొలకెత్తిన మొక్కలా వుంది.

రంగడు అటూ ఇటూ చూశాడు. కనుచూపు మేరలో నరసంచారం కనిపించలేదు.

కోసినగడ్డి, గోకుడుపార అక్కడే వదిలి వెనక్కి చూడకుండా పరిగెత్తాడు. ఊరు చేరేవరకూ యెక్కడా ఆగలేదు. ఆ హస్తం తనని తరుముతుందేమోనని వాడికి భయం పట్టుకుంది.

చెమటలు కక్కుతూ, ఆయాసపడుతూ వచ్చి నిల్చున్న రంగడిని చూసి యేం జరిగిందోనని హడలిపోయాడు రామిరెడ్డి.

"ఏరా యేం జరిగిందిరా?" అని ప్రశ్నించాడు కంగారుగా.

"భూమిలోంచి చెయ్యి పుట్టుకొచ్చింది" భయంతో కళ్ళు ఆర్పుతూ చెప్పాడు రంగడు.

"ఏమిట్రా....మళ్ళీ చెప్పు" అన్నాడు రామిరెడ్డి నివ్వెర పోతూ.

రంగడు చెప్పాడు.

"భూమిలోంచి చెయ్యి పుట్టడం ఏమిట్రా. నీ బొంద లాగా వుంది. ఎవరన్నా వింటే నవ్వుతారు" అన్నాడు రామిరెడ్డి.

"ఒట్టు అయ్యగారూ! కళ్ళారా చూశాను. అది మనిషి చెయ్యే. నాకు భయంపుట్టి పారిపోయి వచ్చాను" అన్నాడు రంగడు తన తలమీద చేయి పెట్టుకుని.

రామిరెడ్డి ఆలోచనలో పడిపోయాడు.

రంగడు చూసింది నిజమేనా?

నిజమే అనుకోవాల్సి వస్తోంది. వాడికి అబద్ధం చెప్పా ల్సిన పని ఏముంది?

అయినా యిదేం విచిత్రం?

ఏమిటో వెళ్ళి చూస్తేగాని తెలియదు అనుకున్నాడు.

ఎందుకైనా మంచిదని మునసబు నాయుడు యింటికి వెళ్ళి చెప్పాడు.

అంతా విని ఆశ్చర్యపోయాడు మునసబు నాయుడు.

"వెళ్ళిచూస్తే తెలిపోతుంది గదా!" అన్నాడు రామిరెడ్డి.

"ఉండవోయ్ రెడ్డీ. నీకంతా తొందరే. కాస్త గుర్రాన్ని కట్టేయ్. మనం వూరికే వూగులాడుకుంటూ వెళ్తే లాభంలేదు. పోలీసుల్ని తీసుకుని వెళ్ళాలి" అన్నాడు నాయుడు.

రామిరెడ్డి ఆశ్చర్యానికి అంతులేదు. భూమిలోంచి హస్తం పుట్టుకురావడం ఒక వింతగా తను అనుకుంటుంటే పోలీసుల్ని తీసుకెళ్ళాలంటా డేమిటి నాయుడు? అనుకొన్నాడు.

"పోలీసులు ఎందుకు?" అన్నాడు.

"ఎందుకంటే ఎవడో, ఎవడ్నో ఖూనీ చేసి అక్కడ పాతిపెట్టాడు గనుక" అన్నాడు నాయుడు.

"ఖూనీయే!...." అన్నాడు రామిరెడ్డి కళ్ళు పెద్దవి జేసి.

"మరి లేకపోతే భూమిలోంచి హస్తం ఎట్లా పుట్టుకొస్తుందోయ్ పిచ్చిమారాజా! ఇదేం పురాణకాలం అనుకున్నావా వింతలు విడ్డూరాలు జరగడానికి" అన్నాడు నవ్వుతూ.

"ఈ చుట్టుప్రక్కల వూళ్ళలో యెక్కడా ఖూనీలు జరిగినట్లు లేదే! అయినా ఎలక్షన్ టైము గూడా కాదు గదా! ఖూనీ యెందుకు జరిగిందబ్బా!" అన్నాడు రామిరెడ్డి బుర్ర గోక్కుంటూ.

"ఖూనీ జరగడానికి ఒక టైము కావాలా?" అన్నాడు.

"అయితే మనం అక్కడికి వద్దంటావా నాయుడూ!" అన్నాడు రామిరెడ్డి.

"మన కెందుకొచ్చిన పీడా! పోలీసులకి రిపోర్టు చేస్తే ఆ తిప్పలేవో వాళ్ళే పడతారు" అన్నాడు నాయుడు.

తర్వాత తెల్లకాగితం తీసుకుని ప్రక్కవూరు గరుడ పల్లిలో వున్న పోలీస్ స్టేషన్‌కి రిపోర్టు రాసి పంపించాడు నాయుడు.

మధ్యాహ్నానికి పోలీస్ జీపు వూళ్ళోకి వచ్చింది. మున సబు నాయుడి యింటిదగ్గర ఆగింది.

జీపు రాక విని రామిరెడ్డి, నాయుడు ఇంటికి వెళ్ళాడు హడావుడిగా.

ఇన్‌స్పెక్టర్ కృష్ణమూర్తి, హెడ్‌కానిస్టేబుల్ కాక నలుగురు కానిస్టేబుల్సు కూడా వున్నారు అక్కడ.

రామిరెడ్డిని చూసి "రావోయ్ రెడ్డీ. నీ గురించే కబురు పెట్టాలనుకుంటున్నాను. ఆ రంగడిని పిలిపించు" అన్నాడు.

కాసేపటికి రంగడిని వెంటపెట్టుకొని వచ్చాడు రామి రెడ్డి.

అంతా కలసి జీప్‌లో గుట్టల దగ్గరికి వెళ్ళారు.

హస్తం కనిపించింది.

ఎస్.ఐ. కృష్ణమూర్తి జాగ్రత్తగా పరిశీలించి చూసి "మనిషిని పూడ్చిపెట్టారు పైపైన. ఈ వానలకి వుబ్బి చెయ్యి బైటకు వచ్చింది" అన్నాడు.

"నేను అనుకుంటూనే వున్నాను...." అన్నాడు నాయుడు.

"ఇది స్మశానం కాదుగదా....!" అన్నాడు కృష్ణ మూర్తి.

"అబ్బే. అసలు మనుషులు తిరిగే ప్రదేశమే కాదు ఇది. కుర్రాళ్ళు గొడ్లు కాయడానికి వస్తారు ఇక్కడికి. మైలు దూరంలో వూరికి దగ్గర్లోనే వుంది స్మశానం" అన్నాడు నాయుడు.

"సరే! త్రవ్వించండి" అన్నా ఎస్.ఐ.

వెట్టిమనిషి గునపం తీసుకుని త్రవ్వసాగాడు. కష్టం లేకుండానే బైటపడింది శవం.

కాని ఆ శవానికి తలలేదు.

అంతా ఆశ్చర్యంతో స్థాణువులై పోయారు ఆ శవాన్ని చూస్తూ.

బట్టలు ఏ రంగువో తెలియనంత మట్టికొట్టుకుపోయి వున్నాయి. తొడుక్కున్నట్టి ప్యాంటు, షర్టునిబట్టి శవం మగవాడిదని తెలుసుకున్నారు.

శవాన్ని పంచనామా చేసి పోస్టుమార్టమ్ చెయ్యడానికి పంపించారు.

"చుట్టుప్రక్కల అన్ని వూళ్ళలోనూ చాటింపు వేయించండి. ఎవరైనా రావడానికి అవకాశం వుంటుంది గదా" అన్నాడు ఎస్.ఐ.

"అలాగే చేస్తాను సార్!" అన్నాడు నాయుడు.

అందరి దగ్గరా సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు ఎస్.ఐ. కృష్ణమూర్తి.

## 2

ఆ చుట్టుప్రక్కల అన్ని వూళ్ళలోనూ చాటింపు వేశారు మొండిశవం గురించి.

గరుడపల్లి సబ్ ఇన్స్పెక్టర్ కృష్ణమూర్తి పంపిన రిపోర్టు ఆధారంగా పత్రికల వారికి వివరాలు విడుదల చేశాడు సూపరింటెండెంట్ ఆఫ్ పోలీసు.

పోస్టుమార్టమ్ రిపోర్టు వచ్చింది.

సెప్టెంబర్ పదకొండో తేది రాత్రి తొమ్మిది గంటల ప్రాంతంలో అతని ప్రాణం పోయింది.

ఆహారం తీసుకోవడానికి ముందు అతను బ్రాందీ త్రాగి వున్నాడు.

ఇక అతని వయస్సు ముప్పై సంవత్సరాలుంటాయి.

ఈ వివరాలన్నీ ప్రముఖ దినపత్రిక లన్నింటిలోనూ ప్రకటించారు. కొన్ని పత్రికల్లో అతని తలలేని శవాన్ని ఫోటోతీసి అచ్చువేశారు.

అతని బంధువులు ఎవరైనా వుంటే సూపరెన్టెంట్ ని కలుసుకోమని గూడా ప్రకటించారు.

వారం రోజుల వరకూ ఎవరూ రాలేదు.

శవం యెవరిదో గుర్తుపట్టే ఆధారం యేమీ దొరక లేదు.

శవానికి తలలేదు.

శవం తొడుక్కున్న బట్టలమీద చాకలి గుర్తులు ఏవీ లేవు.

జేబుల్లో కాగితాలు యేమీ లేవు.

కుడి చేతిమీద రెండు పుట్టుమచ్చలుమాత్రం వున్నాయి.

వారంరోజులు గడిచేసరికి ఇక యెవరూ రారులే అను కున్నాడు ఎస్.ఐ. కృష్ణమూర్తి.

ఇక 'ఆ కేసు గురించి యేమీ ఆధారం దొరకదు అని నిరాశపడ్డాడు గూడా.

కాని ఆ రోజు మధ్యాహ్నం మూడుగంటల ప్రాంతంలో పాతిక సంవత్సరాలు వయసున్న యువతి గరుడపల్లి పోలీస్ స్టేషన్ లో అడుగు పెట్టింది.

ఆమెవంక ప్రశ్నార్థకంగా చూశాడు కృష్ణమూర్తి.

"అదేసార్! గాజులపల్లిలో తలలేని శవం కేసు. అతను ఈమె భర్తట" అన్నాడు హెడ్ కానిస్టేబుల్.

"అలాగా! కూర్చోండి" అన్నాడు కృష్ణమూర్తి తన సీటు యెదురుగావున్న కుర్చీ చూపించి.

ఆమె కూర్చోవడానికి తటపటాయిస్తూ "ఫరవాలేదు సార్!" అంది.

"కూర్చోండి...." అన్నాడు హెడ్ కానిస్టేబుల్.

ఆమె ఇబ్బందిగా కూర్చుంది కుర్చీలో.

కృష్ణమూర్తి ఆమెను పరిశీలనగా చూశాడు.

ఆమెకు పాతిక సంవత్సరాలకి లోపే వుంటాయి. ఐదడుగుల పైనే ఎత్తుంది. శరీరపు రంగు నలుపే అయినా ముఖం కళగావుంది. సన్నగా వుందిగాని కష్టజీవి కాదు. ఆమె చీరకట్టుకున్న పద్ధతి చూస్తే నాగరికంగానే వుంది. చెవులకు దుద్దులున్నాయి. అవి బంగారప్పవే. మెడలో పసుపుతాడు తప్ప ఇక ఏ ఆభరణాలూ లేవు.

ఆమె విచారంగా వుంది.

"అతడు మీకు యేమవుతాడు?" అన్నాడు కృష్ణమూర్తి.

"మా ఆయన."

"పేరు?"

"జగన్నాథం.

"ఏ వూరు మీది?"

"ఏలూరు."

"చాల దూరం వుందే. జగన్నాథం ఇక్కడికి ఎందుకు వచ్చివుంటాడు?"

"అదే నాకూ తెలియడంలేదు సార్!" విచారంగా అంది ఆమె.

"మీ పేరు?"

"సీతమ్మ."

"చూడండి సీతమ్మగారూ! నేను అడిగిన వాటికి సరిగ్గా జవాబులు చెప్తే హంతకులను పట్టుకోవడానికి వీలుంటుంది" అన్నాడు కృష్ణమూర్తి.

"అడగండి సార్!" యేడుపు ఆపుకుంటూ అంది సీతమ్మ.

"మీ భర్త యేదైనా ఉద్యోగం చేస్తుంటాడా?"

"అవును సార్. గవర్నమెంటు ఆఫీసులో ప్యూను ఉద్యోగం సార్."

"అతనికి విరోధులు ఎవరైనా వున్నారా?"

సీతమ్మ క్షణం ఆలోచించి "మా వీధిలో యెవరూ లేరుసార్. ఆఫీసులో యెవరైనా వున్నారేమో తెలియదు సార్" అంది.

"మీది ఏలూరు స్వంత గ్రామమా?"

"కాదు సార్."

"ఏ వూరు?"

"మాది కడప సార్."

"ఇద్దరిదీ కడప కాదుగదా!"

"కాదు. అతనిది అనంతపురం."

"మీకు పెళ్ళయి ఎంతకాలమైంది."

"నాలుగు సంవత్సరాలు."

"అంతేనా?"

"అవును."

"ఏ వూళ్ళో పెళ్ళయింది?"

ఆమె తటపటాయించింది.

"నాంగార్జునసాగర్‌లో."

"అక్కడ యెవరున్నారు....? మీ తల్లిదండ్రులున్నారా?...."

"లేదు సార్. మా అమ్మ కడపనుంచి సాగర్ వచ్చింది. సాగర్‌లో మా బంధువులు చాలమందివున్నారు. పనికోసం మా అమ్మ వచ్చింది."

"మీ నాన్న."

"చనిపోయాడు."

"ఏ ఆధారం లేక మీ అమ్మ నాగార్జునసాగర్ వచ్చిందన్నమాట పనికోసం?" అన్నాడు.

"అవును సార్."

"ఏదైనా పని దొరికిందా?"

"అప్పటికే అక్కడ డామ్ పని పూర్తయింది. ఏదో కూలి పని చేసుకుంటూ వున్నాం. అక్కడ వున్నప్పుడే నాకు పెళ్ళయింది. ఏడాది క్రితం ఆయనకి ఏలూరు ట్రాన్స్‌ఫరయింది. ఇప్పుడు అక్కడే వుంటున్నాం." అంది సీతమ్మ.

కృష్ణమూర్తి ఏదో ఆలోచిస్తూ కూర్చుండిపోయాడు.

ఏలూరు గరుడపల్లికి రెండువందల కిలోమీటర్లపైనే దూరం ఉంది. అందులోనూ ఇది హైవేలో లేదు. చాలా కార్నర్ విలేజ్. జగన్నాథం ఇక్కడికి ఎందుకు వచ్చి ఉంటాడు.

"అయితే ఇక్కడికి జగన్నాథం యెందుకు వచ్చి వుంటాడో మీకు తెలియదన్నమాట" అన్నాడు కృష్ణమూర్తి.

సీతమ్మ తల అడ్డంగా వూపింది.

"ఈ చుట్టుప్రక్కల వూళ్ళలో మీకు బంధువులు ఎవరైనా వున్నారా?"

"లేదు."

"పోనీ అతనికి స్నేహితులు యెవరైనా వున్నారా?"

"నాకు తెలియదు సార్."

"మీ భర్త యెప్పటినుంచి కనిపించటంలేదు?"

"ఈనెల నాలుగో తారీఖున యింటికి రాలేదు. రాత్రి చాలసేపు యెదురుచూశాను. ఇంకా వస్తాడు, ఇంకా వస్తాడని చూస్తే రాలేదు. పోనీ మర్నాడన్నా వస్తాడని చూశాను. రాలేదు. వాళ్ళ ఆఫీసుకి వెళ్ళి అడిగాను. రాలేదన్నారు."

"సెలవు పెట్టాడా?"

"లేదు."

"సెలవు పెట్టకుండా వెళ్ళిపోయే అలవాటు వుందా?"

"లేదు. ఎక్కడికీ వెళ్ళడు. అలాంటివాడు వున్నట్లుండి మాయమైపోయాడు."

"ఆ తర్వాత అతనికోసం మీరేవన్నా ప్రయత్నాలు చేశారా? నాగార్జున సాగర్‌లో మీ అమ్మకు తెలియజేశారా?"

"మా అమ్మ చచ్చిపోయింది. అక్కడ దూరపుబంధువులేగాని కావాల్సిన వాళ్ళు యెవరూ లేరు. మా ఆయన అక్కడికి వెళ్ళడు" దృఢంగా అంది ఆమె.

"పోనీ మీ భర్తకు బంధువులు యెవరూ లేరా?"

"ఒక అన్న వుండేవాడని చెపుతూ వుండేవాడు. కాని నేనెప్పుడూ చూడలేదు."

"ఏ వూళ్ళో?"

"హిందూపూరులో."

"ఒకవేళ వాళ్ళ అన్న ఇంటికి వెళ్ళాడేమో గదా!"

"వెళ్ళదల్చుకుంటే నాతో చెప్పి వెళ్ళేవాడు గదా. చెప్పకుండా ఎందుకు వెళ్తాడు?"

కృష్ణమూర్తి ఏమీ మాట్లాడలేదు.

"ఈశవం జగన్నాథానిదే అనడానికి ఆధారం ఏదైనా వుందా?"

ఆమె అర్థంకానట్లు చూసింది.

"అతను మీకు కనిపించకుండా పోయేముందు ఏ రకం బట్టలు తొడుక్కొని వున్నాడు?"

"తెల్లవి."

కృష్ణమూర్తి తల వూపాడు.

"అతను యెంతో దూరంనుంచి యిక్కడికి ఎందుకు వచ్చివుంటాడో వూహించగలరా?" అన్నాడు కృష్ణమూర్తి.

సీతమ్మ ఆలోచనలో పడిపోయింది.

కాసేపయిన తర్వాత "మా ఆయనకి పేకాట పిచ్చి వుంది. ఆ ఆట ఆడడంకోసం యెంతదూరమైనా వెళ్తారు. ఒకవేళ పేకాట స్నేహితులెవరైనా ఆయన్ని యింత దూరం తీసుకొచ్చారేమో! అంటే ఈ చుట్టు ప్రక్కవూళ్లలో ఆయనకి ఆఫీసులో స్నేహితులు వుండివుండవచ్చు. ఆ ఆటలో ఆయన డబ్బు గెల్చుకుంటే తగాదా పడి చంపేసి వుండవచ్చుగదా!" అంది.

కృష్ణమూర్తి ఆమె చెప్పింది వూహించుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు.

ఇంతలో ఫోన్ మ్రోగింది.

రిసీవర్ ఎత్తి "ఎస్.ఐ. కృష్ణమూర్తి స్పీకింగ్" అన్నాడు.

"..............."

"గుడ్ మార్నింగ్ సార్!"

"..............."

"ఐ.సీ.....వండ్రఫుల్ సార్! నా దగ్గరికి ఇప్పుడే ఒకమ్మాయి వచ్చింది సార్! ఆ శవం తన భర్తదని చెపుతూవుంది."

"..............."

"యస్. సార్!"

"..............."

"ఎస్. సార్."

"..............."

"ఇప్పుడే వస్తున్నా సార్!"

"..............."

"ఓ. కే. సార్."

కృష్ణమూర్తి రిసీవర్ క్రెడిల్ మీద పెట్టి సీతమ్మ చెప్పిందంతా రికార్డు చేశాడు.

"అమ్మా! మీరు చెప్పినట్లు జరగడానికి గూడా అవకాశం వుంది. పేకాట పిచ్చి చాలా దారుణమైన పిచ్చి. పేకాట స్నేహితుడితో పాటు మీ భర్త ఈ చుట్టు ప్రక్కల వూరికి వచ్చివుండొచ్చు. ఏదైనా పెళ్ళికి తన స్నేహితుడి బలవంతం మీద వెళ్ళివుండొచ్చు" అన్నాడు.

"అదే సార్ నా అనుమానం" అంది సీతమ్మ.

"నేను ఎలాగైనా హంతకుల్ని పట్టుకుంటాను. మీరు దిగులుపడకండి" అని కాలింగ్ బెల్ నొక్కాడు.

సెంట్రీ లోపలకు వచ్చాడు.

"హెడ్ వెంకటస్వామిని పిలువు" అన్నాడు.

కాసేపటికి హెడ్ వెంకటస్వామి ప్రవేశించాడు.

అతన్ని చూస్తూనే "నువ్వు వెంటనే గాజులపల్లి వెళ్ళాలి" అన్నాడు.

"యస్ సార్" అన్నాడు హెడ్.

"మునసబు నాయుడుగారిని కలుసుకుని ఈ నెలలో ఆ చుట్టుప్రక్కల వూళ్ళలో ఎవరెవరి ఇళ్ళల్లో పెళ్ళిళ్ళు జరిగాయో! పెళ్ళిళ్ళు కాకపోయినా ఏదైనా శుభ కార్యాలు జరిగితే అవిగూడా! తెలుసుకుని రా. ఎంత రాత్రయినా తిరిగిరావాలి."

"యస్సార్!"

"నేను ఇప్పుడే గజపురం వెళ్తున్నాను. సి.ఐ.గారు రమ్మని ఫోన్ చేశారు" అన్నాడు కృష్ణమూర్తి కుర్చీలోంచి లేస్తూ.

"మీరు మీ అడ్రసు, మీ ఆయన పనిచేసిన ఆఫీసు అడ్రసు రాసివ్వండి" అన్నాడు తెల్లకాగితం ఆమెకు అందిస్తూ.

సీతమ్మ రాసి కృష్ణమూర్తి చేతికి అందించింది.

"మీరు వెళ్ళిపోండి. కేసు ఇన్వెస్టిగేషన్‌లో వుంది. టైం పడుతుంది ఫయినల్ కావడానికి" అన్నాడు.

మబ్బులేని వానలాగ ఆమె వున్నట్లుండి బావురుమని ఏడ్చింది. చేతులు జోడించి నమస్కారం చేస్తూ "సార్! నాకెవరూ దిక్కులేరు. మీరే దిక్కు" అంది.

కృష్ణమూర్తికి జాలి కలిగింది ఆమెను చూస్తుంటే.

"ఏడవకమ్మా! కొద్దో గొప్పో చదువుకున్నదానివి. ధైర్యంగా వుండాలి" అన్నాడు.

"సార్! మీరు దయుంచి నాకు ఆధారం చూపించాలి."

"నేనేం చెయ్యగలనమ్మా! నేరస్థులను పట్టుకోవడం నా పని" అన్నాడు.

"అది కాదు సార్! ఆయన చనిపోయినట్లు కాగితం ఇస్తే మీకు రుణపడివుంటాను సార్!" అంది.

"తప్పకుండా ఇస్తాం. కాని కొంత టైం పడుతుంది."

"అది ఇస్తే నాకు ఆయన ఆఫీసు నుంచి డబ్బు వస్తుంది. గవర్నమెంటులో యేదైనా చిన్న వుద్యోగం దొరుకుతుంది సార్! దిక్కులేనిదాన్ని. లేకపోతే చచ్చిపోతాను సార్!" అంది సీతమ్మ.

"అలాగే. కాగితం ఇస్తాం—శవం మీ ఆయనే అని రుజువు కావాలి. నీకేం భయంలేదు. వెళ్ళిరా!" అన్నాడు బైటకి నడుస్తూ.

కృష్ణమూర్తి జీప్ ఎక్కి కూర్చున్నాక, అది స్టార్టయ్యే వరకూ ఆమె యేడుస్తూనే తనగోడు చెప్పకుంటూ వుంది.

# 3

గరుడపల్లికి గజపురం ఇరవై మైళ్ళుంది. గజపురం తాలూకా కేంద్రం. అక్కడ సర్కిల్ ఇన్‌స్పెక్టర్ వున్నాడు.

కృష్ణమూర్తి అరగంట తర్వాత సి.ఐ. విశ్వనాథం ముందు కూర్చుని మాట్లాడుతున్నాడు.

"చెప్పండి సార్! ఆ శవం తన తమ్ముడిదే అని వచ్చినాయన ఎవరు?" అని ప్రశ్నించాడు కృష్ణమూర్తి.

"ఆయనొక పెద్ద రాజకీయవేత్త. ఈ తాలూకా మొత్తంలో పలుకుబడి కలవాడు. పేరు లింగయ్య."

"లింగయ్య నాకు తెలుసులెండి. ఇప్పటికి పదిపార్టీలు మారివుంటాడు నాకు తెలిసినంతవరకూ" అంటూ నవ్వాడు కృష్ణమూర్తి.

"పోయిన ఎలక్షన్స్‌లో ఎమ్.ఎల్.ఏ. పోటీచేసి ఓడి

పోయాడు."

"నాకు తెలుసు సార్!"

"కందిపాలెం పంచాయితీ బోర్డు ప్రెసిడెంట్ ప్రస్తుతం."

"ఇంతకీ యేమని రిపోర్టిచ్చాడు?"

"తన తమ్ముడు జానయ్య ఈ నెల తొమ్మిదో తారీఖు నుంచి కన్పించడంలేదు. రాజకీయ ప్రత్యర్థులు హత్యచేసి వుండవచ్చునని అనుమానిస్తున్నాను అంటూ ఇచ్చాడు."

"చంపాడు పోండి" అన్నాడు కృష్ణమూర్తి.

"ఏలూరు నుంచి వచ్చినావిడ ఎవరు?" అన్నాడు సి. ఐ.

"సీతమ్మ."

"ఇప్పుడు ఈ ఇద్దర్లో శవం ఎవరిదో మనం ఇన్వెస్టిగేట్ చెయ్యాలి."

"తప్పేది ఏవుంది?" అన్నాడు కృష్ణమూర్తి.

"అంగులో పొలిటికల్ మాన్ లింగయ్య. తలతిక్క మనిషిగూడ. తిక్క రేగిందంటే పోలీసులు అవతల పార్టీ కుక్కలు అని పేపరు స్టేట్మెంట్ ఇస్తాడు గూడా!" అన్నాడు సి.ఐ. నవ్వుతూ.

"అదే బాపతుమనిషి" తల వూపుతూ అన్నాడు కృష్ణమూర్తి.

"ఈ లింగయ్య రంగంలోకి దిగడంతో మనకి పెద్ద తలనొప్పి తగిలింది."

"లింగయ్య తమ్ముడికి ఎన్నేళ్ళుంటాలు?"

"ముప్పై వుంటాయని చెప్తున్నాడు."

"అవతల పార్టీ వాళ్ళు అంటే పేర్లు రాసిచ్చాడా?"

"లేదు. టూకీగా అవతల పార్టీ వాళ్ళమీద అనుమానంగా వుంది" అన్నాడు.

"బాగుంది వరస" అన్నాడు కృష్ణమూర్తి నవ్వుతూ.

"ఏ హత్య జరిగినా, దొంగతనం జరిగినా దాన్ని రాజకీయాలకి ముడివెయ్యడం వాళ్ళ జన్మహక్కు" అన్నాడు సి. ఐ.

"మనం ఒకసారి లింగయ్యగారి వూరెళ్ళి పరిస్థితులు గమనించాలి.ఆయనగారి తమ్ముడి క్యారెక్టర్ ఎటువంటిదో? అసలు అతను ఏం పని చేస్తుంటాడో?"

"పనీపాటా లేదు. పంచాయితీలో మెంబరు. పార్టీలో ప్రముఖ కార్యకర్త."

"పార్టీలో విభేదాలవల్ల హత్య జరిగిందంటే నమ్మబుద్ధి పుట్టడంలేదు. ఎందుకంటే రాజకీయాలలో ఎవరూ యెవరికీ శాశ్వతంగా శత్రువులు కాదు, అలాగని మిత్రులూ కాదు. బద్ధశత్రువులు సైతం అర్ధరాత్రి పార్టీలు మార్చేస్తారు. చూస్తున్నారుగా రాజకీయాలు."

"అవుననుకో. హత్యకు కారణం వెతకాలి గదా!"

"కారణం యేముంటుంది సార్. ఏ ముండ దగ్గరో తగాదావల్లగాని, ఏ కాలువగట్టు గొడవల్లోగాని హత్య జరగవచ్చు. దాన్ని మసిపూసి మారేడుకాయ చేస్తారు పొలిటికల్ వాళ్ళు" అన్నాడు కృష్ణమూర్తి.

"ఏది యేమైనా ఇన్వెస్టిగేషన్ చెయ్యాలి గదా!"

కృష్ణమూర్తి తల వూపాడు.

"సార్! హెడ్క్వార్టర్స్ నుంచి వైర్లెస్ మెసేజ్ వచ్చింది సార్!" హడావుడిగా వచ్చాడు కానిస్టేబుల్.

సి.ఐ. విశ్వనాథం వైర్లెస్ రూమ్‌లోకి వెళ్ళి కాసే

పటికి తిరిగివచ్చాడు.

"ఏమిటి సార్ విశేషం? హెడ్ క్వార్టర్స్‌లో ఏదైనా గొడవ జరిగిందా? మతకల్లోలం, స్టూడెంట్స్ ఏజిటేషన్ ఎట్ సెట్రా?" నవ్వుతూ ప్రశ్నించాడు కృష్ణమూర్తి.

"గాజులపల్లి మర్డర్ కేసు గురించే" నీరసంగా అన్నాడు విశ్వనాథం.

"వాట్ సార్! ఇంతవరకూ యెవర్నీ అరెస్టు చెయ్యనందుకు ఘాటింపా?"

"నో. ఆ చచ్చినవాడు తన అల్లుడేనని యెవరో యస్.పి.గారిని కలుసుకుని పిటీషన్ ఇచ్చాడట."

"మైగాడ్!" నివ్వెరబోతూ అన్నాడు కృష్ణమూర్తి.

"యస్.పి.గారు కేసు ఫయిలు, ఫరదర్ లేటెస్టు రిపోర్టు తీసుకుని హెడ్ క్వార్టర్స్‌కి రమ్మన్నాడు.

"నా రిపోర్టు రెడీసార్!"

"ఈ పూట మనం వెళ్ళేసరికి చీకటి పడిపోతుంది. యస్.పి.గారు క్లబ్బుకి వెళ్తారేమో! అనవసరంగా నైట్ హాల్టు చెయ్యడం ఎందుకు. రేపు వెళ్దాం."

"అదే బెటర్ సార్!" అన్నాడు కృష్ణమూర్తి.

"సెవన్‌కి వచ్చేస్తే యెర్లీగా వెళ్ళిపోవచ్చు" అన్నాడు సి. ఐ.

"ఓ.కె. సార్!" అన్నాడు కృష్ణమూర్తి సెలవు తీసుకుంటూ.

# 4

అంకమ్మ శెట్టికి ఇల్లరికం అల్లుడు సుబ్బయ్య. అతనికి వున్న పిండిమిల్లు నడుపుకుంటూ మామగారింట్లోనే వుండి పోయాడు సుబ్బయ్య.

మామకి కుడిభుజంగా పనిచేసిన అల్లుడు క్రమంగా పెత్తనంలోకి వచ్చాడు. అంకమ్మసెట్టి హాయిగా కృష్ణా రామా అనుకుంటూ కాలక్షేపం చేస్తున్నాడు.

అయితే సుబ్బయ్య పిండిమిల్లు నడపడంతోనే తృప్తి పడలేదు. ఇంకా యెక్కువగా డబ్బు సంపాదించే మార్గాలు అన్వేషించాడు. కాని ఏ వ్యాపారం చెయ్యాలన్నా పెట్టుపడి చాలా అవసరం. పిండిమిల్లుమీద వచ్చే ఆదాయం ఇంటి ఖర్చులకే సరిపోతుంది.

ఇక పోతే అప్పుతెచ్చి వ్యాపారం చెయ్యాలి. ఆ వూళ్ళో అతనికి స్వతంత్ర ప్రతిపత్తి లేదు. మామచాటు మనిషిగానే చెలామణీ అవుతున్నాడు. మామకి తెలియకుండా యెవరూ అప్పు యివ్వరు. మామకి తెలిస్తే అప్పు యివ్వనివ్వడు.

ఇక పెట్టుబడి లేకుండా చేసే వ్యాపారం ఒకటే కనిపించింది సుబ్బయ్యకి.

అది చీటీల వ్యాపారం.

నెలకి వంద చొప్పున కట్టేవాళ్ళని ఏభైమందిని ప్రోగు చేసి వాళ్ళకి మేనేజర్ అయ్యాడు. ఎవరు ఎక్కువ పాడితే వాళ్ళకి చీటీసొమ్ము దక్కుతుంది.

ఈ వ్యవహారం అంకమ్మ శెట్టికి తెలిసి 'ఆ చీటీల వ్యాపారం వద్దురా నాయనా!' అని పోరుపెట్టాడు.

కాని సుబ్బయ్య ముసలాయన మాట పెడచెవిన పెట్టాడు.

కొన్నాళ్ళు చీటీల వ్యాపారం సక్రమంగా సాగింది. కాని అందులో నలుగురు చీటీలు పాడుకున్న వాళ్ళు ఊరి నుంచి పారిపోయేసరికి సుబ్బయ్య పని ఇరుకున పడింది. నెలకి నాలుగువందలు తెచ్చి కట్టాల్సి వచ్చింది.

వ్యాపారం దివాళా తీస్తుందని భయపడి కొందరు డబ్బు కట్టడం మానేసి అప్పటివరకూ కట్టిన డబ్బు తిరిగి యివ్వమని గొడవచేశారు.

సుబ్బయ్య తల్లక్రిందులై పోయాడు. జనానికి యివ్వ వలసిన బాకీలు పదిహేనువేల వరకూ తేలింది.

అందులో యెక్కువ చీటీలు కట్టిన రాజమ్మకి నాలుగు వేలు బాకీ తేలాడు. రాజమ్మకి పాడిపంటా కాక ఒక హోటలు గూడా వుంది. ఆ బజార్లో రాజమ్మ హోట లంటే ఊళ్ళో యెవరికైనా తెలుసు.

ఆ రాజమ్మ కొడుకు ఆ వూళ్ళో రౌడీల్లో ప్రముఖుడు. చైన్ బ్యాచీ వాడి చేతిలో వుంది. రాజమ్మ కొడుక్కి భయపడి ఎవరూ ఆమె బాకీలు ఎగవెయ్యరు.

ఒక రోజు రాజమ్మ కొడుకు జగన్, సుబ్బయ్యకోసం మిల్లు దగ్గరికి వచ్చాడు. 'తన తల్లికి యివ్వవలసిన డబ్బు వారంరోజుల్లో యివ్వకపోతే జాగ్రత్త!' అని బెదిరించాడు. "నాసంగతి నీకు తెలియకపోతే మెయిన్ బజార్లో అడుగు. ఎవర్నడిగినా జగన్ సంగతి చెప్తారు." అని "చివరకి డబ్బివ్వకపోతే నీ శవంగూడా దొరకదు" అంటూ మీసాలు మెలేస్తూ పోయాడు.

అల్లుడు మొదలుపెట్టిన చీటీల వ్యాపారం దివాళా ఎత్తిన సంగతి విని అంకమ్మశెట్టి శివాలెత్తాడు. పెళ్ళాం మీద, కూతురి మీద మండిపడ్డాడు.

అతను తలుచుకుంటే అల్లుడిని బాకీల చెరనుంచి విముక్తి చెయ్యడం యెంతోసేపు పట్టదు. కాని అందుకు అతని అంతరాత్మ ఒప్పుకోవడంలేదు. పిండిమిల్లులో శేరు పదిపైసల వంతున ఆడి ఆడి కూడబెట్టిన డబ్బు. జీవితాంతం చెమటోడ్చి సంపాదించిన సొమ్ము. తిన్నదీకాదు,

పెట్టిందీకాదు. వృథాగా ఒకళ్ళకి కారాదత్తం చెయ్యాలంటే మనసొప్పడం లేదు.

ఎంతో మంచివాడనీ అణకువతో వున్నవాడనీ బంధువుల పిల్లవాడనీ అభిమానించి చేరదీసాడు. మిల్లులో పనీ పాటా నేర్పాడు. ఒక్కర్తే కూతురు. దాన్ని ఏ గుమాస్తాకి యిచ్చినా కట్నాలూ, కానుకలూ, అంటూ ఇరవై వేలు ఖర్చుపెట్టాలి అని ఆలోచించి భార్య వద్దని పోరు పెడుతున్నా పట్టుబట్టి సుబ్బయ్యకిచ్చి పెళ్ళిచేశాడు.

ఆ సుబ్బయ్య యిప్పుడు కొంప ముంచాడు. అప్పుల వాళ్ళు ఇంటిచుట్టూ తిరుగుతూంటే దురదగుండాకు పూసుకున్న వాడిలా మండిపడేవాడు, నిప్పులు తొక్కిన కోతిలా గంతులు వేసేవాడు.

అంతేగాని, ఇపప్పెట్టెలో డబ్బుమాత్రం తీసేవాడు కాదు.

సెప్టెంబర్ పదో తారీఖు తెల్లవారుజాము నుంచి సుబ్బయ్య కన్పించడంలేదు.

మర్నాడు కూతురు గొడవ పెట్టందిగాని అంకమ్మశెట్టి కేకలేశాడు. నాలుగు రోజులు ఆగితే వాడే వస్తాడులే అన్నాడు.

ఈ లోపల గాజులపల్లిలో తలలేని మొండెం బైట పడిన సంగతి పత్రికలలో చదివి బేజారెత్తిపోయాడు అంకమ్మశెట్టి.

అతని అల్లుడు గూడా తెల్లబట్టలే వేసుకుని వెళ్ళాడని కూతురు చెప్పినప్పుడు గుండె ఆగిపోయినట్లనిపించింది.

రాజమ్మకొడుకు జగన్, సుబ్బయ్యని బెదిరించి వెళ్ళిన సంగతి గుర్తొచ్చింది.

ఇంకేంవుంది చలిజ్వరం వచ్చినట్లు వణికిపోయాడు. ఆ రౌడీ ముండాకొడుకే తన అల్లుడిని చంపి గుర్తు తెలియకుండా తల నరికి వేరేచోట పాతిపెట్టాడని కొత్తపేట పోలీస్ స్టేషన్‌లో రిపోర్టుచేశాడు.

పోలీసులు జగన్‌ని అరెస్టు చేశారు.

డబ్బుపోయి శని పట్టుకున్నట్లయిందని రాజమ్మ గోడు గోడున యేడుస్తూ, కనిపించిన వాళ్ళందరికీ సుబ్బయ్య చేసిన పని చెప్తూ, అటు ఏడు ఇటు ఏడు తరాల వారిని తిడుతూవుంది.

# 5

గాజులపల్లి హత్యకేసు ఫైలు చదువుతుంటే అంతా గజిబిజిగా కనిపించింది క్రైం ఇన్‌స్పెక్టర్ సురేంద్రకి.

శవం ఎవరిదో తేల్చుకోవడానికి ఇన్వెస్టిగేట్ చేసిన కేసులు యెన్నో వున్నాయిగాని ఒకే శవం తమది అంటూ ముగ్గురు వేర్వేరు వ్యక్తులు రిపోర్టు యిచ్చిన కేసు అతని సర్వీసులో ఇదే మొదటిది.

ముందు శవం ఎవరిదో తేల్చాలి!

తర్వాత హంతకులు ఎవరో కనిపెట్టాలి!!

"వెరీ రిస్కీ జాబ్" అన్నాడు సురేంద్ర.

"అందుకే గదా నీకు ఇచ్చింది" అన్నారు ఎస్.పి. నవ్వుతూ.

"ఐ విల్ ట్రై మై లెవెల్ బెస్ట్ సార్!" అన్నాడు సురేంద్ర.

"ప్రమోషన్ లిస్టులో వున్నావు. ఈ కేసు సక్సెస్ చేస్తే మంచిది."

"థాంక్స్."

"ఐ విష్ ఆల్ ది బెస్టు."

సెలవు తీసుకుని బైటపడ్డాడు సురేంద్ర.

ఇన్వెస్టిగేషన్ ఎక్కడ్నుంచి ప్రారంభించాలి? అని ఆలోచిస్తూ ఆఫీసు ఆవరణ దాటాడు.

తల లేని శవం తన భర్తది అని రిపోర్టు యిచ్చింది సీతమ్మ.

తన తమ్ముడు జానయ్య శవం అంటాడు కందిపాలెం పంచాయితీ ప్రెసిడెంట్ లింగయ్య.

తన అల్లుడు సుబ్బయ్యాని ఖూనీ చేశారు బాబోయ్! అని గొడవ పెడుతున్నాడు అంకమ్మశెట్టి.

ఆరోజు సెప్టెంబర్ 21వ తేదీ. అంటే హత్య జరిగి సరిగ్గా పదిరోజులైంది.

ఆలోచిస్తూ నిల్చున్న సురేంద్రకి రోడ్డు అవతల ఇరానీ హోటల్ స్వాగతం ఇచ్చింది.

అప్పుడతనికి ఆకలి జ్ఞాపకం వచ్చింది.

స్పెషల్ రూమ్‌లో కూర్చుని చికెన్ బిర్యానీకి ఆర్డర్ వేశాడు.

బిర్యాని ఏమంత బాగాలేదు. అది తింటున్నంతసేపూ ఎప్పుడో ఏలూరు రాజ్ విలాస్‌లో తిన్న బిర్యానీ జ్ఞాపకం వచ్చింది. అద్భుతంగా వుంది ఆరోజు. మూడు ప్లేట్లు లాగించాడు.

ఇన్వెస్టిగేషన్ ఏలూరునుంచే మొదలుపెడితే సరి అనుకున్నాడు.

రిక్షా వేసుకుని బస్టాండుకి వెళ్ళాడు.

విజయవాడ వెళ్ళే సూపర్ ఎక్స్‌ప్రెస్ రెడీగా వుంది. అందులో ఎక్కి కూర్చున్నాడు.

ఏలూరు చేరేసరికి రాత్రి ఎనిమిదయింది.

ఇక ఆ పూటకి రెస్టు తీసుకోవడమే శరణ్యం అనుకున్నాడు.

హోటల్లో రూమ్ తీసుకొని భోజనం చేసి నిద్రపోయాడు.

జగన్నాథం పని చేస్తున్న ఆఫీసు కలెక్టర్ ఆఫీసుకి దగ్గర్లోనే వుంది.

ఆ ఆఫీసు ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్‌ది.

సురేంద్ర విజిటర్స్‌రూమ్‌లో కూర్చుని స్లిప్ రాసి అటెండర్ ద్వారా పంపించాడు.

కాసేపటికి సురేంద్రకి పిలుపు వచ్చింది.

స్ప్రింగ్ డోర్ నెట్టుకుని వెళ్ళి విష్ చేసి కూర్చున్నాడు సురేంద్ర. తర్వాత ఐడెంటిటీ చూపించాడు.

"గ్లాడ్ టూ మీట్ యు" అన్నాడు యింజనీర్ సింగ్.

సురేంద్ర షేక్‌హాండ్ ఇచ్చాడు.

"ఐ వాంట్ యువర్ కోపరేషన్" అన్నాడు సురేంద్ర.

ప్రశ్నార్థకంగా చూశాడు ఇంజనీర్ సింగ్.

"జగన్నాథం అనే అటెండర్ మీ ఆఫీసులోనే పని చేస్తున్నాడు గదా!"

"అవును."

"ఆ కేసు ఇన్వెస్టిగేట్ చేస్తున్నాను."

"ఐ.సీ." అని తలూపుతూ "అతని వైఫ్ రోజూ ఆఫీసుకు వస్తూనే వుంది. జగన్నాథం ఎక్కడో మర్డర్ చెయ్యబడ్డాడనీ, అతనికి రావలసిన ఫ్యామిలీ బెనిఫిట్ ఫండ్, జి.పి.యఫ్., ఇప్పించమనీ అడుగుతూ వుంది. కాని యెలా యివ్వగలం? నేచురల్ డెత్ అయితే వెంటనే

యిచ్చి వుండేవాళ్ళం. బట్ ఇటీజ్ ఎ మర్డర్ కేస్. డెత్ సర్టిఫికెట్ లేకుండా ఇవ్వలేమని చెప్పేశాను. వచ్చి వెడుసుంది. ఐ పిటీ హెర్" అన్నాడు సింగ్.

"జగన్నాథం నాగార్జునసాగర్‌లో పనిచేస్తూ ఇక్కడికి ట్రాన్స్‌ఫరై వచ్చాడు."

"అవును."

"అతనితోపాటు అక్కడినుంచి వచ్చినవాళ్ళు ఇంకా ఎవరైనా వున్నారా?"

"లేకేం. నలుగురు వున్నారు."

"అందులో జగన్నాథంతో మూవ్ అయ్యేవారు ఎవరైనా వున్నారా?"

సింగ్ కాసేపు ఆలోచించి "వాళ్ళ అటెండర్ జేమ్సు వున్నాడు. ఇద్దరూ క్లోజుగా వుండడం నేను అనేకసార్లు గమనించాను" అన్నాడు.

"మీరు పర్మిషన్ ఇస్తే అతన్ని ఇంటర్వ్యూ చేస్తాను" అన్నాడు సురేంద్ర నవ్వుతూ.

"స్యూర్లీ...." అంటూ కాలింగ్ బెల్ నొక్కాడు సింగ్.

అటెండర్ వచ్చాక "జేమ్సుని పిలువు" అన్నాడు.

కాసేపటికి జేమ్సు వచ్చాడు.

నల్లగా పొడుగ్గా వున్నాడు జేమ్సు. మీసాలు పైపైనే వుంటాయి అతనికి.

"నీ పేరు జేమ్సు కదూ!" అన్నాడు సురేంద్ర.

"అవును సార్!" వినయంగా అన్నాడు జేమ్సు.

"జగన్నాథం నీకు స్నేహితుడా?"

"అవును సార్! ఇద్దరం ఒక్కసారే వుద్యోగంలో

చేరాం" అన్నాడు జేమ్సు పాత రోజులు జ్ఞాపకం చేసుకుంటూ.

"జగన్నాథం పేకాట ఆడతాడా?"

"ఆడతాడు సార్!"

"నువ్వు ఆడవా?"

"నాకు పేకాట రాదు సార్!" నవ్వుతూ అన్నాడు జేమ్సు.

"ఐ.సీ...." అంటూ నవ్వాడు సింగ్ గూడా.

"జగన్నాథం గురించి ఏం చెప్తావు?"

జేమ్సు బుర్ర గోక్కున్నాడు యేం చెప్పాలో అర్థం కాక.

"నీకు తెలిసింది చెప్పు. నీకేం ప్రమాదం లేదులే!" అన్నాడు ఇంజనీర్ హామీ ఇస్తూ.

"అందరికీ తెలిసిందే సార్. వాడు పేకాడతాడు. సారా తాగుతాడు."

"ఊఁ...."

"అంతే సార్."

"అతనికి నాగార్జునసాగర్‌లో వున్నప్పుడే పెళ్ళయింది గదా? ఈ వ్యసనాలున్నవాడికి పిల్లని ఎట్లా ఇచ్చారు?" ప్రశ్నించాడు సురేంద్ర.

"వాడికి పెళ్ళెక్కడయింది సార్? పెళ్ళి కాలేదు" అన్నాడు జేమ్సు.

"పెళ్ళి కాలేదా?" ఆశ్చర్యపోయాడు సురేంద్ర.

"మరి ఆవిడ ఎవరోయ్?"

"సీతమ్మ ఎవరు?"

ఇద్దరూ ఒకేసారి ప్రశ్నించారు.

"అది పెళ్ళాం కాదు సార్. ఉంచుకున్నాడు దాన్ని.

అది ముండల కంపెనీలో వుండేది సార్ సాగర్‌లో వున్నప్పుడు. అక్కడ పరిచయం జగన్నాథానికి. ట్రాన్స్‌ఫర్ అయ్యాక దాన్ని కూడా తెచ్చుకుని కాపురం చేస్తున్నాడు అంతే" అన్నాడు జేమ్సు.

అదంతా విని సింగ్ ఆశ్చర్యపోయాడు.

"ఇదంతా నాకు తెలీదు మిస్టర్ సురేంద్ర. ఇప్పుడే వింటున్నాను" అన్నాడు.

"ఐ.సీ." అన్నాడు సురేంద్ర.

"పోనీ యిప్పుడైనా ఆమె బుద్ధిగా వుంటుందా?" అన్నాడు సింగ్.

"ఎక్కడ సార్? కుక్కతోక వంకరే" నవ్వుతూ అన్నాడు జేమ్సు.

"మిస్టర్ జేమ్సు. జగన్నాథం సెలవు పెట్టకుండా ఎక్కడికో ఎందుకు వెళ్ళాడు? దానిమీద ఏమైనా చెప్పగలవా?"

జేమ్సు తల గోక్కున్నాడు.

"నాకు అదే అర్థంకావడంలేదు సార్!" అన్నాడు.

తర్వాత జేమ్సుకి "థాంక్స్" చెప్పాడు సురేంద్ర.

"జగన్నాథం సర్వీస్ బుక్ ఒకసారి తెప్పిస్తారా? అందులో అతని పుట్టుమచ్చలు నోట్ చేసివుంటారుగదా!" అన్నాడు.

"ఎస్....ఎస్...." అని కాలింగ్ బెల్ నొక్కి ఎస్టాబ్లిష్‌మెంట్ క్లర్క్‌ని పిలిపించి జగన్నాథం సర్వీస్ బుక్ తెప్పించాడు సింగ్.

సర్వీస్ బుక్‌లో అతని కుడిచేతిమీద ఒక పుట్టుమచ్చ, ముఖంమీద కుడి కంటిక్రింద ఒక మచ్చ వున్నట్లు రికార్డు చేసి వుంది.

తర్వాత సర్వీస్ బుక్‌లో వున్న జగన్నాథం చేతి వ్రేలి ముద్రలు, భూతద్దంతో పరిశీలించాడు.

గాజులపల్లిలో మర్డర్ చేయబడ్డవాడు జగన్నాథం కాదని తేలిపోయింది.

ఫింగర్ ప్రింట్స్ టాలీ కాలేదు.

పావుగంటసేపు సురేంద్ర చేస్తున్నదంతా గమనిస్తూ ఆసక్తిగా చూస్తున్నాడు సింగ్.

"గాజులపల్లిలో మర్డర్ చేయబడింది మీ అటెండర్ జగన్నాథం కాదు" అన్నాడు సురేంద్ర.

"మరి అతని భార్య అలా అంటుందేమిటి?"

సురేంద్ర మౌనం వహించాడు.

"అయితే జగన్నాథం ఏమైనట్లు?" అన్నాడు సింగ్.

"యూ డూ వన్ థింగ్" అన్నాడు సురేంద్ర.

ఏమిటి? అన్నట్లు చూశాడు సింగ్.

"జగన్నాథం కనిపించడంలేదని పోలీస్ రిపోర్టు ఇవ్వండి" అన్నాడు సురేంద్ర.

సింగ్ ఆలోచనలో పడిపోయాడు.

"ఎందుకు ఆలోచిస్తున్నారు? మీ రూల్సు పర్మిట్ చెయ్యవా?" ప్రశ్నించాడు సురేంద్ర.

"ఎందుకు చెయ్యవూ? అతని భార్య డబ్బుకోసం రోజూ ఆఫీసుకి వచ్చి అడుగుతున్నది. అప్లికేషన్ కూడా పెట్టింది తన భర్త గాజులపల్లిలో హత్య చేయబడ్డాడనీ తనకు రావలసిన డబ్బు ఇప్పించమనీ. డెత్ సర్టిఫికెట్ కోసం ఎదురుచూస్తున్నాము. ఆమె పెట్టిన అప్లికేషన్ రిఫర్ చేస్తూ డెత్ సర్టిఫికెట్ వెంటనే పంపమని పోలీసులకు లెటర్ రాస్తాను. దేర్ ఎండ్స్ ద మాటర్" అన్నాడు సింగ్.

"థాంక్స్ ఫర్ యువర్ కైండ్ కోపరేషన్" చెయ్యి కలుపుతూ అన్నాడు సురేంద్ర.

"నో మెన్షన్" అన్నాడు సింగ్ నవ్వుతూ.

సురేంద్ర ఆఫీసునుంచి బైట పడ్డాడు.

## 6

"మిష్టర్ కృష్ణమూర్తీ, సీతమ్మ ఘటికురాలోయ్! గుండెలు తీసిన బంటు అంటారు చూడు అటువంటిరకం" అన్నాడు సురేంద్ర తను ఏలూరులో ఇన్వెస్టిగేట్ చేసిన విశేషాలు చెపుతూ.

ఎస్.ఐ. కృష్ణమూర్తి ఆసక్తిగా వింటూ కూర్చున్నాడు.

"జగన్నాథం డెత్ సర్టిఫికెట్ పంపమని సీతమ్మ పెట్టుకున్న అప్లికేషన్ జత. చేస్తూ, పోలీసులకు రాశాడు వాళ్ల ఇంజనీర్. దాంతో తీగంతా లాగారు ఏలూరు సి.ఐ.డి. వాళ్ళు.

మర్నాడు నేను గూడ వాళ్ళకి క్లూ ఇచ్చాననుకో.

సీతమ్మని, ఆమె ప్రియుడు నాగరాజుని అరెస్టు చేసే సరికి అంతా బైట పడింది.

నాగరాజుకి నాలుగు తగిలించేసరికి తనూ, సీతమ్మ కలసి జగన్నాథాన్ని చంపినట్లు ఒప్పుకున్నాడు. అతని శవాన్ని శనివారపేట దగ్గర్లో ఏట్లో కప్పి పెట్టారు" అన్నాడు సురేంద్ర.

"సీతమ్మని చూడగానే ఇది బ్రోతల్ అనిపించింది గాని అనుమానించలేకపోయాను. ఎందుకంటే కొందరు కుల స్త్రీలు గూడా ఒక్కోసారి బ్రోతల్ కేసులే అని అనుమానం వస్తుంది. వాళ్ళ వేషధారణ అట్లా వుంటుంది మరి" అన్నాడు ఎస్.ఐ. కృష్ణమూర్తి.

"సరే ముగ్గురో జగన్నాథం గొడవ వదిలిపోయింది. పోతే కందిపాలెంలో జానయ్య యెవరో యేమిటో చూడాలి."

"వాళ్ళ అన్న డెత్ సర్టిఫికెట్ ఇవ్వమని ఒకటే గొడవ పెడుతున్నాడు."

"ఎందుకో అంత తొందర?"

"జానయ్య బాచ్‌లర్. పెళ్ళాం పిల్లలు లేరు."

"ఆస్తి కోసమా!"

"ఆస్తి యెక్కడికి పోతుంది? జానయ్య పేరుతో పాతిక వేలకి ఇన్సూరెన్సు పాలసీ వుంది. ఆ డబ్బుకోసం తిరుగుతున్నాడు. ఎల్.ఐ.సీ. ఫీల్డు ఆఫీసర్ గూడా వచ్చి కలిశాడు. ఆ శవం యెవరిదో యింకా తేలలేదనీ, డెత్ సర్టిఫికెట్ ఇవ్వడం సాధ్యపడదనీ చెప్పాను" అన్నాడు ఎస్.ఐ. కృష్ణమూర్తి.

"కందిపాలెం రేపు వెళ్ళాలనుకుంటున్నాను. ఆ ఏరియా ఎస్.ఐ. థామస్‌ది అనుకుంటాను" అన్నాడు సురేంద్ర.

కృష్ణమూర్తి తల వూపాడు.

# 7

జానయ్య కేసుగూడా జగన్నాథం కేసులాంటిదేమో నని అనుమానం పీడిస్తోంది సురేంద్రని.

కందిపాలెం వెళ్ళడానికి ఆర్టీసి బస్సు లేదు. ప్రైవేటు బస్ వుంది. రోడ్డు సరిగాలేక చెయ్యి తిన వాళ్ళకల్లా బస్ ఆపుకుంటూ కందిపాలెం వెళ్ళేసరికి రెండు గంటలు పట్టింది.

బస్సు ఆగిన సెంటర్‌కి దగ్గరోనే వుంది లింగయ్యగారి ఇల్లు. ఏమంత శ్రమ పడకుండానే యింటికి వెళ్ళాడు.

లింగయ్య పెద్దపులిలా హాల్లోనే కూర్చుని వున్నాడు చుట్టూ నలుగురు సిల్కు లాల్చీల పెద్దమనుషులు కబుర్లు చెపుతూ నవ్వుతూ వున్నారు.

సురేంద్రని చూసి "రండి....రండి...."అంటూ ఆహ్వా నించి కుర్చీ చూపించాడు లింగయ్య.

సురేంద్ర కూర్చుని ఐడెంటిటీ చూపించి "మీతో ఏకాంతంగా మాట్లాడాలి" అన్నాడు.

లింగయ్య పడక కుర్చీలోంచి లేచి "రండి...." అంటూ ఒక గదిలోకి దారి తీశాడు.

గది విశాలంగా వుంది. గదికి ఒక మూల టేకే వుడ్ టేబులు, దానిమీద స్టాండ్ వేసి పెద్ద అద్దం, ప్రక్కనే టెలిఫోను, రెండు కుర్చీలు వున్నాయి.

తను ఒక కుర్చీలో కూర్చుని "కూర్చోండి...." అన్నాడు.

"మీకు తెలిసిన సంగతే గదా! గాజులపల్లెలో తల లేని మొండెశవం తమ వాళ్ళదే అని నుగురు రిపోర్టు యిచ్చారు. అందులో ఏలూరు నుంచి వచ్చిన సీతమ్మ భర్త జగన్నాథంది కాదని ఇన్వెస్టిగేషన్‌లో తేలింది. ఇకపోతే మీ తమ్ముడు జానయ్య అంకమ్మశెట్టి అల్లుడు సుబ్బయ్యలలో ఒకరిదై వుండాలి."

సురేంద్ర మాటలు విని లింగయ్య సంతోషించినట్లే కనిపించాడు.

"మీరు తొందరగా డెత్ సర్టిఫికెట్ ఇప్పిస్తే మాకు వుపయోగం వుంటుంది" అన్నాడు.

"డెత్ సర్టిఫికెట్ ఎంతసేపట్లో వస్తుంది? ఆ శవం మీ తమ్ముడిగారిదని తేలాలిముందు" అన్నాడు సురేంద్ర.

"దానికి నన్నేం చెయ్యమంటారు చెప్పండి? ఎవరికి

యెవరితో చెప్పించాలి. డైరెక్టరితో హాస్పటల్లో సూప
ర్నెంట్ కి చెప్పించనా?" అన్నాడు లింగయ్య.

నరేంద్ర నవ్వి "అదేం అవసరం లేదు. ప్రస్తుతం జానయ్య వేలిముద్రలు దొరికితే చాలు. శవం అతనిదే అని నిర్ధారణ చేసి సర్టిఫికెట్ పంపిస్తాము" అన్నాడు.

"వాడు చచ్చిపోయి పదిహేను రోజులైంది కదా! వేలిముద్రలు యెక్కడ దొరుకుతాయి?" ఆశ్చర్యంగా అడిగాడు లింగయ్య.

"జానయ్య వాడుతున్న గది చూపిస్తే ట్రై చేస్తాను" అన్నాడు లింగయ్య.

లింగయ్య, జానయ్య వుండే గది తలాపులు తీశాడు.

గదిలో యెక్కువ సామాను లేదు. నవారు మంచం ఒక మూలవుంది. పరుపు చుట్టచుట్టి దానిమీద వుంది. రెండు కుర్చీలు, ఒక చిన్నటీపాయి వున్నాయి. గోడకి అలమారా వుంది. గోడకి అద్దం వ్రేలాడుతూ వుంది. ఒకమూల కూజా, గ్లాసు, దండెంమీద బట్టలు వున్నాయి.

అద్దంమీద, గ్లాసుమీద పౌడర్ చల్లాడు. వేలిముద్రలు రాలేదు. బట్టలు తీసి చూశాడు. అన్నీ తెల్లవే వున్నాయి. టైలర్ స్లిప్పులుగాని, చాకలి మార్కులుగాని కనిపించలేదు.

ఇంతలో ప్రక్కగదిలో టెలిఫోన్ మ్రోగింది. లింగయ్య గది బైటకి వెళ్ళాడు.

కాసేపటికి లోపలకి వస్తూ "ఇన్స్పెక్టర్ గారూ! మా జానయ్య బ్రతికే వున్నాడండీ" అన్నాడు.

సురేంద్ర నివ్వెరపోతూ "ఎక్కడున్నాడు?" అన్నాడు.

"బొంబేలో వున్నాడు. ఫోన్ వచ్చింది" అన్నాడు లింగయ్య.

"ఐయామ్ వెరీ గ్లాడ్" అన్నాడు సురేంద్ర లింగయ్యకి షేక్‌హాండ్ ఇస్తూ.

లింగయ్య నవ్వాడు. కాని ఏమంత సంతోషం వ్యక్తపరచలేదు.

"నాకు పని తప్పింది లెండి" అని నవ్వుతూ సెలవు తీసుకున్నాడు.

## 8

హెడ్‌క్వార్టర్స్‌కి వచ్చాక ఎస్.పి. చెప్పిన మాటలు విని ఆశ్చర్యపోయాడు సురేంద్ర.

"సుబ్బయ్య మామగారింటికి తిరిగి వచ్చాడట. కేసు విత్‌డ్రా చేసుకున్నాడు" అన్నాడు.

"ఇన్నాళ్ళూ ఎక్కడున్నాడు?"

"వాళ్ళ స్వగ్రామం వెళ్ళాడట. అక్కడ తన పేరుతో వున్న పొలం అమ్మి డబ్బు తెచ్చి అప్పులు తీర్చాడట."

"చంపాడు పొండి. వెళ్ళేవాడు మామకి చెప్పకుండా ఎందుకు వెళ్ళాడు?"

"అదే సస్పెన్స్."

"మన ప్రాణాలు తియ్యడానికి" నవ్వాడు సురేంద్ర.

"ఇటువంటివాళ్ళే మన డిపార్టుమెంటుకి శ్రీరామ రక్ష." నవ్వాడు ఎస్.పి.

"అనవసరంగా జగన్‌ని అరెస్టు చేశాం కదండీ."

"అప్పటి పరిస్థితి అటువంటిది."

"అయితే కేస్ రికార్డు చేస్తే పోతుంది."

"నేనూ అదే అనుకుంటున్నాను" అన్నాడు ఎస్.పి.

"మొండి శవం ఎవరిదో తేలకుండా కేసు మళ్ళీ మొదటికే వచ్చింది" అన్నాడు.

"ఏం చేస్తాం? ఒక్కో కేసు అలా వుంటుంది."

# 9

మిర్యాలగూడాలో రైసుమిల్లు ఓనర్ రత్నారావు సురేంద్రకి స్నేహితుడు. అక్కడ మేడ కట్టాడు యీ మధ్యనే. గృహప్రవేశానికి తప్పకుండా రమ్మని యిన్విటేషన్ కార్డుకి పర్సనల్ లెటర్ పిన్ చేసి రిజిష్టర్ పోస్టులో పంపాడు.

వెళ్ళకపోతే నొచ్చుకుంటాడని ఒకరోజు ముందుగానే వెళ్ళాడు.

గృహప్రవేశం గొప్పగా జరిగింది.

రత్నారావు, అతని భార్య బలవంతం చేస్తే మరొక రెండు రోజులు వాళ్ళింట్లోనే అతిథిగా వుండిపోయాడు సురేంద్ర.

అప్పటికే వచ్చి మూడురోజులైంది. ఇక ఆ సాయంకాలం వెళ్ళడానికి నిర్ణయించుకున్నాడు.

మధ్యాహ్నం భోజనం చేసి పాన్ వేసుకుంటూ రత్నారావుతో కబుర్లు చెపుతూ కూర్చున్నాడు సురేంద్ర.

ఇంతలో రత్నారావు కొడుకు పద్నాలుగేళ్ళవాడు వచ్చి "నాన్నా! ఈ లెటర్ అమెరికానుంచి వచ్చిందా?" అంటూ తండ్రి చేతికి ఒక ఇన్‌లాండ్ లెటర్ అందించాడు.

రత్నారావు కొడుకు ప్రక్కనే, అదే వయస్సున్న మరో కుర్రాడు నిల్చుని వున్నాడు.

"ఎవరన్నారు అమెరికానుంచి వచ్చిందని?" అన్నాడు రత్నారావు నవ్వుతూ.

"సుబ్రహ్మణ్యం అంటున్నాడు నాన్నా!" అన్నాడు రత్నారావు కొడుకు.

సుబ్రహ్మణ్యం అనే పుత్రుడు ఒక్క మొఖం వేసి "నిజం మావయ్యగారూ! ఇది అమెరికానుంచి వచ్చిందే. మా సూర్యం మావయ్య రాశాడు. కావాలంటే చదవండి" అన్నాడు.

"ఆ లెటర్ ఇటివ్వు నేను చూస్తాను" అని సురేంద్ర తీసుకుని చూశాడు.

అది ఇన్‌లాండ్ లెటర్. హైదరాబాద్ జి.పి.ఓ.లో పోస్టు చేసినట్లు ముద్ర వుంది దానిమీద. సెప్టెంబర్ ఇరవై రెండు అని తారీఖు వుంది.

అందులో ఇలా వుంది.

"ప్రియమైన అక్కగారికి అనేక నమస్కారములు చేసి వ్రాయునది—

నేను మన వూరునుంచి బొంబాయికి వచ్చి విమానంలో అమెరికా వెళ్ళాను.

మన తెలుగువాళ్ళు చాలమంది వున్నారు. ముఖర్జీ గారని తెలుగాయన యింట్లోనే వుంటున్నాను. పిల్లలకి ఆహారం తయారుచేసే ఫ్యాక్టరీలో పని చేస్తున్నాను. నెలకి ఆరువేలు జీతం వస్తోంది. కాని ఖర్చులు యెక్కువ. నెలకి వెయ్యికంటే ఎక్కువ మిగలవు.

నీకు డబ్బు పంపడానికి ఇక్కడ గవర్నమెంటు ఒప్పుకోదని తెలిసింది. కాబట్టి నేను ఒక సంవత్సరం ఆగిన తర్వాత వస్తాను. వచ్చేటప్పుడు డబ్బు గాని లేకపోతే ఏవైనా వస్తువులుగాని తెస్తాను.

బావగారికి నా నమస్కారములు. సుబ్రమణ్యా నికి నా ముద్దులు.

ఇట్లు,
మీ తమ్ముడు,
సూర్యం."

అది చదివి దీర్ఘంగా నిట్టూర్చాడు సురేంద్ర.

దాన్ని మడతపెట్టి పట్టుకుని "బాబూ! సుబ్రమణ్యం మీ అమ్మ పేరు ఏమిటి?" అన్నాడు.

"మా అమ్మ పేరు కమలమ్మండీ!" అన్నాడు.

"కమలమ్మ నీకు తెలుసురా!" అన్నాడు సురేంద్ర.

"తెలుసురా. వీళ్ళకి ప్రక్కవూళ్ళో పొలాలున్నాయి. ఆమె తమ్ముడు యేదో వుద్యోగం దొరికిందని అమెరికా వెళ్ళాడట. నాకూ వాళ్ళతో ఏమంత టచ్ లేదు. పోతే మనవాడికి స్నేహితుడు" అన్నాడు.

"మొత్తానికి యిందులో యేదో మోసం వున్నట్లు నాకు అనుమానంగా వుంది" అన్నాడు సురేంద్ర.

"నీ పోలీసు బుద్ధి పోనిచ్చుకున్నావుగాదు. ఎప్పుడూ వెధవ అనుమానాలే నీకు" అన్నాడు రత్నారావు నవ్వుతూ.

"ఈ లెటర్ చదివిచూడు, నీకే తెలుస్తుంది. అమెరికా నుంచి రాస్తున్నా నంటాడు. పోస్టులో వేసింది హైదరాబాదులో."

సురేంద్ర లెటర్ రత్నారావుకి అందించాడు.

రత్నారావు అది చదివి "తమ్ముడు అక్కకి రాశాడు లెటర్. అక్కని మోసం చెయ్యాల్సిన పనేముంది?" అన్నాడు.

"అదే గమ్మత్తుగా వుంది. మొత్తానికి ఈ సూర్యం

అమెరికా వెళ్తున్నానని ఇక్కడ దగ్గర డబ్బేమైనా తీసుకెళ్ళి వుండవచ్చును. అక్కడికి అనుమానం రాకుండా యీ లెటర్ రాసివుంటాడు. ఇతను హైదరాబాద్‌లోనే వుండి వుంటాడు" అన్నాడు సురేంద్ర.

"పోనియ్. అతని గొడవ మన కెందుకు?" అన్నాడు రత్నారావు.

సురేంద్ర మాట్లాడలేదు. అతని బుర్రలో అనుమానం పురుగు జేరి తొలుస్తూ వుంది.

"ఏమిట్రా ఆ దీర్ఘాలోచన? కొంపతీసి ఈ లెటర్ పట్టుకుని యిన్వెస్టిగేషన్ మొదలుపెడతా వేమిటి?" అన్నాడు రత్నారావు నవ్వుతూ.

"అవును" అన్నాడు సురేంద్ర పరధ్యానంగా.

"ఎంత పోలీసు బుద్ధి అయితే మాత్రం ఇదేం బుద్ధిరా నీకు? ఎక్కడబడితే అక్కడ ఇన్వెస్టిగేషన్ మొదలు పెట్టడమేనా?" అన్నాడు రత్నారావు.

సురేంద్ర నవ్వి "నీకు అదంతా తర్వాత చెప్తాను" అని "బాబూ! సుబ్రమణ్యం మీ యిల్లెక్కడ?" అన్నాడు.

"నల్లగొండ పోయే రోడ్డులో వుందండీ!" అన్నాడు సుబ్రమణ్యం.

"దగ్గరేనా?"

తల వూపాడు ఆ కుర్రాడు.

"పద పోదాం" అని ఆ కుర్రాడి వెనుకే నడిచాడు సురేంద్ర.

ఆ ఇంట్లో నడివయస్సు ఆమె తప్ప ఎవరూ లేరు. వాకిట్లో కూర్చుని బియ్యం ఏరుకుంటున్నదల్లా తన కొడుకు వెనకే వస్తున్న సురేంద్రని చూసి లేచి నిల్చుంది.

ఆమె కమలమ్మ అని గ్రహించి "నమస్కారమండీ! నేను సురేంద్రను. పోలీస్ డిపార్టుమెంటులో పని చేస్తున్నాను. మీతో కొంచెం పని వుండి వచ్చాను" అన్నాడు.

పోలీస్ పేరు వినగానే ఆమె కొంచెం కలవరపడినట్లు కనిపించింది. ప్రతిసమస్కారం చేసి "రండి....లోపల కూర్చొంనురుగాని" అని కుర్చీ తెచ్చి వేసింది.

సురేంద్ర కూర్చుని "మీ తమ్ముడు సూర్యం రాసిన లెటర్ చదివి వచ్చాను" అన్నాడు.

"మా తమ్ముడు మీకు తెలుసా?" ఆనందంతో అంది.

"లేదు." అన్నాడు.

ఆమె అర్థం కానట్లు ముఖం చిట్లించి చూసింది.

"మీ తమ్ముడు అమెరికా వెళ్ళి అక్కడనుంచి లెటర్ రాశాడని మీరు అనుకుంటున్నారు గదూ!" అన్నాడు.

ఆమె తల వూపింది.

"అతను అమెరికా వెళ్ళలేదు. హైదరాబాద్ నుంచి ఆ లెటర్ రాశాడు" అన్నాడు సురేంద్ర.

ఆమె ఆశ్చర్యంగా చూసింది కళ్ళు పెద్దవిచేసి.

"నాకు చదువు రాదు. వాడి బావగారికి కూడా చదువు రాదు. ఏదైనా వుత్తరంమాకొస్తే పీడే చదివి వినిపిస్తాడు. మాకేం తెలుస్తుంది ఎక్కడ్నుంచి వచ్చిందీ?" అంది కమలమ్మ.

"మీరు వున్న సంగతి వున్నట్లుగా చెప్తే మీ తమ్ముడు ఏ వూళ్ళో వున్నదీ చెప్పగలుగుతాం" అన్నాడు.

"అడగండి" అంది ఆమె.

"మీ తమ్ముడు అమెరికా వెళ్ళడానికి డబ్బు ఏమైనా తీసుకెళ్ళాడా?"

"విమానం చార్జీలకని ఆరువేలు కావాలని పోరుపెట్టి

పట్టుకెళ్ళాడు. వాళ్ళ బావగారు మూడు ఇవ్వనని మొండి కేస్తే తన పొలం అమ్మి యివ్వమని పోట్లాడాడు."

"అయితే అతని పొలం యెక్కడుంది?"

"మా పొలం ప్రక్కనే."

"మీకు అమ్మనాన్న ఎక్కడున్నారు?"

"ఇద్దరూ పోయారు. వీడిని మేమే పెంచాం. వాడి పొలం వాళ్ళ బావే చూస్తున్నాడు. వాడు బి.ఏ. చదివి వుద్యోగంకోసం తిరుగుతున్నాడు. పొలం పని చేస్తే చెయ్యనని మొండికేశాడు."

సురేంద్ర కళ్ళు మూసుకుని వింటున్నాడు.

"ఆ మెరికాలో మీ బంధువులు యెవరైనా వున్నారా?...."

"ఎవరూ లేరు."

"మరి అ మెరికా వెళ్ళడానికి మీరెలా ఒప్పుకున్నారు? చాలదూరం కదా?"

"ఎవరో స్నేహితుడు వుద్యోగం యిప్పిస్తాడని చెప్పాడు."

"అతన్ని మీరు ఎప్పుడైనా చూశారా?"

"అతను హైదరాబాద్‌లో యేదో ఫ్యాక్టరీలో పని చేస్తున్నాడు. మా యింటికి ఒక్కసారే వచ్చాడు. అతనితో పాటు మా ప్రక్కింట్లో పాండుగూడా వచ్చాడు. పాండుకి అతను బాగా తెలుసు. పాండు ద్వారానే అతను మా తమ్ముడికి స్నేహితుడయ్యాడు" అంది కమలమ్మ.

"ఐ. సీ...." అన్నాడు సురేంద్ర తల వూపుతూ.

"ఏమిటి?"

"ఏంలేదు. అ మెరికా వెళ్ళేరోజున పాండు గూడా మీ తమ్ముడితోపాటు ఈ వూరినుంచి వెళ్ళాడా?"

"ఆఁ.... వెళ్ళాడు. బస్సులో హైదరాబాద్ వరకూ వెళ్ళి విమానం యెక్కించి వస్తానని చెప్పి వెళ్ళాడు" అంది కమలమ్మ.

సురేంద్ర మౌనంగా ఆలోచిస్తూ కూర్చుండిపోయాడు.

# 10

సాయంకాలం చీకటిపడుతూ వుండగా పోలీస్ వాన్ వచ్చి పాండు ఇంటిముందు ఆగింది.

పాండు సినిమాకి వెళ్దామని ముస్తాబై యింట్లో నుంచి బైటికి వచ్చాడు.

పోలీస్ కానిస్టేబుల్సు హఠాత్తుగా అతన్ని చుట్టుముట్టి పట్టుకుని వాన్‌లో ఎక్కించారు.

"నీ పేరు పాండు గదూ?" సి.ఐ. ప్రశ్నించాడు.

"అవున్సార్!" ముచ్చెమటలు పోస్తూ వుండగా అన్నాడు పాండు.

"నిన్నెందుకు తీసుకొచ్చామో తెలుసా?"

"తెలియడంలేదు సార్! నేనేం పాపం చెయ్యలేదు సార్!" వణుకుతున్న కంఠంతో అదురుతున్న గుండెలతో అన్నాడు.

"మీ ఫ్రెండు సూర్యం గుర్తున్నాడా?"

పాండు తెల్లముఖం వేశాడు సూర్యం పేరు వినగానే. భయంతో శరీరం వణికిపోసాగింది.

"ఆ దేనయ్యా! అమెరికా వెళ్ళాడు చూడు అతను."

తల వూపాడు నీరసంగా.

"నువ్వే దగ్గరుండి విమానం ఎక్కించావు గదూ!"

"అవును సార్!"

"ఎక్కడ? హైదరాబాద్‌లోనా? బొంబాయిలోనా?"

"హైదరాబాద్‌లో సార్!"

"ఆ ప్లేన్ హైదరాబాద్ నుంచి సూటిగా వెళ్తుందా? లేక మధ్యలో ఆగుతుందా?"

"నాకు తెలియదు సార్!"

"అమెరికా వెళ్ళాక సూర్యం లెటర్ రాశాడా నీకు?"

"ఇంకా రాయలేదు సార్!"

"ఇంకేం రాస్తాడు. పాపం అతను అమెరికా వెళ్ళ లేదుగా!"

పాండు ఆశ్చర్యంగా చూశాడు.

"నిన్ను తీసుకురమ్మని కబురు చేశాడు."

పాండు నివ్వెరపోయాడు.

"సింగాపూర్‌లో వున్నాడు ప్రస్తుతం. అతన్ని చూడా లని వుందా?" నవ్వుతూ అన్నాడు సి.ఐ.

పాండు నోటివెంట మాటలు రాలేదు.

"నిజం చెప్తావా? లేక సూర్యం దగ్గరికి వెళ్తావా?"

'సూర్యం దగ్గరికి వెళ్ళడం అంటే!' పాండు కళ్ళు పెద్దవి కమ్మాయి.

అమాంతం సి.ఐ. కాళ్ళమీద పడిపోయాడు. "నాకేం తెలియదు సార్! నన్ను రక్షించండి." అన్నాడు యేడుస్తూ.

సి.ఐ. నవ్వుతూ "కుర్రాడు బుద్ధిమంతుడే!" అని పైకి లేవదీస్తూ "లే నాయనా.... లే.... జరిగిందంతా చెప్పా వంటే నీకేం కష్టం కలగదు. నిజం చెప్పు చాలు" అన్నాడు.

పాండు జరిగిందంతా చెప్పాడు:

బ్లాక్ బెల్లు బాలు తన ఫ్రెండ్స్ మూలంగా హైదరా బాద్ లో ఒక బార్ లో పరిచయమయ్యాడు. సోడా కలుపుకోకుండా ఫుల్ బాటిల్ త్రాగి కంట్రోల్లో వున్న బాలు అంటే ఆకర్షింపబడ్డాడు పాండు.

అతను చెప్పిన కబుర్లుగూడా యెంతో విచిత్రంగా వున్నాయి. తను తరుచు ఫారిన్ గూడా వెళ్తుంటాననీ, కస్టమ్స్ వాళ్ళ కళ్ళు గప్పి స్మగుల్డు వాచీలు, గోల్డు, కెమెరాలు తెచ్చి అమ్ముతుంటాననీ తన గురించి చెప్పాడు. సంపాదించిన డబ్బంతా బార్ లలోను, కాల్ గర్ల్స్ కి ధారపోస్తుంటానని గర్వంగా అన్నాడు.

అతని మాటలు వింటూవుంటే తాముగూడా అలా స్మగ్లర్స్ గా మారి అతను అనుభవించే సుఖాలు అనుభవించాలన్నంత ఇన్స్పిరేషన్ కలుస్తుంది. అతని నివాసం సనత్ నగర్ లో చిన్న గది.

పాండు అతని అడ్రస్ గుర్తు పెట్టుకుని వెళ్ళాడు మర్నాడు.

అతను యెన్నెన్నో విషయాలు గటగటా మంచినీళ్ళు త్రాగుతున్నంత సులభంగా చెప్పాడు.

పాండు నిరుద్యోగి అని తెలిసి జాలిగా చూసి నవ్వాడు.

అమెరికాలో గోల్డు వుండేవాళ్ళకి నెలకి పదివేలు జీతం ఇస్తారని, వాళ్ళు కార్లలో వచ్చి పని చేస్తారనీ విని నివ్వెరపోయాడు పాండు.

"నువ్వు అమెరికా వెళ్తావా? ఏదోక వుద్యోగం దొరుకుతుంది. నిన్ను పంపించే బాధ్యత నాది" అన్నాడు.

ముందు వెనుకా ఆలోచించకుండా తల వూపాడు పాండు!

"అయితే ఎనిమిదివేలు సంపాదించు వెంటనే!" అన్నాడు.

"ఎందుకు?" అన్నాడు ఆశ్చర్యపోయి.

"షిప్ చార్జెస్. అదీగాక వీసా సంపాదించాలి. షిప్‌లో వెళ్తే ఆరు నెల్లు పడుతుంది. అదీకాక షిప్ సరిగా వెళ్తుందో లేదో మధ్యలో ఏ తుఫానుకో మునుగుతుందో తెలియదు" అన్నాడు.

పాండు యెంతో సంతోషంతో తనవూరు తిరిగి వచ్చాడు.

కాని అతను దేశంవదిలి వెళ్ళడానికి ఇంట్లో వాళ్ళు ఒప్పుకోలేదు.

పాండువల్ల అంతా విన్న సూర్యం అమెరికా వెళ్ళడానికి వుబలాట పడ్డాడు. సూర్యం దాదాపు ఏడెనిమిది యేళ్ళగా రకరకాల ఇంటర్వ్యూలకు వెళ్ళి ఉద్యోగం దొరక్క నిరాశతో వున్నాడు. అందుకే అతను ఎక్కడికైనా వెళ్ళిపోవడానికి సిద్ధపడ్డాడు.

ఇంట్లో అక్కా, బావలతో పోట్లాడి డబ్బు సంపాదించాడు సూర్యం.

బాలుకి టెలిగ్రాం ఇచ్చి పిలిపించాడు పాండు. బాలుకి సూర్యాన్ని పరిచయం చేశాడు. ముగ్గురూ హైదరాబాద్ బయల్దేరారు.

మధ్యలో బస్సు చెడిపోయింది.

దగ్గర్లో యేదైనా వూళ్ళో గడిపి మర్నాడు వెళ్దామన్నాడు బాలు. అప్పటికే బాగా చీకటి పడింది. బస్సు బాగుపడే దారిలేదు. అందుకని ముగ్గురూ కలిసి చేలకి అడ్డంగా నడిచి గుబురుగావున్న ఒక చెట్టుక్రింద ఆగారు.

సమీపంలో ఒక పూరిల్లు వుంది. ఊరికి చాలా దూరంలో వుంది ఆ యిల్లు.

ఆ ఇంట్లో నడివయస్సు ఆమె వుంది. ఆమెకు నలభై దాటివుంటాయి. లావుగా బలంగా వుంది.

బస్సు చెడిపోయిందనీ, తెల్లారేవరకూ హైదరాబాద్ వెళ్ళే మార్గంలేదనీ తమకి అన్నంపెడితే డబ్బు ఇస్తామని బాలు ఆమెను బ్రతిమాలాడు.

ఆమె వాళ్ళ మాటలు విని జాలిపడింది. ఒక గంటలో వంటచేసి పెడతాననీ తన భర్త పనిమీద పొరుగూరు వెళ్ళాడనీ, వాళ్ళు పడుకోవడానికి ఒక చావడి చూపించింది.

మూలనున్న గోతాలకట్ట విప్పియిచ్చింది. అవి పరుచుకుని లాంతరు పెట్టుకుని కూర్చున్నారు.

బాలు విస్కీబాటిల్ తీశాడు. బ్యాగ్‌లోవున్న పకోడీ పొట్లం విప్పాడు. సగంపైగా బాలు త్రాగాడు. పాండు, సూర్యం కొద్దికొద్దిగా పుచ్చుకున్నారు.

గంట తర్వాత ఆమె భోజనం పెట్టింది. తిని వచ్చాక పడుకున్నారు.

ఒక రాత్రివేళ ఆమె కేకలు విని మేలుకున్నారు పాండు, సూర్యం.

ప్రక్కన బాలు లేడు. పరుగున వెళ్ళిచూస్తే ఏముంది బాలు ఆమెను బలవంతం చేస్తున్నాడు.

సూర్యం బాలుని లాగివేశాడు. అన్నంపెట్టిన స్త్రీని బలాత్కారం చేస్తున్నందుకు బాలుని బాగా తిట్టాడు. బాలుకి కోపంవచ్చి సూర్యాన్ని డొక్కల్లో పొడిచాడు. సూర్యం యెదురుతిరిగి గూబమీద కొట్టాడు బాలుని.

ఇద్దరు బాగా కొట్టుకున్నారు. పాండు అడ్డం వెళ్ళినా లాభం లేకపోయింది. ఆ తన్నుకోవడంలో యేమైందో, బాహుశా సూర్యం కణతలకి దెబ్బ తగిలిందేమోగాని కదల కుండా పడిపోయాడు.

సూర్యం చనిపోయాడని తెలిసినా బాలు కొంచెం గూడా భయపడలేదు. ఈ సంగతి యెవరికైనా చెప్తే తను జైలునుంచి వచ్చిన తర్వాతైనా ఆమెను చంపు తానని బెదిరించాడు. ఆమె యెవ్వరికీ చెప్పనని చెప్పింది.

పాండు విపరీతంగా వణికిపోయాడు.

తర్వాత బాలు, పాండు, సూర్యం శవాన్ని దాదాపు మైలుదూరం మోసుకుపోయారు. పొలాలు లేనిచోటు చూసి గొయ్యి తీశారు. సూర్యం తలని మొండెం నుంచి వేరు చేశాడు బాలు కత్తి తీసుకుని. ఆ తలని మరొక ఫర్లాంగు దూరంలో పాతిపెట్టారు.

సూర్యం జేబులోవున్న ఏడువేలలో రెండువేలు పాండుకి ఇచ్చి యీ విషయం ఎక్కడైనా పొక్కితే తనకీ అదే గతి పడ్తుందని హెచ్చరించాడు బాలు.

మర్నాడు హైదరాబాద్ వెళ్ళిపోయారు. తను అమె రికా చేరుకున్నట్లు తర్వాత లెటర్ రాసి ఆమె అక్కకు వేశాడు బాలు.

అదీ కథ.

అంతా విని దీర్ఘంగా నిట్టూర్చాడు సురేంద్ర.

మర్నాడు హైదరాబాదులో బాలుని అరెస్టుచేశారు.

—: అయిపోయింది :—

పోయాడు. మిగతా మనుషులు భయంగా ఆగిపోయారు.

"ఒక్కొక్కరే యిలా చస్తారా? లేక వెనక్కు పోతారా?"

గురువులు హెచ్చరిక వింటూ వాళ్ళు భయభ్రాంతులై ఆగిపోయారు. గురువులు శ్రద్ధగా టెలివిజన్ని గమనిస్తున్నాడు.

కాసేపు ఆగి వాళ్ళు మళ్ళీ ముందుకు కదిలారు. గురువులు యింకో మనిషిని హతం చేశాడు. అలా మొత్తం ముగ్గురు ప్రాణాలు కోల్పోయారు. అప్పటికి పోలీసులు వెనక్కు తిరిగారు. కాసేపటికి టెలివిజన్లోని కాంతి మాయమయింది.

గురువులు మళ్ళీ కంట్రోల్ మిషన్లోని రెండు మీటలు నొక్కి "బంగళాల్లోవున్న వారందరికీ హెచ్చరిక. కంట్రోల్ రూం మా వశమైంది. మేమెవ్వరో త్వరలోనే మీరు తెలుసుకుంటారు. ఈలోగా మీరు ఒకరొకర్కుగా బయల్దేరి కాలనీ నుంచి బయటకు వచ్చి మాకు లొంగిపోవలసిందిగా కోరుతున్నాము. అలా చేయని పక్షంలో కాలనీ అంతా పేల్చేయబడుతుంది. సరిగ్గా ఒక గంట మాత్రం గడువు" అన్నాడు.

"ఇదంతా చాలా విచిత్రంగా వుంది. ఈ కాలనీనిగానీ ఇక్కడి యేర్పాట్లనుగానీ నాశనం చేయాలని నేననుకోవడంలేదు. శాంతియుతంగా అందర్నీ లొంగదీసుకోగలిగితే మంచిది" అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ.

"ఈశ్వరి మీకు దారి చూపిస్తుంది. మీరు మీ మనుషుల్ని మారంగా వుంచి కాలనీ నుంచి బయటకు వచ్చిన ఒకొక్కరినే బంధించండి" అన్నాడు గురువులు.

"అది చాలా కష్టమైన పని. ఎవరిదగ్గరైనా ఆయుధ

ముండవచ్చు. ఎక్కడైనా మోసం జరగవచ్చు...."
అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ.

గురువులు తన దగ్గరవున్న పుస్తకాన్ని శ్రద్ధగా మరో సారి చూచాడు. అలా చూస్తూండగా అతని కళ్ళు మెరిశాయి.

"నేను శ్రద్ధగా చూడలేదు. నా హెచ్చరిక పూర్తి కాగానే కాలనీ అంతా ఒకరకమైన గ్యాస్‌తో నిండి పోతుంది. ప్రస్తుతం అక్కడున్న వారందరూ స్పృహలో వుండరు. వారికి స్పృహ రావడానికి కొన్ని గంటలు పట్టవచ్చు. ఈలోగా మీరు వెళ్ళి వాళ్ళను బంధించండి. కాలనీలో యెక్కడెక్కడ యెవరుంటారో యెంతమంది వుంటారో ఈ పుస్తకంలో వివరంగా వుంటాయి. తీసుకు వెళ్ళండి. ఎవరినీ వదలవద్దు" అన్నాడు గురువులు.

శ్రీకృష్ణపరమాత్మ ఈశ్వరనీ, తన మనుషుల్నీ వెంట బెట్టుకుని బయటకు వెళ్ళిపోయాడు. సంతోషం ఆయన ముఖంలో కొట్టవచ్చినట్లు కనబడుతోంది.

గురువులు అక్కడున్న యంత్రాలనూ, ఇతర వివరాలనూ శ్రద్ధగా గమనిస్తూ అర్ధం చేసుకోడానికి ప్రయత్నిస్తున్నాడు. తనపని సుకరమవుతుందనీ, కష్టాలన్నీ గట్టెక్కాయనీ అతనికి చాలా సంతోషంగా వుంది. ఇప్పుడు శ్రీకృష్ణపరమాత్మ తనకే విధంగా సహాయపడగలడో చూడాలి. సమాజంలో తనూ అందరిలో సమంగా జీవించాలని వుబలాటపడుతున్నాడు. అందుకు శ్రీకృష్ణ పరమాత్మ సాయం కావాలి!

* * *

కంట్రోల్ రూంలో ఎవరో వస్తున్న అలికిడి విని గురువులు అటుతిరిగి మిషన్ మీద ఒక మీటపై చేయివేసి

సిద్ధంగా వున్నాడు. అయితే ముందుగా అతనికి కనిపించిన వ్యక్తి శ్రీకృష్ణపరమాత్మ. గురువులు మీటమీద చేయి తీసివేశాడు.

ఆ పక్కనున్న మనిషి ఎవరో అతనికర్థం కాలేదు. శ్రీకృష్ణపరమాత్మ అనుచరుడేమో అనుకున్నాడు కానీ ఇంతదాకా చూసిన గుర్తులేదు.

"గురువులూ, కొండను త్రవ్వి ఎలుకను పట్టినట్లయింది నా పని! ఇక్కడి వ్యవహారాలు నడిపిస్తున్న అంతర్జాతీయ గూఢచారి శాఖకు నాయకుడు యెవరో కాదు. నా స్నేహితుడు" అన్నాడు పరమాత్మ.

"అంటే?" అన్నాడు గురువులు.

"మా ఇద్దరి పరిచయం ఈనాటిది కాదు. వృత్తిరీత్యా ఇద్దరమూ ఒకటే కానీ డిపార్టుమెంట్సు వేరు. ఈ ప్రపంచంలోని ఎక్కడెక్కడి అపూర్వవస్తువులనూ, కళాఖండాలనూ గురించి, సేకరించి ఏ దేశంలో ఎక్కువ ధర పలికితే ఆ దేశంలో అమ్మివేసే ప్రపంచ సమస్థ ఒకటుంది. ఆ ప్రపంచ సంస్థ భారతీయ విభాగానికి నేను నాయకుణ్ని.

వృత్తిరీత్యా నేనూ యితడూ చాలాసార్లు ఒకరికొకరు తటస్థపడ్డాము. ఒకరికొకరు సాయం చేసుకుని ఇద్దరమూ ఇబ్బందుల నుంచి బయటపడ్డ సందర్భాలు చాలా వున్నాయి.

అయితే ఒకరిని గురించి ఒకరికి పూర్తి సమాచారాలు తెలియవు. నీ మూలంగా మాకు ఒకరిని గురించి ఒకరికి తెలిసింది. నీకు చాలా చాలా థాంక్స్. ఇంతకాలం విడి విడిగా రెండు సంస్థలుగా వుంటున్న మేము యీ రోజు నుంచీ చేతులు కలిపి ఒకటి కాదలిచాము" అన్నాడు

శ్రీకృష్ణపరమాత్మ.

"అంతేకాదు మిస్టర్ గురువులూ! నువ్వు మెరికలాంటి మనిషివి. నీలాంటివాడు మాకు కావాలి. నువ్వు మాకు అనుచరుడుగా వుండిపో. నీ జీవితం స్వర్గతుల్యంగా వుంటుంది" అన్నాడు బాస్.

గురువులు నిరుత్సాహంగా "ప్రమాదాలు, సాహస చర్యలమీద నాకింక మోజులేదు. సాఫీగా జీవితం గడపాలని వుంది. వాగ్దానం చేసిన ప్రకారం నాకూ, ఈశ్వరికీ ప్రశాంత జీవితం ప్రసాదించు పరమాత్మా!" అన్నాడు.

"సమర్థులను వదిలిపెట్టడం శ్రీకృష్ణపరమాత్మకు నచ్చదు. నువ్వు మాతోనే వుండాలి" అన్నాడు శ్రీకృష్ణ పరమాత్మ.

"ఒప్పుకోకపోతే!" అన్నాడు గురువులు.

"నీకు మళ్ళీ ప్రమాదాలెదురౌతాయి...." అన్నాడు బాస్.

"ముందు మీ స్థావరం నా చేతుల్లో వున్నదని గుర్తుంచుకోండి. క్షణంలో నాశనం చేయగలను" అంటూ నవ్వాడు గురువులు.

శ్రీకృష్ణ పరమాత్మ అతనికంటె గట్టిగా నవ్వి "నీ ప్రాణానికి ప్రాణమైన ఈశ్వరి మా చేతుల్లో వుంది బయట నా అనుచరుల చేతుల్లో!" అన్నాడు.

గురువులు నీళ్ళుకారిపోయాడు. బాస్ రెండు అంగల్లో గురువుల్ని సమీపించి "కంట్రోల్ మిషన్ దగ్గరున్నానని ఎంత గర్వం నీకు!" అన్నాడు.

"నాకు గర్వంలేదు. ఏ కోరికా లేదు. నన్ను వదిలి పెడితే చాలు" దీనంగా అన్నాడు గురువులు.

"అజ్ఞానంకొద్దీ వదిలిపెట్టమంటున్నావు కానీ అసలైన

స్వర్గమేమిటో గుచిరించేనేక నిర్ణింక ఒక్క క్షణంకూడా మమ్మల్ని వదిలి పెట్టలేవు" అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ.

"నా అజ్ఞానంలో నేను బాధపడతాను. నాకిష్టమే!"

"కానీ నాకిష్టం లేదు" అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ.

"గురువులూ! ఇక్కడికి వచ్చి యిన్ని రహస్యాలు తెలుసుకుని బయటి ప్రపంచానికి వెళ్ళిన మనిషిని బ్రతక నివ్వడం నా ఆచారం కాదు. బ్రతకదల్చుకున్నవాడు నా దగ్గరే వుండాలి" అన్నాడు బాస్.

"నీ కోసం నేను పడ్డ శ్రమకు ప్రతిఫలం యిదా?" అన్నాడు గురువులు.

"నా అవసరంకొద్దీ నేను ఆశ పెట్టాను. నీ అవసరం కొద్దీ నువ్వు ఆశపడ్డావు. నేను కలగ చేసుకోకపోతే నువ్వీ పాటికి జైల్లో మగ్గిమగ్గి ఉరి తియబడి వుండేవాడివి. నీకు ప్రాణదానం చేసినందుకు కృతజ్ఞతగా చేసిన సేవను శ్రమ అనుకోవడం కృతఘ్నుల లక్షణం" అన్నాడు శ్రీకృష్ణ పరమాత్మ.

గురువులుకు అంతులేని ఆవేశం వచ్చింది "మీరు చాలా దుర్మార్గులు" అంటూ అతడు బాస్‌మీదకు దూకాడు. పెనుగులాటలో ఇద్దరూ టెలివిజన్ మీద పడ్డారు. అది క్రిందపడింది. అది బద్దలు కావడం చూస్తూనే బాస్ ముఖం ఎర్రబడింది.

"అయిదు నిముషాల్లో మనం అంతా బయటకు వెళ్ళక పోతే నీ ఈశ్వరిగతి అక్కడ కుక్కలగతి అవుతుంది. ఆ విషయం గుర్తుంచుకుని మాతో బయటకు రా" అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ తీవ్రంగా.

బాస్ లేచి నిలబడి "ఊఁ పద!" అన్నాడు.

గురువులు విసురుగానే అక్కణ్ణుంచి కదిలాడు.

ముగ్గురూ అక్కణ్ణుంచి బయటకు వచ్చారు. అక్కడి దృశ్యం చూసి గురువులు నివ్వెరపోయాడు.

ఈశ్వరి అక్కడ నిలబడి వుంది. ఆమె చుట్టూ నలుగురు పురుషులు అసభ్యకరంగా ఆమెను తాకుతూ గేలి చేస్తున్నారు.

"ఆగండి!" అని అరిచాడు గురువులు.

"అనవసరంగా ఉద్రేకపడకు గురువులూ! ఇక్కడ నీ మీదకు గురిపెట్టబడ్డ తుపాకులు చాలా వున్నాయి. అటు ఈశ్వరి, ఇటు నువ్వు ప్రాణాలు కాపాడుకోవడానికి కొన్ని పనులు చేయాల్సివుంది. అలాంటి అవసరం వుంటుందని యిప్పుడే నాకు స్ఫురించింది" అన్నాడు బాస్.

"ఏమిటది?" అన్నాడు గురువులు.

"నాకిష్టంలేని పని చేసిన వాళ్ళచేత నాకిష్టమైన ఆటలాడించడం నాకు సరదా. మొత్తం మూడు రౌండ్స్" అన్నాడు బాస్.

గురువులుకు రామేశం చెప్పిన కథ గుర్తొచ్చింది. తను మళ్ళీ అనుకోని యిబ్బందిలో పడుతున్నాడా? బాస్ చెప్పబోయే ఈ ఆటలో పాల్గొని తను ప్రాణాలతో బయటపడతాడా?

బాస్ జేబులోంచి ఒక బ్లేడుతీసి గురువులు చేతికిచ్చాడు "ఈ బ్లేడుతో నీ ప్రియురాలి కుడిచేతి అయిదు వేళ్ళమీద సన్నగా రక్తం చిమ్మేలా గాయం చేయాలి" అన్నాడు.

గురువులు రక్తం మరిగింది. చుట్టూ చూశాడు. అటు ఈశ్వరి పరిస్థితిగానీ, ఇటు తన పరిస్థితిగానీ ఏమీ బాగా లేదు. బాస్ ఆజ్ఞ పాటించక తప్పదు. అతను ఈశ్వరిని

సమీపించాడు. ఈశ్వరి తన కుడిచేతిని ముందుకు చాపి "గత్యంతరం లేదు, సందేహించకు!" అంది.

గురువులు భయంతో బాధతో కళ్ళు మూసుకున్నాడు. అతను ఎన్నో హత్యలు చేసి వుండవచ్చు. కానీ ఎన్నడూ యిలా అమానుష కృత్యం చేస్తున్నట్లు భావించలేదు. ఈశ్వరి చేతిని గాయపరచాలంటే అతనికి తన ప్రాణాలెవరో తోడేస్తున్నట్లుగా వుంది. అయినా తప్పలేదు. "బహుశా ఇది నేను చేసిన పాపాలకు శిక్ష అనుకుంటాను. శత్రువును కత్తితో పొడిచిన చేయి ప్రియురాలి మృదుహస్తాలను గాయపర్చబోతోంది" అంటూ అతను ఆమె చేతి వ్రేళ్ళపైన సన్నగా గీశాడు. మృదువైన ఆమె చేతివేళ్ళపై రక్తం చిమ్ముతోంది. గురువులు బాధగా కళ్ళు మూసుకున్నాడు.

బాస్ జేబులోంచి ఒక నిమ్మకాయ తీసి—"గురువులూ—దీన్ని రెండు చెక్కలు చేసి నీ ప్రియురాలికియ్యి. ఆమె తన కుడిచేత్తో స్వయంగా నా నోట నిమ్మరసం పిండితే తాగాలని మనసు పడుతున్నాను. రక్తధారలతో కలిసిన నిమ్మరసం నాకు చాలా యిష్టం...." అన్నాడు.

తర్వాత బాస్ ఒక మనిషిని పిలిచి—"ఆమె నా నోట్లో రసం పిండుతున్నంతసేపూ బాధగా మూలిగినప్పుడల్లా ఆమె వీపు మీద కొరడా ప్రయోగించు...." అన్నాడు.

అన్ని ఏర్పాట్లూ పూర్తయ్యాయి—నిమ్మచెక్కలతో ఈశ్వరి తనను సమీపించినపుడు బాస్ ఈశ్వరిని చూసి "నిన్ను అనుభవించి ఆనందించాలనుకున్నాను. కానీ నువ్వు నామీద పెద్ద దెబ్బ తీశావు. నువ్వు నాకు చేసినదానికి

ప్రతిగా నేను చేస్తున్నది చాలా స్వల్పం. నిమ్మరసంలో గింజలుంటే నాకు నచ్చవు. గింజల్ని ముందుగానే తీసేయ్. ఎడంచేయి ఉపయోగించకు...." అన్నాడు.

ఆ బాధ అంతా పంటి బిగువున భరిస్తూ ఈశ్వరి అతడి నోట్లో నిమ్మరసాన్ని పిండింది.

ఆమె బాధనూ, ఆవసనూ చూస్తూ శ్రీకృష్ణపరమాత్మ బాస్ లేస్తును ఆభినందించాడు. గురువులుకు వళ్ళు మండి పోయింది. నిస్సహాయంగా చూస్తూ నిలబడ్డాడు.

"ఇది ఫస్టు రౌండ్!" అన్నాడు బాస్—"ఇందులో ప్రియుని కారణంగా ప్రియురాలు గాయపడింది. రెండో రౌండ్లో ప్రియురాలి కారణంగా ప్రియుడు గాయ పడ తాడు—"

ఈశ్వరి భయం భయంగా బాస్ వంక చూసింది. ఆమె లోని స్త్రీ హృదయం ప్రియుని గురించి తానెన్ని బాధల నైనా సహించడానికి సిద్ధంగా వుంది. కానీ తన కార ణంగా ప్రియుడికి బాధ కలగకూడదని కోరుకుంటోంది.

"ఈశ్వరి నేలపైన పడుకుంటుంది. ఆమెకు పదికొరడా దెబ్బలు శిక్ష. ఆ దెబ్బలు తగులుతున్నంత సేపూ ఆమె కదల కూడదు. కదిలితే శిక్ష పెరుగుతుంది. గురువులామెను రక్షించవచ్చు. కానీ ఆమెను అతను చేత్తో కదపకూడదు. కొరడాను చేత్తో తాకకూడదు. దెబ్బలకు అడ్డునిలిచి మాత్రమే రక్షించాలి. ఈ రూల్సు పాటించకపోతే ఇద్ద రికీ కఠినశిక్ష వుంటుంది."

బాస్ మాటలు వింటూ గురువులు ఊపిరి బిగబట్టాడు. అక్కడ ఈశ్వరి లేనిపక్షంలో తానేదైనా సాహసానికి ఒడిగట్టి వుండేవాడు. కాని ఇప్పుడు పూర్తిగా నిస్సహా యుడైపోయాడు.

ఆ రౌండ్ కూడా పూర్తయిపోయింది.

గురువులు శారీరకంగా బాధపడినప్పటికీ తనకారణంగా ఈశ్వరి వంటిమీద ఒక్క దెబ్బకూడా పడలేదని ఆనందించాడు.

"ఇప్పుడు థర్డ్ రౌండ్!" అన్నాడు బాస్.

గురువులు, ఈశ్వరి ఊపిరి బిగబట్టారు. ఈ కిరాతకుడిప్పుడెలాంటి సరదా తీర్చుకోబోతున్నాడోనని ఇద్దరికీ భయంగా వుంది.

"లైలామజ్నూలను మించిన ప్రేమకులీ ప్రేయసీ ప్రియులు. అటువంటి ఘట్టాన్ని వారభినయిస్తారు. ఇద్దరికీ రెండు చీటీలు యిస్తాను. ఒకదాంట్లో "చంపు" అని ఉంటుంది. రెండోదాంట్లో "చావు" అని వుంటుంది. ఆ ప్రకారం యిద్దరిలో ఒకరు రెండవవారిని చంపాలి. చావవలసిన వారు చంపేవారిని గాఢంగా కౌగలించుకుంటారు. చంపేవారు రెండు చేతుల్లో కత్తిని బలంగా చావలవసినవార వీపులో దింపాలి."

శ్రీకృష్ణపరమాత్మ సంతోషంతో చప్పట్లు చరుస్తూ "నీకు నా జోహార్లు. ఇటువంటి ప్రదర్శనలిచ్చే వినోదం ముందు ఈ ప్రపంచంలో మరేదీ సాటిరాదు" అన్నాడు.

వణుకుతున్న చేతుల్తో తన చీటీ తీసుకున్నాడు గురువులు. "చావు" అని వ్రాసివుంది. "నాకు చావాలని లేదు!" అంటూ అరిచాడు గురువులు.

అదే సమయంలో "నాకు చంపాలని లేదు!" అంటూ అరిచింది ఈశ్వరి.

"అందుకే ఈ ప్రదర్శన నాకు వినోదభరితం" అన్నాడు బాస్.

గురువులు చూస్తూండగానే ఈశ్వరిచేతికి కత్తి

అందింది.

ఇన్నాళ్ళ తన జీవితం ఈ విధంగా అంతం కావల సిందేనా? అతను చుట్టూ చూశాడు. తనచుట్టూ తుపాకులు ధరించిన మనుషులు.

"నీ ముఖకవళికలు అద్భుతం. ఈ ప్రదర్శనలో సగం థ్రిల్లు ముఖకవళికలు చూసి ఆనందించడంలోనే వుంది" అంటూ వికటంగా నవ్వుతున్నాడు బాస్.

ఈశ్వరి గురువుల్ని సమీపించింది. గురువులు చుట్టూ చూస్తున్నాడు. తనూ ఈశ్వరీ కలిసి తప్పించుకునే అవకాశం ఎక్కడా కనబడ్డంలేదు. తను తప్పించుకోగలిగితే ఈశ్వరి తనకు దక్కదు. అలాంటప్పుడు బ్రతికిమాత్రం ఏం ప్రయోజనం.

గురువులు ప్రాణాలకు ఆశ వదులుకున్నాడు. ప్రియురాలి చేతిలో చనిపోవటం కూడా ఒక అదృష్టమేనని మనసు సరిపెట్టుకుని ముందడుగువేసి ఆమెను బలంగా కౌగలించుకున్నాడు. జీవితంలో మళ్ళీ తనకు దొరకని ఆమె తని స్పర్శ వెచ్చగా, హాయిగా, ఏదోలా యెప్పటికీ వదులుకోవాలనిపించకుండా వుంది. ఆ కౌగిలికోసం మళ్ళీ బ్రతుకుమీద ఆశ పుడుతోంది. ఆ కౌగిలిని తగినంత కాలం అనుభవించని జీవితానికి అర్థంలేదనిపిస్తోంది. అయితే అది మృత్యుకౌగిలి అని అతనికి తెలుసు.

ఈశ్వరికి కూడా ఆ కౌగిలి ఎంతో సుఖంగా వుంది. ఆమె చేతులు తడబడిపోతున్నాయి. గురువులు వీపులో పొడవగల శక్తి తనకున్నదని ఆమెకు అనిపించడంలేదు.

"నేను మూడు అంకెలు లెక్కపెట్టేలోగా చెప్పిన పని చేస్తే ఈశ్వరి బ్రతుకుతుంది. లేదా యిద్దరి గుండెల్లోనూ ఒకేసారి తూటాలు దిగుతాయి" అన్నాడు బాస్.

గురువులు, ఈశ్వరి ఊపిరి బిగబట్టారు. ఇద్దరూ ఒకే సారి చస్తే అంతకంటే కావల్సినదేముందని ఇద్దరూ అనుకున్నారు.

బాస్ అంకెలు మొదలుపెట్టాడు "రెడీ వన్, టూ... త్రీ."

ఈశ్వరి చేతిలోని కత్తి నేలమీదకు జారవిడిచింది. అయితే అదే సమయంలో తుపాకులు మ్రోగిన చప్పుడయింది. అక్కడ కాదు. కాస్త దూరంగా....

ప్రాణంపోతోందో లేదో తెలియనిస్థితిలో గురువులు, ఈశ్వరి స్పృహతప్పి క్రింద పడిపోయారు.

* * *

"శ్రీకృష్ణపరమాత్మ ప్రయివేట్ డిటెక్టివ్ అనే సదభిప్రాయంతో నేనతన్ని సాయంకోరాను. మేం ముందుగా అనుకున్నట్లుగానే అపూర్వనిధి అనే అతనికీ చెప్పాను. అంతే__ నేనూ, నా కొడుకు కూడా అతనికి బందీలయ్యాం.

మా అదృష్టవశాత్తూ కొద్దిరోజుల క్రితం ఎలాగో తప్పించుకుని బయటపడి రామేశం దగ్గరకు చేరాం.

అక్కడ పరిస్థితులన్నీ తెలిశాయి. రామేశానికి శ్రీకృష్ణ పరమాత్మ అసలు స్వరూపం చెప్పేశాను. ఆయన చాలా కంగారుపడ్డాడు. ఈలోగా రామేశం మనవడు రాము ఆటవిక ప్రాంతం నుంచి సురక్షితంగా అక్కడికి చేరుకుని గురువులు సహకారంతో అపూర్వనిధి చేరుకున్నట్లు చెప్పాడు. గురువులు సాధించిన విజయం వింటూంటే అతను అపూర్వనిధిని జయించగలడనిపించింది.

పోలీసుల సాయంతో నిధివద్దకు బయల్దేరాం. మొదటి

ప్రయత్నంలో కొన్ని ప్రాణాలు నష్టమైపోయాయి. అయినా పట్టువిడవకుండా మరో ప్రయత్నం చేసి ఇక్కడకు రాగలిగాం. దూరాన్నుంచి యిక్కడి పరిస్థితి చూశాం. వేరే గత్యంతరం కనబడలేదు. పోలీసులు తమ వద్దనున్న స్పృహతప్పించే బాంబులు విసిరారు. గుండగులందరూ లొంగిపోయారు" అన్నాడు అంకూర్.

"శ్రీకృష్ణపరమాత్మ మంచివాడనుకోలేదు కానీ చివర్లో నాక్కూడా అపకారం తలపెడతాడని ఊహించలేక పోయాను. ఇక్కడున్న అపూర్వనిధి నాయకుడికీ పరమాత్మకూ స్నేహముందని ముందుగా ఏమాత్రం ఊహించ గలిగినా చాలా జాగ్రత్తపడి వుండేవాడిని. కానీ నేను నేరస్థుణ్ని. నా మనస్తత్వం నేరాలకు ప్రోత్సహించేది. అందుకని నేను శిక్షలు అనుభవించక తప్పదనుకుంటాను. నాలాంటి దుర్మార్గుణ్ని ప్రేమించినందుకు ఈశ్వరి కూడా అవస్థలు పడాల్సివచ్చింది" అన్నాడు గురువులు.

"గురువులూ! నువ్వు దేశానికి మహోపకారం చేశావు. నీ కారణంగా ఈ దేశపు మర్యాద నిలిచిందన్నా ఆశ్చర్యం లేదు. నువ్వు చేసిన తప్పులన్నింటినీ దేశం తప్పక క్షమిస్తుంది. నువ్వు మామూలు జీవితం గడపడానికి అవకాశముంది. నీ గతజీవితం యెలాంటిదైనప్పటికీ నువ్వు చేసిన ఒక్క మంచిపనితో ఆ తప్పులన్నీ క్షాళనమైపోయాయి. కానీ ఇకమీదట పవిత్రమైన జీవితం గడపడానికి ప్రయత్నించు" అన్నాడు అక్కడున్న పోలీస్ అధికారి.

"గురువులులాంటి నరహంతకుణ్ని అర్థంచేసుకోగలిగిన మీరు నన్నుమాత్రం యెందుకు అర్థంచేసుకోరు? జైల్లో మగ్గి చావవలసిన గురువులుగార్ని నేనక్కణ్ణుంచి తప్పిం

చాను. నా కారణంగా నే గురువులు ఘనవిజయం సాధించి ఈ అంతర్జాతీయ గూఢచారి శాఖ రహస్యాన్ని బయట పెట్టగలిగాడు. అందుకు ప్రభుత్వం నన్నూ అభినందించ వలసివున్నది" అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ.

"నువ్వు చివర్లో యిక్కడి మనుషులతో చేతులు కలప కుండా ఉండివుంటే తప్పకుండా నిన్నభినందించి ఉండే వాళ్ళం. అయినా యిప్పుడు మాత్రం నీకేం తక్కువ చేయడంలేదు. నిన్ను నీ జన్మస్థానానికే పంపబోతున్నాము. అదెంత గౌరవం!" అన్నాడు పోలీస్ అధికారి.

రామేశం, ఠాకూర్ నవ్వారు.

గురువులు మాత్రం "ఈ లోకంలో నా అంతో అమా నుషమని అనుకుంటూండేవాడిని. కానీ గంగాపురం, ఆట వికప్రాంతంలో నేను పొందిన అనుభవాలు, యిక్కడ అపూర్వనిధి మనుషుల సరదాలు చూశాక ఈ ప్రపంచంలో ఎంత అమానుషం నిండివుందో గ్రహించాను. నా ద్వారా తన పనులన్నీ పూర్తి చేయించుకుని ఆఖరున నేను బాధలు పడుతూంటే చూస్తూ వినోదించిన ఈ శ్రీకృష్ణపరమాత్మ ప్రవర్తన అన్నిటికంటే అమానుషం అనిపించింది. ఇప్పుడు నామీద నాకుగల గౌరవం పెరిగింది" అన్నాడు.

"అందులో న్యాయం వుంది" అన్నాడు రామేశం. "అయితే ప్రతిమనిషిలోనూ అజ్ఞాతంగా అమానుషత్వం దాగివుంటుంది. అందుకు సాక్ష్యం నేనే! ఒకప్పుడిక్కడి బాస్ నన్నెంతగానో హింసించి వినోదించాడు. పగవాళ్ళ క్కూడా అటువంటి హింసలు వద్దని అప్పట్లో నేను అను కున్నాను. కానీ యిప్పుడలా అనిపించడంలేదు. ఇతరుల నెలాంటి బాధ పెట్టాడో, అలాంటి బాధలు బాస్ పడుతూంటే చూసి వినోదించాలని ఉంది నాకు. అది

అమానుషమే కావచ్చు. నాలో యిప్పుడా కోరిక వుంది—"

"నాలోనూ ఉంది" అన్నాడు ఠాకూర్.

"నాలోనూ ఉంది" అన్నాడు గురువులు.

"నాలోనూ ఉంది" అంది ఈశ్వరి.

"మీ మాటలు వింటూంటే నాకూ అటువంటి కోరిక కలుగుతోంది" అన్నాడు అక్కడున్న పోలీస్ అధికారి.

వారందరి కోరికలు వింటూంటే అపూర్వనిధి బాస్ ముఖంలో బెదురు కనబడింది. శ్రీకృష్ణపరమాత్మలో కంగారు కనబడింది.

"మొత్తం మూడు రౌండ్స్" అన్నాడు ఠాకూర్.

"మొదటిరౌండ్ ఆట నేను తయారుచేస్తాను" అన్నాడు రామేశం. రెండవ రౌండు ఠాకూర్ తయారు చేస్తానన్నాడు. మూడవరౌండు గురువులు, ఈశ్వరి చేస్తానన్నారు.

రామేశం తన ఆట చెప్పాడు.

బాస్, శ్రీకృష్ణపరమాత్మ ముఖాల్లో నెత్తురు చుక్క లేదు.

—: సమాప్తం :—

## "ముఖచిత్ర వాఖ్యాల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- నగదు బహుమతి పంపుతాము.

## "హోమ్ డెలివరీ

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 8/-లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ ఇంటిదగ్గర అంద జేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీల కోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగడం సరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 90/- లు ముందుగా పంపవచ్చును.



# క్రైమ్‌లో తమాషాలు

[ఈ శీర్షికలో ప్రచురింపబడే ప్రతి రచనకు రు. 5 లు పారితోషికం ఇవ్వబడును—ఎడిటర్]

## దొందూ దొందే!

సుబ్రావు భార్యతో కొట్లాడి మనసు బాగాలేక పోవడంతో పిక్చరు కెళ్లాడు. థియేటర్‌లో కూర్చున్నాడేగాని అతని మనసు భార్య చుట్టూ తిరుగుతూనే వుంది॥

లేకపోతే....? తను చెడు తిరుగుళ్ళు తిరుగుతూ కొంపకి ఆలస్యంగా వస్తున్నాడని దెబ్బలాడుతుందా? అవును. తను మగాడు. తను రజనితోనేగాదు, మరే రంగసానితోనైనా కులుకుతాడు. అడగడానికదెవరు? సంపాదించి సరుకులు తెస్తే వండిపెట్టడమే దాని డ్యూటీ!

ఆలోచిస్తున్న సుబ్రావు వళ్ళో ఓ 'ఆడ' చేయి పడి గిలిగింతలుపెట్టింది. ఆలోచనల్ని కట్టిపెట్టి విజృంభించాడు. 'ఆమె' ఎవరో మెల్లిగా ప్రశ్నించాడు.

తన పేరు 'సౌమ్య' అట. పెళ్ళికాలేదట. తలిదండ్రులు యిష్టంలేని పెళ్ళి చెయ్యాలని వున్నారట. పెద్ద ఆస్తి వుందట. పెళ్ళిచేసుకోమని అడిగింది. సినిమా పరిచయానికే పెళ్లి చేసుకోమని అడిగిన ఆడది ఎలాంటిదయి వుంటుందో వూహించాడు సుబ్రావు.

తనకి పెళ్ళయిందని చెప్పి తప్పుకున్నాడు. అయితే శోభా లాడ్జికి పోదామంది. కుర్చీలోనే ఎగిరి గంతేశాడు. తను వేడెక్కాడు. సౌమ్యను వేడెక్కించాడు.

యింటర్వెల్‌కి సూచనగా బెల్ మ్రోగింది. లైట్లు వెలిగాయి.

సౌమ్యని చూసిన సుబ్రావు మొహంలో కత్తివాటుకి నెత్తురుచుక్క లేదు.

ఆమె సుబ్రావు భార్య సావిత్రి!!!

—కె. బి. యస్. కుమార్, కర్నూలు.

## "కోక సర్దుకో"

కో ఎడ్యూకేషన్ కళాశాల్లో చదువుతున్న 'వనమాలిని' తన వక్ష సంపదను ప్రదర్శిస్తూ. ఆ క్లాసులోని యువకుల్ని వెర్రెత్తిస్తుండేది. ఇది భరించలేని ఓ కొంటె విద్యార్థి ఆమెను ఉద్దేశిస్తూ బ్లాక్ బోర్డ్ పైన యిలా వ్రాసాడు.

"కోక - సర్దుకోవటం నేర్చుకో!"

అప్పుడే క్లాసులోకి వచ్చిన తెలుగు మాష్టారూ అదిచూపి ఆ గడుగ్గాయికి తెలిసేలా 'అల్లరి పెట్టు' - అనే పదాన్ని అతను వ్రాసిన వ్యాఖ్యానికి మొదట చేర్చాడు.

తనని ప్రోత్సహిస్తున్నాడని సంబర పడ్డ ఆ విద్యార్థి పూర్తి వ్యాఖ్యాన్ని కలిపి చదివి తెల్లమొగం వేశాడు.

—యస్. సత్యానంద్, బెల్లంపల్లి.

## పిసినారి!!

"నేనిప్పుడు అద్దెకుంటున్న ఇల్లు ఖాళీ చేసెయ్యాలనుకుంటున్నానోయ్।"

"ఏం పొరుగింటివాళ్ళు మంచివాళ్ల కాదేమిటి?"

"అబ్బే అదేం కాదోయ్. ఇంటాయన కాస్త పిసినారి...."

"అయితే-?"

"ఇంట్లో దిగి ఆర్నెల్లాయినా కాలేదు. అప్పుడే యింటద్దె....యింటద్దె అని ఒకటే కాకి గోల ...!!"

— నానిబాబు, విశాఖపట్టణం-4.

## పొగత్రాగేవాడు??

పిల్లలు చెడు అలవాట్లు మరగకుండా వుండేందుకు, వాటివల్ల కలిగే అనర్థాలను వివరిస్తున్నాడు మాష్టారు.

"చూడు గోపీ। పొగత్రాగే వాడ్ని దున్నపోతు అంటారు...."

గోపీ ఠక్కున లేచి -

"సార్....సార్... దున్నపోతు వస్తోందీ....।" అంటూ కిటికిలోంచి అవతలకి చూపించాడు.

అవతలకి చూసిన మాష్టారుకి, సిగరెట్ త్రాగుతూ వస్తున్న ఆ స్కూల్ హెడ్‌మాష్టర్ కనిపించాడు.

— యం. వీరాస్వామి, మల్కాజిగిరి.



